

దక్షిణాపథంపై ఏకచ్ఛత్రాధిపత్యం నెరపిన

ఆంధ్రచక్రవర్తి, విచక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలు (తిరుపతిలోని ప్రతిమ)

—ఫొటో: డి. ఎస్. రామమూర్తి.



"తంధా న తా నా"

"వినరా ఆంధ్రుల వీరచరితమది  నవరస భరితమురా...."

చిత్రకారుడు : నక్కల మునుస్వామి–మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 5
3-10-56

దుర్ముఖ భాద్రపద బహుళ చతుర్దశి బుధవారం

## విషయానుక్రమణిక



# ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక సంచిక

## [రచయితలకు విజ్ఞప్తి]

నవంబరు 1 వ తేదీన ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు ఏకమై ఆంధ్ర ప్రదేశ్ అవతరించనున్నది.

సర్వాంధ్ర ప్రజల సముజ్జ్వల భవిష్యత్తుకు ఆనాడు శంకుస్థాపన జరుగనున్నది. దీపావళి శుభముహూర్తం కూడా ఆనాడే. తెలుగునాట ఇంటింటా, ఊరూరా నూతన రాష్ట్రావతరణ సంరంభాన్ని దీప్తిమంతం చేసే దీపతోరణాలు వెల్లివిరుస్తాయి.

ఈ శుభసందర్భం పురస్కరించుకుని ఆంధ్ర వారపత్రిక అక్టోబరు 31 వ తేదీ సంచిక "ఆంధ్రప్రదేశ్ అవతరణ ప్రత్యేక సంచిక"గా వెలువడుతుంది.

ఆంధ్రులు రాజకీయంగా, సాంస్కృతికంగా, ఇతరవిధాలుగా సృష్టించిన మహత్తర చరిత్రను సమీక్షించే వ్యాసాలు, కథలు, నాటికలు, పద్యాలు, ఫోటోలు ప్రచురించి ఆ సంచికను సర్వాంగసుందరంగా తయారుచేయాలని మా అభిలాష. వ్యాసరచయితలు, కవులు, కథకులు, చిత్రకారులు మా ప్రయత్నంలో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

అతి ప్రాచీనమైన ఆంధ్రచరిత్రలో శాతవాహనులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర చక్రవర్తులు, వారివారి కాలాల్లో వర్ధిల్లిన కవులు, చిత్రలేఖకులు, శిల్పులు, మతాచార్యులు, అనేక విధాలుగా జాతికి గర్వకారణమైన సంస్కృతి సంపద సృష్టించారు. ఆయా చారిత్రికఘట్టాలాధారం చేసుకుని రచించిన వ్యాసాలను, ముఖ్యంగా కథలను, నాటికలను ఇతర రచనలను ఆహ్వానిస్తున్నాము.

ఆంధ్రలో అమూల్యమైన ప్రకృతిసంపద ఉన్నది. ఆసంపదను నిత్యజీవితావసరాలకు అనుగుణంగా మలచి, అభివృద్ధి చేసుకోవలసిన బాధ్యత మనమీదనే ఉన్నది. ఇది దృష్టిలో పెట్టుకుని నిర్మాణాత్మకమైన సూచనలు చేసే వ్యాసాలు పంపించవలసిందిగా రచయితలకు విజ్ఞప్తి.

★ రచనలు, ఫోటోలు అక్టోబరు 13వ తేదీలోగానే మా కార్యాలయానికి అందేట్లు పంపాలని కోరుతున్నాము. "ఆంధ్రప్రదేశ్ ప్రత్యేకసంచికకు" అని రచనపైన వ్రాస్తే మాకు సహాయకరంగా ఉండగలదు.

—ఎడిటర్.

# ఆంధ్రప్రదేశ్ నాయకత్వం

ఆంధ్రజాతి ఆధునిక చరిత్రలో అక్టోబరు 1 అతిపవిత్రమైన దినం. దాదాపు వాల్గు దశాబ్దులపాటు సాగించిన మహోద్యమం ఫలితంగా, అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానం ఫలితముగా ఆంధ్రులు స్వరాష్ట్రాన్ని సాధించుకున్న రోజు అది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడి మూడేళ్లు నిండినవి. రాష్ట్రావతరణ తృతీయ వార్షికోత్సవాన్ని ఈ 1 వ తేదీన జరుపుకుంటున్నాము.

ఇప్పటివరకూ పదకొండు జిల్లాలను మాత్రమే కలిగివున్న మనరాష్ట్రం మరొక మాసంరోజులలో (నవంబరు 1 నాటికి) 20 జిల్లాలతో సువిశాలమైన రాష్ట్రం కాబోతున్నది. అదే ఆంధ్రప్రదేశ్. తెలుగుభాష మాటాడే మరో కోటిమంది మాత్రం రాష్ట్రంలో చేరుతారు. ఆంధ్రప్రదేశ్ దాదాపు 110 లక్షల చదరపుమైళ్ల విస్తీర్ణాన్ని, 3 కోట 22 లక్షల జనాభానూ కలిగివుంటుంది. పునర్వ్యవస్థీకరణ సంఘం సిఫార్సుల ఫలితంగా నవంబరు 1 న ఏర్పడే కొత్తరాష్ట్రాలలో ద్విభాషా బొంబాయి, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్‌ల తర్వాత విస్తీర్ణంలో మనదే పెద్దరాష్ట్రం. జనాభా విషయంలో నాల్గోస్థానం ఆక్రమిస్తాము. ఇది నవంబరు 1 న ఏర్పడే నూత్న రాష్ట్ర స్థూలస్వరూపం. ఇకమీద మనం ప్రతి ఏడాదీ నవంబరు 1 న ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాలు కోలాహలంగా జరుపుకుంటాము.

ఎన్నెన్నో ఏళ్ళ నుంచీ కలలు కన్న విశాల ఆంధ్రరాష్ట్రం ఏర్పడబోతున్నదనే సంతోషం ఒకవైపు వున్నప్పటికీ, కొత్త రాష్ట్రంలో నాయకత్వం కోసం ప్రస్తుతం మనవారు ప్రదర్శిస్తున్న పోటాపోటీలు, తాపత్రయం మాత్రం సహృదయుడైన ప్రతి తెలుగువాడినీ విశేషంగా బాధిస్తున్నవి. కాంగ్రెస్ పక్షంలోని వివిధవర్గాలవారు (అటు తెలంగాణాలో, ఇటు ఆంధ్ర రాష్ట్రంలో కూడా) బలాబలాల ప్రదర్శనకు సంసిద్ధులవుతున్నారు. తమ తమ బలాల నిరూపణకై సంతకాల సేకరణకు సైతం ఉద్యుక్తులైనారు. నాయకుని ఎన్నిక ఏకగ్రీవంగా వుండవలసిన ఈ సమయంలో మనవారు ఈ విధంగా ప్రవర్తించడం నిజంగా శోచనీయమైన విషయమే. కాంగ్రెస్ అధిష్ఠానవర్గం కూడా ఈ ధోరణిన్ని తీవ్రంగా నిరసించింది.

హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు నాయకత్వానికి జరిగే పోటీలో తాము పాల్గొనేది లేదనీ, 1957 ఫిబ్రవరిలో జరిగే ఎన్నికలలో లోక్‌సభ అభ్యర్థిగా నిలవదలిచామనీ స్పష్టంగా ప్రకటించారు. ఆంధ్ర తెలంగాణాలు ఏకంకాబోతున్న ఈ సమయంలో ఆంధ్రప్రదేశ్ నాయకత్వానికి తగాదా పడడం, పోటీ పడడం జరిగితే తెలుగునాట అనైక్యత సిరపడిపోతుంది సుమా అని హెచ్చరిక కూడా చేశారు. రాజకీయ రంగంలో అత్యంత అనుభవజ్ఞుడు, పరిపాలనాదక్షుడు అయిన శ్రీ రామకృష్ణరావు చేసిన ఈ హెచ్చరికలో ఎంతైనా నిజం వున్నది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పేరును మరొక మూడు వారాలలో నిర్ధారణ చేసుకోవలసివున్నది కాబట్టి, ప్రతి కాంగ్రెస్ శాసనసభ్యుడు, నాయకత్వాన్ని అభిలషిస్తున్న పెద్దలు ప్రస్తుత పరిస్థితులలో ఎవరు నాయకత్వం వహిస్తే మంచిదో జాగ్రత్తగా ఆలోచించి, ఆత్మపరిశీలన చేసుకుని ఏకగ్రీవనిర్ణయానికి రావలసిన సమయం ఆసన్నమైంది.

ప్రస్తుత పరిస్థితులలో ఆంధ్రప్రదేశ్ నాయకత్వం ఎవరు వహించినా గురుతరమైన అనేక కొత్త బాధ్యతలను, కొత్త సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చే మాట వాస్తవం. ఈ బాధ్యతల నిర్వహణంలో చాకచక్యాన్ని రాజనీతిజ్ఞతనూ ప్రదర్శించగలిగిన వ్యక్తే నాయకత్వాన్ని స్వీకరించడం యోగ్యమనిపించుకుంటుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాల్గునెలలలోనే తెలంగాణా జిల్లాలలో రాష్ట్ర శాసనసభకు, పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతవి. తెలంగాణా రాజకీయ వ్యవహారాలు కూడా క్షుణ్ణంగా తెలిసిన అనుభవశాలి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయినపక్షంలో, అక్కడ జరగవలసిన ఎన్నికల ప్రచారకార్యక్రమం సులభసాధ్యమవుతుంది. అందుచేత అటు తెలంగాణా జిల్లాలలోనూ, ఇటు ఇతరజిల్లాలలోనూ నివసిస్తున్న ప్రజలందరి విశ్వాసానికీ పాత్రుడైన వ్యక్తికి నాయకత్వం అప్పగించడం సమంజసమనిపించుకుంటుంది.





బెంగాలీచిత్రం "పథేర్ పాంచాలీ" కి లభించిన రాష్ట్రపతి సువర్ణ పతకాన్ని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ చేతినుండి అందుకుంటున్న బెంగాల్ ప్రభుత్వ ప్రతినిధి శ్రీ మథుర్.

యూరప్ యాత్రానుభవాలపై వ్రాసిన ఈ ఆరవ వ్యాసంలో శ్రీ కృష్ణ, ఒకప్పుడు ప్రపంచమంతా బ్రిటన్‌ను చూసి అనేక విషయాలు నేర్చుకునేదనీ ఇప్పుడు ఆ బ్రిటనే భారత దేశాన్ని అనుకరిస్తున్నదని వ్యాఖ్యానిస్తున్నారు. ఫ్రెంచి వనితల అంద చందాలను, స్విస్ స్త్రీల చాకచక్యాన్ని కూడా ఉదాహరణల పూర్వకంగా వర్ణిస్తున్నారు.

# భార్య పోయిన ఫ్రెంచి భర్త వింతగాథ

## ఓడలు బళ్లు; బళ్లు ఓడలు

ఓడలు బళ్లూ, బళ్లు ఓడలూ అవుతవంటారు. ఏ విషయంలోనైనా ఒకప్పుడు ప్రపంచానికి బ్రిటిష్‌వారు పెట్టిందే భిక్ష. బ్రిటిష్‌వారిని చూసి మిగతా ప్రపంచమంతా పాఠాలు నేర్చుకుంటుండేది. ఇప్పుడు పరిస్థితులు మారిపోయినవి. భారతీయులను చూసి బ్రిటిష్‌వారు అనేక విషయాలు నేర్చుకుంటున్నారు. భారతదేశాన్ని బ్రిటన్ అనుకరిస్తున్నదన్నమాట!

తాను చేస్తున్న పని మీద ఏ భారతీయుడికీ ఎప్పుడూ గౌరవభావమున్నట్టుండదు. ఈ విషయంలో బ్రిటిషువారుకూడా భారతీయులమాదిరిగా నే తయారవుతున్నారు. పనిచేస్తున్నంతసేపూ బ్రిటిష్‌వారి కళ్లు గడియారంమీదే వుంటవి ఎప్పుడెప్పుడు టైమౌతుందా, ఎప్పుడు పీడ విరగడ చేసుకుని బయటపడదామా అని ఎదురు చూస్తుంటారు.

శ్రేయోరాజ్య సిద్ధాంతం కదండీ మరి! ఇందులో ఉత్తమ పురుష ఏకవచన ప్రయోగానికి ఆస్కారమెక్కడా లేదు. 'నేను' అంటే 'బూతు' "వారు" అనాలి. అంటె ప్రభుత్వం వారన్నమాట సమస్త కార్యకలాపాలనూ నిర్వహించవలసింది ప్రభుత్వమేకదా మరి! ఐతే, మామూలు పౌరుడు చేసేదేమిటంటారేమో? పౌరుడి బాధ్యతలన్నీ "ప్రైవేట్ రంగానికే" పరిమితమై వుంటవి. అంటే విశృంఖలంగా వ్యక్తిగత రంగంలో సంతానోత్పత్తి పరిశ్రమను సాగించవచ్చునన్నమాట. ఈ రంగంలో కూడా పాశ్చాత్యరాజ్యాల పరిస్థితి తీసికట్టుగానే వున్నది; "నాకాయువ్యం; నాకారోగ్యం" అనే స్వార్థబుద్ధిద్యోతక మవుతున్నది. ఎవరిమటుకు వారు తమ క్షేమాన్నే, తమ లాభాన్నే, తమ సౌఖ్యాన్నే ఆలోచిస్తుంటారు. ఈ స్వార్థబుద్ధి సహజంగా సంతాన నిరోధానికీ, దీనిద్వారా జనాభామీద అదుపుకూ దారి తీస్తున్నది.

ఈ విషయంలో మనదేశం ధోరణి మాత్రం అది కాదు. ఎలాగైనా భారతదేశం ఘరానా అయినదీ, ఉదారమైనదీ కదూ? వర్తమాన కాలాన్ని గురించిన బెంగ భారతదేశానికి ఎన్నడూ, ఏ కోశానా లేదు. వర్తమాన పరిస్థితులు విషమంగా పోయినా ఫరవాలేదు! ఇక్కడ మనవారి జీవితంమీద కూడా "వ్యక్తి భక్తి" ప్రభావం పుష్కలంగానే వున్నప్పటికీ, ప్రతి భారతీయుడు ఐహిక జీవితం మాట ఎలా వున్నప్పటికీ, పారమార్థిక జీవితాన్ని గురించి మాత్రం బహు తాపత్రయం పడుతుంటాడు. కనీసం ఒక్క కొడుకైనా వుంటేనే గాని పరలోకయాత్రకు "ప్యాస్ పోర్టు" దొరికినట్టుగా భావించడు ప్రతి హిందువుడికీ కుమారులెంతమందివున్నా విధిగా ఒక కుమారుడుకూడా వుండాలి.

### కాంగ్రెస్ దేవుళ్లు

శ్రేయోరాజ్య సిద్ధాంతం అతిగాశికి అదనపు ప్రోద్బలాన్నీ, ప్రోత్సాహాన్నీ చేకూరుస్తున్నది. ఇదివరలో ప్రతి భారతీయుడూ ఏ పని చేసినా, భగవంతుడిమీద భారం వేసి "పాలముంచినా, నీటముంచినా...అనే ధోరణిలో నడుచుకునేవారు. ఆ రోజులు గతించినవి. ప్రస్తుతంమాత్రం "కాంగ్రెస్ దేవుళ్ల" మీదే ఆధారపడి నడుచుకోవటం జరుగుతున్నది. తన జీవనప్రమాణాన్ని ఒక స్థిరమైన స్థాయిలో వుంచుకోడానికి ఎంతటి త్యాగం చేయడానికైనా బ్రిటిష్ పౌరుడు సర్వదా సిద్ధపడివుంటాడు; ఆ జీవనప్రమాణంకోసం తన సంతానోత్పత్తిని పరిమితంచేసుకుంటాడు. అదంతా ఇక్కడ మనకు చాలా హాస్యదృష్టితో కూడినదిగాను, విచిత్రమైనదిగాను, శ్రేయోరాజ్య సిద్ధాంతానికి వ్యతిరిక్తమైనదిగానూ కనిపిస్తుంది

చేసేపని అత్యల్పంగాను, అందుకు వచ్చే ప్రతిఫలం అత్యధికంగాను వుండాలన్నది భారత శ్రేయోరాజ్యములో ప్రతి పౌరుడి లక్ష్యం. ఈ అమూల్య లక్ష్యంలో వున్న అంతరార్థాన్ని బ్రిటిష్‌వారుకూడా శీఘ్రంగా గ్రహించారు. నిరంతరం విస్తరించిపోతున్న శ్రేయస్సాధక కార్యరంగంలో యథోచితపాత్ర నిర్వహించడానికి సాధ్యమైనంత ఎక్కువమంది సంతానం కావాలనే పారమార్థిక పాఠాన్ని కూడా వారు ఎంతత్వరగా నేర్చుకుంటే అంత మంచిది. దీన్ని బట్టి, బ్రిటిష్‌వారి ఐహికవాదంపై భారతీయుల ఆధ్యాత్మికవాదం సాగించిన విజయం ఇంకా అసంపూర్తిగానే వున్నదన్నమాట.

ఈ వ్యవహారంలో బ్రిటిష్‌వారికంటే ఫ్రెంచివారు మనకు ఎక్కువ సన్నిహితులుగా కనిపిస్తారు. పారిస్ నగరంలోని బ్రిటిష్ యూరపియన్ విమానాల కంపెనీ కార్యాలయంలో నా అనుభవమే ఇందుకు నిదర్శనం. అక్కడ వున్నంతసేపూ నాకు మన భారతదేశంలో వున్నట్టే అనిపించింది. జెనీవాకు విమానంలో సీటు బుక్ చేసుకోడానికి అక్కడ నాకు నాలుగు గంటలసేపు పట్టిందంటే నమ్మండి! ఇందుకు నేను ఆ కార్యాలయంలో పని చేసే మొగఉద్యోగులను ఏమాత్రం తప్పుపట్టడానికి వీల్లేదు.

# ★ ఓడలు; బళ్లు ★

౩

తప్పంతా కంపెనీ నిర్వాహకులదే అనాలి. అప్సరసల్లాంటి ముగ్గురు ఫ్రెంచి స్త్రీలను తమ కొలువులో నియమించుకున్నారు. ఆ ముగ్గురూ ఒక చిన్న గదిలో కూర్చొని పని చేస్తుంటారు. ఆ కార్యాలయంలో మొగ ఉద్యోగులు పని చేయగలరా, అసలు పని చేస్తుంటారా అనిపించింది. ఆ పరిస్థితులలో నేనున్నా పనికి తప్పకుండా ఒక సలాం కొట్టేవాణ్ణి అని ఘంటాపథంగా చెబుతున్నాను. పనీ, గినీ తరవాత సంగతి; ఆ ముగ్గురి మొహాల్లోకి అలా తనివితీరా చూస్తూ కూర్చుండేవాడిని. వారి అందచందాలను చూస్తున్నంతసేపూ, ఈ ప్రపంచాన్నీ, కష్టాలనూ ఎవరైనా పూర్తిగా మరిచి పోతారంటే నమ్మండి. ఆ ముగ్గురిలో ఒకరు తెల్లటి దుస్తులు, మరొకరు నలటి దుస్తులు, మూడో ఆమె లేత ఎరుపురంగు దుస్తులు ధరించి వున్నారు. అందరిలోకీ ఆ లేతఎరుపురంగు దుస్తుల ఆమె బహు అందమైనది. సాక్షాత్తూ భూలోకరంభే ఆమె అందరితో పాటు కౌంటర్ దగ్గిర కూచోలేదు గది మధ్యగా మేజాబల్ల వేసుకొని ఒక 'క్యాష్ బాక్స్' దగ్గిర పెట్టుకుని వుంది. ఒక చిన్న మేనేజర్ అయి వుంటుంది

నేను ఆ కార్యాలయంలో కూర్చొని వుండగానే, సాయంత్రం ఐదుగంటలై పోయింది. ఆ ముగ్గురు స్త్రీలు ఎవరిమటుకు వారు గబగబా కుర్చీలలో నుంచి లేచి, ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకొని, నన్ను ఒక్కణ్ణే వదిలివేసి చక్కా పోయారు! తెల్లమొహం వేసి, నేను అలాగే కూర్చొని వుండి పోయాను.

ఫ్రెంచివారి సాంసారికజీవితాన్ని గురించి నేను విన్న ఒక చిన్నకథ చెబుతాను;

ఒక ఫ్రెంచివాడి భార్య చనిపోయిందట. ఆమె "ప్రియస్నేహితుడు" ఒకడు వచ్చి కడుపు ఉబ్బిపోయేలా వలవల ఏడవడం మొదలుపెట్టాడట. పొంగిపొరలి వస్తున్న అతగాడి దుఃఖాన్ని ఏవిధంగా మాన్పించాలో, ఏమి చేయాలో భార్యను కోల్పోయిన ఆ ఫ్రెంచివాడికి ఎంతసేపటికీ తెలియలేదట. అతడి దుఃఖాన్ని చూడలేక, ఆ

ఫ్రెంచి భర్త చివరకు, "ఎందుకు ఇంతగా ఏడిపిసావ్ భాయీ! ఫరవాలేదు; ఊరుకో; నేనిక్కడ పెళ్ళాడతాలే," అని అతణ్ణి ఓదార్చాడట! ఇలా వుంటుంది ఫ్రెంచివారితంతు!

బ్రిటిష్ యూరపియన్ విమాన సర్వీసు కార్యాలయాలలో. ఎప్పుడూ జనం కిటకిటలాడుతుంటారంటే ఆశ్చర్యమేమున్నది? ప్రయాణీకులు కూడా. అక్కడి ఉద్యోగులను చూస్తూ అలాగే వుండిపోతారు!

జ్యూరిక్‌లో వున్న ఎర్ ఇండియా ఇంటర్నేషనల్ వారి కార్యాలయంలో కూడా బ్రిటిష్ యూరపియన్ విమాన సర్వీసుల కార్యాలయాల పద్ధతులనే అనుసరించడానికి ప్రయత్నిస్తున్నారు. చాలా అందమైన ఆడవాళ్ళను అనేకమందిని నియమించారు. అయితే స్విస్ స్త్రీలు బహు చాకచక్యంగా పనిచేస్తారు. జ్యూరిక్‌లోని ఎర్ ఇండియా కార్యాలయంలో పనిచేస్తున్న ఇద్దరు స్త్రీలలో ఒకామె నేను వెళ్లి అడగగానే, ఇరవై అంటే ఇరవై నిమిషాల వ్యవధిలో నా టిక్కెట్టును మార్పించడం, విమాన ప్రయాణపు సంచిని ఇవ్వడం. ఒక కప్పు టీ ఇచ్చి సత్కరించడం మొదలైన పనులన్నీ పూర్తిచేయగలిగింది. అక్కడ పడిగాపులు కాయవలసిన అవసరమే లేకుండా చేసింది. మరుసటిరోజు ఉదయమంతన్నా కారులో ఎక్కించుకొని విమానాశ్రయానికి చేర్చింది. నేను విమానం ఎక్కబోయేముందు అతి నాజూకుగా, నవ్వు వస్తోన్నట్టుగా తన చెయ్యి ఎత్తి అటూ ఇటూ ఆడిస్తూ వీడ్కోలు చెప్పింది.

స్విస్ స్త్రీలలో వున్న ఒక పెద్దలోటు ఏమిటంటే, వాళ్ళలో మొగవాళ్ళను ఆకర్షించే లక్షణాలేమీ వుండవు. స్విట్జర్లెండులో ఆఫీసులన్నీ ఉదయం 7-30 గంటల మొదలు మధ్యాహ్నం 12 వరకూ, తిరిగి 2 గంటల మొదలు 5 వరకూ పని చేస్తాయని చెబితే, ఢిల్లీవాసులకు ఆశ్చర్యం వేయవచ్చు. యూరపులో ఏ దేశంలోనూ ప్రభుత్వ ఉద్యోగులకు, బ్యాంకు పనివారికి ప్రభుత్వం నివాస భవనాలను స్వల్పమైన అద్దెలకు ఇచ్చే ఆచారం గాని, ఇంటి అద్దె అలవెన్సులు ఇచ్చే ఆచారంగాని లేదు. ఇక్కడ కేంద్రప్రభుత్వం ఉద్యోగులకు ఇచ్చే జీతాలకు, అక్కడివారికి ఇచ్చే జీతాలకు అంతే వ్యత్యాసమేమీ లేదు. అక్కడ ప్రతి పౌరుడికీ స్వార్థంకంటే, తన దేశం ప్రధానం! ఇక్కడ మనకు దేశంకంటే స్వార్థం ప్రధానం; ఇది ఈనాడు కొత్తగా ఏర్పడిన మార్పు కాదు. ఇందుకు మన దేశచరిత్రనుంచే ఉదాహరణగా ఒక గాథను చెప్పవచ్చు. అది సోమనాథ దేవాలయాన్ని కొల్లగొట్టడానికీ, ధ్వంసం చేయడానికి మహమ్మద్ ఘజినీ దండయాత్ర సాగిస్తున్న రోజులు. ఘజినీ సైనికులు ఆలయ అర్చక బృందాన్ని ఒకవైపు, వందలకొద్దీ ఆవులను మరొకవైపు బారులు తీర్చి నిలబెట్టారు. మీకు దేవాలయమే కావాలో, ఆవులే కావాలో కోరుకోండని అర్చక బృందానికి చెప్పారు. ఆవులే కావాలన్నారు అర్చకులు.

పాశ్చాత్యులు తమ దేశాన్ని చూసుకొని గర్వపడతారు; దేశభాగ్యోన్నతికి అహర్నిశలు కృషిస్తారు. వారి దృష్టిలో తమ దేశం సాక్షాత్తు మాతృదేవతగాని, కులట కాదు.

ఒక ఉదాహరణగా బ్రైటన్ నగరాన్నే (ఇంగ్లండులో) తీసుకుందాము. నగర రాజవీధిలో మధ్యగా బహు రమ్యమైన పూల సెజలు వున్నవి. పసిపిల్లలుకూడా అక్కడి పూలలో ఒక్కదాన్నైనా ముట్టుకోరు.

ఇక్కడ న్యూఢిల్లీలో నా నివాసస్థలానికి సమీపంలోనే ఒకప్పుడు బహు ఇంపుగా పెంచి పోషించిన ఆరు పచ్చిక బయళ్ళు వుండేవి. దేశం స్వతంత్రమైన తర్వాత వీటిలో ఐదింటిని ఈ పరిసరాలలోనే నివసిస్తున్న నవనాగరికులు నాశనం చేసివేశారు. ఒక చిన్న స్థలంలో నేనొక పచ్చికబయలు అతి శ్రద్ధగా పెంచుకుంటున్నాను కాని బున్న ప్రభువులు దాన్ని ఏరోజు కారోజు ధ్వంసం చేసివేస్తుంటారు. నీచాతినీచమైన ఈ స్వార్థబుద్ధి ఫలితంగానే, ఒకప్పుడు బహు అందంగా వున్న న్యూఢిల్లీ నగరం నేడు మురికి కూపాలమయమైపోయింది. పశ్చిమ యూరప్‌లో ఎక్కడైనా ఇలాంటి అత్యాచారం జరిగితే ప్రజలు సహించి వూరుకోరు. ప్రజాస్వామికమే అయినప్పటికీ, ప్రతి ప్రభుత్వం తీవ్రచర్యలు తీసుకొని గట్టిగా వ్యవహరిస్తుంది. ఏది ఏమైతే మనకేమిటి అనే నిర్లిప్త నిర్లక్ష్య భావాలకు అక్కడ చోటులేదు.

ప్రజాస్వామ్య ప్రభుత్వమంటే ఇక్కడ మనవారి దృక్పథమే వేరుగా వుంటుంది. పాశ్చాత్య రాజ్యాలలో ఆత్మనిగ్రహం, క్రమశిక్షణ ప్రజాస్వామ్యంలో ప్రధాన భాగాలు. ఇక్కడ మనదేశంలో క్రమశిక్షణ, ప్రజాస్వామ్యం అనేవి రెండూ ఉత్తరదక్షిణ ధ్రువాలలాంటివి. న్యూటన్ మహాశయుడు పదార్థ సంబంధ విజ్ఞానంలో నిర్వచించిన మూడవ సూత్రం (ప్రతి క్రియకూ సమానమైన వ్యతిరేక శక్తితో పనిచేసే ప్రతిక్రియ వుంటుందన్నది) ఈ రెండింటి విషయంలోనూ అక్షరాలా వర్తిస్తుంది. కాంగ్రెసు నాయకులకు తమ వ్యక్తిగత పేరు ప్రఖ్యాతులమీద వుండే గౌరవం, వ్యామోహం దేశం అంటే వుండవు. ప్రజాస్వామ్యంపట భారత, పాశ్చాత్య దృక్పథాలలో ఏర్పడిన వ్యత్యాసమంతా ఇక్కడే వున్నది

బ్రిటిష్ సోషలిస్టు యూనియన్ ఈమధ్య "20-వ శతాబ్దపు సోషలిజం" అనే పుస్తకాన్ని ప్రచురించింది. దీనిమీద బ్రిటన్‌లో చాలా తర్జన భర్జన ఇప్పటికీ జరుగుతూనే వున్నది. సోషలిస్టు విధానాన్ని వ్యతిరేకించే పుస్తకం కాదిది. సోషలిస్టు వ్యవస్థను రూపొందించడంలో సాధ్యతలను గురించి ఈ పుస్తకం ఇలా తెలియజేస్తున్నది:

"కేవలం హక్కులకోసం పోరాడినంత మాత్రాన సోషలిజం కొత్త రంగాలలో విజయం సాధించలేదు. ప్రతిపౌరుడూ తన విధ్యుక్త ధర్మాలను నెరవేర్చాలని కూడా సోషలిస్టు వ్యవస్థ ఆశిస్తుంది. సమాజ శ్రేయస్సాధన లక్ష్యానికి కట్టుబడి వున్నప్పుడే, ఎవరైనా విధ్యుక్త ధర్మనిర్వహణకు మనఃపూర్తిగా ఉద్యమించడం జరుగుతుంది. సమాజశ్రేయస్సుకు ఎదురుతిరిగిన వారు ఈ కృషిలో సహకరించడం, బాధ్యతలలో తమ భాగాన్ని పంచుకోవడం అసంభవం. ప్రభుత్వ వ్యవస్థను మార్పుచేసినంత మాత్రాన శ్రేయస్సాధన లక్ష్యం అలవడదు; సామాజికవ్యవస్థకూడా అందుకు తగినట్లుగా మారిపోవాలి. సంఘం శక్తి ప్రవృత్తుల జిగిబిగి అల్లిక; ఈ అల్లికలో ప్రజలందరూ పరస్పరానుబంధముతో మెలగవలసి వుంటుంది; స్వీయాభీష్టాన్ని, లాభాన్ని విస్మరించి, సోదర ప్రజల యోగక్షేమాభివృద్ధికి కృషిచేసే గుణాలనే ఉదారబుద్ధి భక్తిప్రపత్తులవల్లగాని ఏర్పడవు."

శ్రేయోరాజ్య సిద్ధాంతం బ్రిటిష్ ఔద్ధత్యాన్ని ఎంత విపరీతమైన వక్రమార్గాలకు పట్టించిందీ ఈ గ్రంథకర్తలు గ్రహించారన్న మాట

భారత రాజ్యాంగం ప్రాథమిక స్వత్వాలను నిర్వచించిందిగాని, ప్రాథమిక బాధ్యతలను స్పష్టీకరించలేకపోయింది. నేటి అయోమయ పరిస్థితులన్నిటికీ ఇదే ముఖ్య కారణమవుతున్నది. పనివాళ్ళు తక్కువ కాలం పనిచేయాలనీ, ఎక్కువ జీతాలు కావాలనీ కోరుతున్నారు; ప్రావిడెంట్ ఫండు కావాలంటున్నారు; పనిలోనుంచి తొలగించకుండా ప్రత్యేకరక్షణలు, ఇంకా అవీ ఇవీ ఎన్నెన్నో కావాలని అడుగుతున్నారు. వారు అడిగిన వాటిని ఇవ్వక తప్పడంలేదు. ఈ వ్యవహారమంతా భగవంతుడికి చెల్లించే ముడుపులా తయారైంది. ఇంతా బాగానే వుంటుంది గాని, బాధ్యతల ప్రసక్తి ఎక్కడా రాదు... ఇందుకు ఒక ఉదాహరణ: బొంబాయి రేవుకార్మికులు తాము కోరిన సమ హక్కులను, కోర్కెలను సాధించగలిగారు కదా, అందుకు బదులు తిరిగి దేశానికి వారు చేసిందేమిటి? ఇది చాలా సునిశిత వ్యవహారం. ఇంతకు మించిన ప్రస్తావన అనవసరం.

పోతే, పశ్చిమ జర్మనీ వ్యవహారాలను పరిశీలిదాము. రెండు ప్రపంచ యుద్ధాల తాకిడితో పూర్తిగా చితికిపోయిన దేశం

## ★ ఓడలు: బళ్ళు ★

జర్మనీ. ద్వితీయ సంగ్రామం సమాప్తమైన పదేపది సంవత్సరాలలో, పశ్చిమ జర్మనీ పారిశ్రామికంగా అత్యున్నత స్థాయికి రాగలిగింది. 1949 లో పారిశ్రామిక ఉత్పత్తి, జర్మనీలో నూటికి 55 వంతులు, బ్రిటన్‌లో నూటికి 87 వంతులు వుండేది; 1955 వచ్చేసరికలా బ్రిటన్‌లో నూటికి 115 వంతులు పెరిగితే, పశ్చిమజర్మనీలో నూటికి 132 వంతులు పెరిగింది. నిరుద్యోగ పరిష్కారం విషయంలో 1949 లో బ్రిటన్ నూటికి 95 వంతులు సాధిస్తే, జర్మనీలో 81 వంతులే వుండేది. 1955 వచ్చేసరికి బ్రిటనులో 110 వంతులకు పెరిగితే, పశ్చిమ జర్మనీలో 117 వంతులకు వృద్ధిఅయింది. కార్మిక వేతనాల వ్యయం జర్మనీలో 1949 లో యూనిట్‌కు 104 వంతులు వుండేది. 1955 లో పశ్చిమజర్మనీలో 96 వంతులకు తగ్గిపోయింది బ్రిటన్‌లో ఇది 83 నుంచి 106 కు పెరిగింది. ఇవి బ్రిటిష్ అధికారులు ప్రకటించిన నివేదికలోని అంశాలే. వీటిని ప్రకటిస్తూ బ్రిటిష్ ఉత్పత్తి అభివృద్ధిసంఘం పారిశ్రామికంగా దేశంలో ఇంకా ఎక్కువ అభివృద్ధి సాధిస్తేనే గాని జీవనప్రమాణాన్ని కాపాడుకోవడం సాధ్యపడదని ప్రజలకు హెచ్చరిక చేసింది.

పారిశ్రామిక అభివృద్ధి విషయంలో 1750 మొదలు 1900 వరకు బ్రిటన్ మహోన్నత స్థితిని అనుభవించింది. ప్రపంచం మొత్తం మీద మేటి కీర్తిగాంచింది. తర్వాత ఇతర దేశాలు కూడా బాగా పైకివచ్చినవి బ్రిటన్‌లో సాలుసరి సగటు అభివృద్ధి కొన్ని దేశాల సగటు అభివృద్ధిలో సగంమాత్రమే వుండే స్థితి ఏర్పడ్డది. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే బ్రిటన్‌లోకంటే జర్మనీలో సగటుని వ్యక్తి సాధించగలిగిన పారిశ్రామిక ఉత్పత్తి బాగా ఎక్కువైంది; కార్మిక బలగంమీద అవుతున్న వ్యయం బ్రిటన్‌లోకంటే జర్మనీలో నే బాగా తగ్గిపోయింది.

పాశ్చాత్యదేశాల పరిస్థితి ఈ విధంగా వుంటే, మనదేశంస్థితి ఎలావున్నదంటారు? పైన చెప్పినట్టుగా ఇతరదేశాల ఉత్పత్తి వివరాలతో సరిపోల్చి చూడడానికి వీలుగా మన ఉత్పత్తికి సంబంధించిన వివరాలను వేటినైనా మనప్రభుత్వం ప్రకటించిందా? నాకు తెలిసినంతలో ప్రకటించలేదు.

దేశంలో బొగ్గు, సిమెంటు, ఉక్కు ధరలు ఆరోజు కారోజు మండిపోతున్నవి. వీటిలో కొన్ని ధరలు పెరగడానికి ముఖ్య కారణం కార్మిక వేతనాలు ఎక్కువకావడమే; పరిస్థితులు ఈవిధంగా వుంటే ఖండాంతర వ్యాపారంలో ఇతరదేశాల పోటీకి భారత దేశం ఎలా నిలవగలుగుతుంది? ★

# ఉత్తరాల ఉదంతం

కన్నెకంటి
ప్రభాకర శాస్త్రి

ప్రియమైన శ్రీవారికి- మదరాసు,
6-2-56

మీ రాణి నమస్కరించి వ్రాయునది. మీరు పంపిన చీర, ఉత్తరం రెండూ చేరినవి. మీ ఉత్తరం చదువుతుంటే మిమ్ముల్ని చూచినట్లే ఉంది. నాకు యింకా పనిచేసే సత్తువ రాలేదు. పాప ఆరోగ్యంగా వున్నాడు. 'అదుగో నాన్న' అంటే ఆత్రంగా చూస్తాడు. కనీసం నాలుగు నెలలయినా ఉండాలంటుంది అమ్మ. మీరు హోటలు భోజనంతో ఎంత బాధపడుతున్నారో అని బెంగగా వుంది. అయినా ఏం చేస్తాం. ఈ ఉత్తరం చూచినవెంటనే ఒకసారివచ్చి చూచిపోరూ!

ఇట్లు—మీ
చరణదాసి—రాణి

* * *

ప్రియమైన రాణికి, నెల్లూరు
14 2-56.

నీ ఉత్తరం అందినది. నీవు ఆరోగ్యంగా ఉన్నందుకు సంతోషం...మన పాపను చూడాలని ఎంతో ఉబలాటంగా వుంది. నా ఆఫీసు పరిస్థితులు నీకు తెలుసుగదా! ఒక రోజు గాదు—ఒక క్షణమయినా తీరిక దొరకదు. కడుపుతీపికొద్దీ మీ వాళ్ళు ఉండమంటారు. నీవు యిక్కడి పరిస్థితులు గమనించవద్దూ...హోటలు భోజనం తిని సగమయ్యాను......నీవు వెళ్ళి రెండు నెలలయినా రెండేళ్ళయినట్లుంది. పది రోజులలో రావలసింది. పాపకు నా ముద్దులు.

ఇట్లు—నీ మూర్తి.

* * *

శ్రీవారికి— మదరాసు,
28. 2-56.

రాణి హృదయపూర్వక వందనములు.

అమ్మకు మీ ఉత్తరం చూపించాను... ఆమె ఏది ఏమైనా నన్ను ఆరు నెలలదాకా పంపనంది. శని ఆదివారాలలో రమ్మని వ్రాయమన్నది. అక్కడ నీళ్ళకి వాటికి పాపకు ఇబ్బందట......ఆలోచిస్తే ఆమె చెప్పింది నిజమే ననిపిస్తుంది. మీరే రాగూడదూ! మిమ్ములను చూడాలనివుంది... వస్తారు గదూ!

ఇట్లు—మీదాసి
రాణి.

* * *

రాణికి— నెల్లూరు,
8-3-56.

నీ ఉత్తరం అందినది. నా ఆరోగ్యం సరిగా లేదు. ఆకలి తగ్గిపోయింది. యిల్లంతా అసహ్యంగా ఉంది. చివరకు స్నానం కూడా వేళకు చేయటం లేదు. నీవు త్వరగా రావలసింది. ప్రసవించి కూడా నెలైంది. కావాలంటే పనిమనిషిని పెట్టుకోవచ్చు. ఈ ఉత్తరం అందగానే మంచిరోజు చూసుకొని మీ తమ్ముడిని వెంటబెట్టుకొని రావలసినది. —నీమూర్తి.

* * *

ప్రియమైన శ్రీవారికి- మదరాసు,
నమస్కారములు. 18-3-56

బాబు పక్కలో దొర్లుతున్నాడు. చూస్తుంటే నా హృదయం ఆనందంతో నిండుతుంది. మీరు వెంటనే వచ్చి వెళ్ళవలసింది. మీ ఆరోగ్యం జాగ్రత్త... హోటలులోనే వేడినీళ్ళు ఏర్పాటు చేసుకోండి. యిల్లు చిమ్మటానికి ప్రక్క వెయ్యటానికి ఒక పిల్లవాడిని పెట్టుకోండి. ఆడవాళ్ళను మాత్రం పెట్టుకోకండేం... వస్తువులు ఒక్కటి కూడా దక్కవు. అబ్బాయికి పాలసీసాలు పంపుతారు కదూ!

మీ ఉత్తరంకొరకు నిరీక్షించే
మీ—రాణి.

* * *

ప్రియమైన రాణికి— నెల్లూరు,
22 3 56

నీవు చెప్పినట్లు పనిమనిషిని పెట్టుకున్నాను. యిప్పుడు కొంచెం కష్టం తగ్గింది. అయినా నీవు వెంటనే బయలుదేరి రావలసినది. —నీ మూర్తి.

* * *

శ్రీవారికి— మదరాసు,
27-3-56

ఇక్కడ బాబూ నేనూ క్షేమం. మీ క్షేమములు తెలియపర్చవలెను. మా అన్నయ్య మరదలు పెళ్లి 9 వ తేదీన జరుగుతుంది. మేమందరం వెళుతున్నాము. బీరువాలో మూడవ అరలో క్రింజన్ రంగు సిల్కుచీర ఉంది...పంపండి మీరు కూడా వస్తే బాగుంటుంది. నేను రాలేనందుకు క్షమిస్తారు గదూ! —మీ రాణి.

* * *

ప్రియమైన రాణికి— నెల్లూరు,
2-4 56

నీవు కోరినరంగు నాకు తెలియలేదు. మన ప్రక్కింట్లో చేరిన పంతులమ్మ నడిగి తెలుసుకుని పంపుతున్నాను. నీవు పెండ్లి ప్రయాణము జాగ్రత్తగా చేయవలసింది నీవు ఎప్పుడు వచ్చేది తెలిపేది. —నీ మూర్తి.

* * *

ప్రియమైన శ్రీవారికి మదరాసు,
మీ దాసి నమస్కారములు. 3-4-56

మీరు జాగ్రతగా ఉండవలసినది తోడుగా ఎవరినయినా పడుకోబెట్టుకోండి. పంతులమ్మను యింటిలోనికి రానీయకండి. ఏవయినా ఎత్తుకపోవచ్చు. తాళాలు బాగా వెయ్యండి నే చెప్పినవన్నీ గుర్తుంచుకుంటారు గదూ... మీ దాసి. రాణి.

* * *

రాణికి— నెల్లూరు,
9-4-56

నా ఆరోగ్యం బాగానే వుంది. నీ ఆరో

---

భర్త:—నా క్లాస్‌మేట్ శంకర్రావు నిన్న కనిపించాడు. వాడికి పెద్ద ఉద్యోగమైంది గదూ, అందుకని నాకంటె గొప్పవాణ్ణని గాబోలు, నేను పలకరించినా పలక్కుండా వెళ్లిపోయాడు.

భార్య:—ఏడిశాడు, వాడి మొహాం. చవట, వెధవ, పెళ్ళాం చేతులో కీలుబొమ్మ. వాడు మీకంటే గొప్పవాడని ఎలా అనుకుంటాడు?

---





# ఉత్తరాల ఉదంతం

గ్యం జాగ్రత్త. ఇక్కడ నీవు లేని లోటు కనపడకుండా పంతులమ్మ సాయం చేస్తూంది. మొన్న నాకు జ్వరం వస్తే మందు కూడా యిచ్చింది. మీ అమ్మ ఇష్టప్రకారం వుండి రావలసింది. —నీ మూర్తి.

* * *

ప్రియమైన శ్రీవారి పాద సన్నిధికి— మదరాసు, 11-4-56

మీ చరణదాసి నమస్కరించి వ్రాయునది. నా మనస్సేమీ బాగుండటం లేదు. మిమ్ములను విడిచి ఉండలేకపోతున్నాను. వద్దామంటే పదిరోజులదాకా మంచి రోజు లేదు... నా హృదయం ఎందుకో మిమ్ములను చూడాలని తహతహలాడుతోంది మీరు రమ్మంటే వచ్చేస్తాను మీ లేఖకై నిరీక్షించే మీ రాణి.

* * *

రాణికి— నెల్లూరు, 18-4-56

నేను పంతులమ్మ కలసి నీకు వచ్చే చీర తెచ్చాము పంపుతున్నాను. అందినట్లు వ్రాయవలసింది నీవు ఇప్పుడు రావద్దు —నీ మూర్తి.

* * *

ప్రియమైన శ్రీవారి పాద సన్నిధికి మదరాసు, 20-4-56

నేను బయలుదేరి వస్తున్నాను. 28-వ తేదీ రైలు దగరకు రావలసినది. -మీ రాణి

* * *

రాణికి— నెల్లూరు, 22-4-56

నేను, కొందరూ, పంతులమ్మా 26 వ తేదీన హంపీకి పోతున్నాము. నేను వచ్చి ఉత్తరము వ్రాసినంతవరకూ రావద్దు. చిరంజీవికి ముద్దులు. -నీ మూర్తి.

* * *

28-4-56 వ తేదీన తమ్ముణ్ణి వెంటబెట్టుకుని వచ్చిన రాణి, 'ఏమండీ పంతులమ్మేది' అని అడిగింది 'పంతులమ్మా! ఆమె నిన్ననే యిల్లు ఖాళీచేసి వెళ్ళింది' అని మూర్తి తడుముకోకుండా చెప్పేడు.






ఎన్నికలు దగ్గిర పడుతున్నకొద్దీ, "ప్రజల డబ్బుతో విదేశాలు చూసిరావాలనే ఉద్యమం బాగా పుంజుకుంటోంది మంత్రులు, పార్లమెంటు సభ్యులు పంచెలెగకట్టి ప్రజా ధనాన్ని త్యాగం చెయ్యడానికి ఉబలాట పడుతున్నారు. పార్లమెంటు సభ్యుల్లో కనీసం 15 మందిని వెంట బెట్టుకుని స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగార్ మావ్ సే తుంగ్ రాజ్యానికి బయల్దేరుతున్నారు. సాయుధ సైన్యాలనుండి మరో బృందం కూడా చైనా బయలు దేరుతోంది.

వ్యవసాయ దారులతో కొన్ని చర్చలు జరిపిన తరవాత వ్యవసాయశాఖ మంత్రి డా॥ పంజాబ్ రావ్ దేశ్ ముఖ్ ఒక బృందాన్ని వెంట బెట్టుకుని సోవియట్ రష్యాలో సహకార ఉద్యమం ఎలా ఉందో చూసి వద్దామని పోతున్నారు. ఆయన బృందంలో ఢిల్లీ రాష్ట్ర అభివృద్ధిశాఖమంత్రి చౌధురి బ్రహ్మ ప్రకాశ్ (ఈయన మంత్రిత్వం అక్టోబరు 31 తో అంతం కాబోతోంది) కూడా ఉన్నారు. డా॥ దేశ్ ముఖ్ సహామంత్రి శ్రీ కృష్ణప్ప ఈ మధ్యనే చైనా వెళ్లి సేద్య విధానాలను, ముఖ్యంగా సహకార ఉద్యమాన్ని పరిశీలించి వచ్చారు. డా॥ పంజాబ్ రావ్ దేశ్ ముఖ్ రష్యానుంచి తిరిగి వచ్చాక ఆయన బృందమూ, కృష్ణప్పగారి బృందమూ కలిసి సహకారోద్యమంమీద బృందగోష్ఠి జరుపుతారట. బహుశా ఈ గోష్ఠి దక్షిణ పసిఫిక్ ద్వీపాల్లో ఎక్కడన్నా జరిపితే బాగుంటుంది. ఆ ద్వీపాలకు ఇంతవరకూ ఏ భారతీయ ప్రతినిధి వర్గమూ వెళ్ళలేదుగా మరి!

## వెళ్లేవారు

రష్యావెళ్ళి, సోవియెట్ నిపుణులను కొందర్ని దిగుమతి చేయించాక, పండిట్ కేశవరావ్ మాలవీయ కెనడా, అమెరికా, హాలెండ్, బ్రిటన్‌లలో మూడు వారాలు పర్యటించి వద్దామని వెళ్ళారు. పండిట్ మాలవీయ తన కార్యదర్శి శ్రీ రామధ్యానిని మాత్రం తన శాఖ ఆధ్వర్యంలో వదిలి మిగతా ఉద్యోగులందర్నీ వెంట బెట్టుకుని వెళ్ళారు. ఈ బృంద సభ్యులు పెట్రో లియం పరిశ్రమను, పెట్రోలియం చట్టాలను పరిశీలిస్తారని ప్రభుత్వ ప్రకటన తెలుపుతోంది. పదిహేనురోజులు కెనడాలో ఉండి మిగతా వారం రోజుల్లూ అమెరికా, బ్రిటన్ హాలెండులలో పెట్రోలియం పరిశ్రమను, చట్టాలను క్షుణ్ణంగా పరిశీలించేసి వీరు వచ్చేస్తారు!

మరి ఇంతమంది ఇలా విదేశాలకు వెళ్ళి పోతుంటే విద్యాశాఖ ఊరుకుంటుందా? మౌలానా ఆజాద్ రష్యాకొక ప్రతినిధి వర్గాన్ని పంపిస్తున్నారు. ఈవర్గానికి నాయకుడు ప్రొఫెసర్ హుమయూన్ కబీర్. అందులో పదకొండుమంది (ఆఖరి వింగులో ఏసుక్రీస్తుతో కూర్చున్న వారికి ఒకడు తక్కువగా) ఉంటారట. శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ లాగానే ప్రొఫెసర్

## శ్రీ కృష్ణ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కబీర్ ఫోర్డునిధి సంస్థ వారి అభిమాన పాత్రుడు కావడంచేత ఇప్పుడాయన కమ్యూనిస్టు రష్యా వెడితే ఆసంస్థవారు ఏమనుకుంటారో చూడాల్సిందే.

అన్నట్లు శ్రీమతి రాజకుమారి రష్యా, చైనా, అమెరికా, యూరప్‌లలో విహరించి చదువు పూర్తి చేసుకోడానికి ఆస్ట్రేలియా వెళుతోంది.

మౌలానా ఆజాద్ శాఖవారు విద్యార్థుల ఉపాధ్యాయుల బృందం ఒకదానిని పశ్చిమాసియా దేశాలకు, మరో విద్యార్థి బృందాన్ని ఆఫ్రికన్ దేశాలకు పంపించాలని సంకల్పించారు.

## వెళ్లనివారు

ప్రధాన మంత్రి ప్రధాన వ్యక్తిగనుక ఆయన్ని మినహాయిద్దాం మిగతా కాబినెట్ మంత్రులు, కాబినెట్ హోదాలేని మంత్రులు, డిప్యూటీ మంత్రులు, పార్లమెంటరీ కార్యదర్శులు, (ఈ క్రిందివారు మినహా) అందరూ ఎప్పుడో ఒకప్పుడు దర్జాగా ప్రజాధనం జేబులో వేసుకుని విదేశాలు వెళ్ళి వచ్చిన వారే. కొందరు బోలెడుసార్లు వెళ్ళివచ్చిన వారే. అసలు వెళ్లనివారు వీరు:—

రక్షణ మంత్రి డా॥ కైలాసనాథ్ కట్జూ.

ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి.

హోం మంత్రి పండిత్ జి. బి. పంత్.

నీటి పారుదల శాఖమంత్రి లాలాగుల్జారీ లాల్ నందా.

కార్మిక మంత్రి శ్రీ ఖండూ భాయ్ దేశాయ్

రైల్వే, రవాణాశాఖ మంత్రి లాల్ బహదూర్ శాస్త్రి

పునరావాసశాఖ మంత్రి శ్రీ మెహర్ చంద్ ఖన్నా.

జూనియర్ మంత్రుల్లో డిప్యూటీమంత్రి కాకముందు శ్రీ బి. ఆర్. భగత్ పని బావుండేది ఇక భారతదేశం మతాతీత రాజ్యం కదండీ అందుచేత షౌకత్ ఉల్లా అన్సారీ పని కూడా బావుంది ఆయన ఐక్యరాజ్యసమితికి, అంతర్జాతీయ కార్మికసమితి సమావేశాలకు హాజరయ్యాడు. ఇప్పుడు ప్రధానితో కలిసి సౌదీ అరేబియా వెడుతున్నారు. సూయజ్ సమస్య రాకముందు మధ్య ప్రాచ్యదేశాలకు వెళ్ళి తీవ్రంగా ఏవేవో పరిశీలించివచ్చిన డా॥ సయ్యద్ మహమద్ కూడా ప్రధానికి 'తోడు నీడ'గా వెడుతున్నారు,

## డల్లెస్‌కు ఇస్లామ్

భారతదేశపు మతాతీత దృక్పథం చాణక్య రాజనీతి చూసి బ్రిటను అమెరికాల నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది. మన దేశ మతాతీతం కనుక వాళ్లు హిందూ హైకమిషనర్లను, హిందూ రాయబారులను పంపిం నక్కరేదు. కాని ముస్లిం దేశాలను అర్థం చేసుకోవడానికి ముస్లిం దేశాలకు ముస్లిం రాయబారులనే పంపిస్తే బావుంటుంది. డల్లెస్ ఇస్లాం మతం ఇప్పించి ఉంటే సూయజ్ సమస్య తేలిగ్గా పరిష్కారమయ్యేదిగదా ప్రధాని నెహ్రూ సౌదీ అరేబియా వెడుతున్నారు గనుక ఆరబ్ రాజకీయాల్లో అనుభవానికి సయద్ మహమద్, షౌకత్ ఉల్లాతర్ఫీదు ఇస్తారు.

ఇదివరలో సౌదీ అరేబియా రాజు ఢిల్లీ రావడానికి ముందు, భారత విదేశాంగ కార్యాలయంవారితో తనను మహాత్మాగాంధీ సమాధివద్దకు తీసుకు వెళ్ళడంలాంటి ఇస్లామ్ వ్యతిరేక కార్యక్రమం ఏదీ తలపెట్టవద్దని గట్టిగా చెప్పారట. అదే సిద్ధాంతం కొంచెం పొడిగించి, నెహ్రూ వెంట వెళ్ళే ముస్లిమేతరుల నెవరినీ మక్కాకు ఆహ్వానించరని మనం ఊహించవచ్చును.

ఇంతకీ చెప్పవచ్చిందేమిటంటే ప్రజాధనం దూబరా, విదేశీ ద్రవ్యమారకం తరుగుదలా దారుణంగా ఉన్నాయి.

* * *

అక్టోబరు 2వ తేదీ మహాత్మాగాంధీ జన్మదినం. భారతదేశమంతటా, ముఖ్యంగా ఢిల్లీలో గాంధీజీ ఉపదేశాలు వారం రోజుల పాటు ప్రతిధ్వనిస్తాయి. ఉదాహరణకి, అంబర్ చరఖా, ఖద్దరు, గోవధ నిషేధం మద్యనిషేధం ఏదైనా తీసుకోండి. అన్నిటికీ గాంధీజీ పేరును విచ్చలవిడిగా ఖర్చు పెడుతున్నారు. కాని ప్రజాధనాన్ని దూబరా చెయ్యరాదని గాంధీజీ చెప్పిన మాట ఎవరికీ జ్ఞాపకం ఉన్నట్లు లేదు.

లోగడ నేను చెప్పినట్లు రెండేసి రోజులకు అయిదుగురు చొప్పున అంటే రోజుకి రెండున్నర మనుషుల చొప్పున ప్రజాధనం స్వంతధనంగా భావించి విదేశ విహారాలకు వెళుతున్నారు. ఈ రెండున్నర మనుషులకీ జై! విదేశ విహారాలు జిందాబాద్!

* * *

## ఉద్యోగాలకు గాలాలు

ఈమధ్య పార్లమెంటులో కొంచెం అలజడి చెలరేగింది. అలజడి మరేం కాదు— కొందరు ముస్లిం సభ్యులు అడపాతడపా చేసే సంయుక్త ప్రకటనే మళ్ళీ చేశారు. కాశ్మీర్‌లో పాకిస్తాన్ కలగజేసుకోరాదని వాళ్ళకోరిక. వారికీ కోరిక ఇంత అర్జంటుగా ఎందుకు పుట్టిందో తెలియడం లేదు.

నిజం చెప్పాలంటే ఈ బాపతు ప్రకటనలవల్ల మేలుకంటె కీడే ఎక్కువ. ఈ ప్రకటనల నిచ్చెనలు ఎక్కి పైకి రావాలని ప్రకటనదారుల ఊహ. ఇద్దరు ముస్లిం భాయీలు కొంతకాలంగా ఉద్యోగాలకు గాలాలు వేస్తున్నారు. వీరు ప్రధానమంత్రి దృష్టి నాకర్షించడానికి అప్పుడప్పుడు తొందరగా సంయుక్త ప్రకటనలు చేస్తూ ఉండడం పరిపాటి. కాని వారి దురదృష్టవశాత్తు పార్లమెంటులోని ముస్లిం సభ్యులందరూ ఈ ప్రకటనలపై సంతకం పెట్టడం ఎప్పుడూ జరగలేదు. పార్లమెంటులోని కాశ్మీర్



సౌదీ అరేబియా పర్యటనకై వెళ్ళిన ప్రధాని నెహ్రూ.

ముస్లిం సభ్యులెవ్వరూ సంతకాలు పెట్టలేదు. ఇతర ముస్లిం సభ్యులూ అంతే. పాకిస్తానీ పత్రికల ఢిల్లీ విలేఖరులు ఈ సదవకాశం బాగా ఉపయోగించుకుని, సంతకాలు పెట్టించడంకోసం భారతప్రభుత్వం బోలెడు ఒత్తిడి చేస్తోందని ఆరోపణ చేశారు.

అసలీ ప్రకటనల కిప్పుడేం అవసరం వచ్చిందని? కాశ్మీర్ పరిస్థితిలో విపరీత పరిణామాలేమైనా కొత్తగా బయలుదేరాయనా? ఒకటి నిజం పాకిస్తాన్ కాశ్మీర్ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం మానక పోతే భారతీయ ముస్లిములు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టబడతారనే భయం ఒకటి బయటివాళ్ళకి కలిగించినట్లు అవుతుంది. భారతదేశంలో ఇస్లామిస్థాన్ ఒకటి మొలుచుకొచ్చినట్లవుతుంది.

* * *

పదిహేనేళ్ళ కిందట ఇద్దరు అమెరికన్లు వ్రాసిన ఒక గ్రంథంపై ఈమధ్య జరిగిన ఆందోళనను తెరవెనుకనుంచి నడిపించినది వారు భారతీయ ముస్లిములకు ప్రాతినిధ్యం వహించే జమైయత్ ఉల్ ఉలేమా ఇ హింద్ సంస్థ అని తేలిపోయింది. ఈ గ్రంథం భారతదేశంలోని ముస్లిముల మనస్సులనెంతగా నొప్పించిందో ప్రధానమంత్రికి తెలియపరచడానికి ఏర్పడిన ముస్లిముల బృందంలో ఒక హిందూ మహిళకూడా చేరడం విచిత్రంగా ఉంది. ఈ మహిళారత్నం ముస్లిముల గూండా చర్యలను, భారత పతాకకు, హిందూమత గ్రంథాలకు ముస్లిములు చేసిన అవమానాలను ఎప్పుడూ నిరసించక పోవడం మరీ విచిత్రం!

మతావేశాలను సమర్థించాలని కాదు నే నసేది. భట్రాజు పొగడ్తలనే నేను విమర్శించేది. ప్రధానమంత్రినో, ఫలానా మంత్రినో మెప్పించి పైకిపోవాలని వారికి నచ్చే విధంగా ప్రకటనలు చేసే స్వార్థపరులనే నేను విమర్శించేది. చైనా వెళ్ళివచ్చి ప్రశంసా ప్రకటనలు చేసే — గుంపుకు మంచి ఉదాహరణ. ★



అంతర్జాతీయ యువజన సమితి కార్యదర్శి కోశాధికారి అయిన శ్రీ హెన్రీగ్రిమ్స్ సతి సెప్టెంబరు 17 న మద్రాసు వచ్చిన సందర్భంలో స్థానిక యంగ్‌మెన్స్ క్లబ్ ఆమె గౌరవార్థం ఉడ్‌లాండ్స్ (రాయపేట) లో విందు చేశారు. ఈ చిత్రంలో గ్రిమ్స్ సతికి హారం వేస్తున్న వారు శ్రీమతి విక్టర్ ఎ. చంద్రన్.




### (రెండో అంకం తరువాయి)

పద్మ: ఫోను తీసుకుని హాలో అన్నాను. అంతలో నే వెనకనుంచి వచ్చి నన్ను ఎటాక్ చేశాడు. ఆ తెరలవెనక దాక్కుని వుంటాడప్పటిదాకా. ఏదో నా మెడచుట్టూ వేసి -

జా: ఏదో అంటే?

పద్మ: ఏమిటో మరి గుడ్డపీలికలా వుంది - రిబ్బనో - నెక్ టయో -

జా: ఊఁ. సరే తర్వాత ఏమైంది?

పద్మ: నన్ను టేబులు మీదకు తోశాడు. నేను గిలగిల కొట్టుకున్నాను. అప్పుడే నా చేతికి కత్తెర తగిలింది -

జా: మామూలుగా కత్తెర ఎక్కడ ఉంటుందసలు?

పద్మ: ఆ బుట్టలో. అందులో నా అల్లిక దారాలు, కుట్టుపని సామాన్లతో బాటు వుంటుంది రాత్రి కటింగ్స్ తియ్యడానికి తీసి ఇక్కడే మర్చిపోయాను.

జా: ఊఁ... అసలు మీరీ గొడవ జరగంగానే మాకెందుకు ఫోన్ చెయ్యలేదండీ?

[ఫణి పద్మ తనవంక క్రీగంట చూడటం చూస్తాడు. ఒక్క క్షణం ఇద్దరూ ఒకరినొకరు చూచుకుంటారలా]

పద్మ: (ఫణి తన్ను చెప్పమన్న సంగతి గుర్తుచేసుకోడానికి ప్రయత్నిస్తూ) చేద్దామనే నా వుద్దేశం. కాని లైనులో మా వారున్నారన్న సంగతి అర్థమైంది. వారు మీకు ఫోన్ చేస్తారుగదా అని నే వూరుకున్నాను.

[ఫణి నెత్తిమీదనుంచి ఓ భారం దిగినట్టయింది]

జా: పోనీ - అథమం ఓ డాక్టర్నైనా పిలుద్దామని మీ కనిపించలేదా?

పద్మ: డాక్టరెందుకు?

జా: ఆ మనిషికి గాయం అయిందికదా -

పద్మ: గాయమేమిటి- మనిషి చచ్చిపోతే!

జా: (తాపీగా) అతను చచ్చిపోయాడో లేదో అప్పుడే మీ కెలా తెలుసు?

పద్మ: నేను ... నాకు ... ఆ మాత్రం అర్థం కాదూ?

జా: నాడి పట్టుకు చూశారా?

పద్మ: లేదు.

జా: గుండెలమీద చెయ్యి పెట్టి చూశారా?

పద్మ: (విసిగింది - కోపం వచ్చింది - అసహ్యం వేసింది) లేదు - ఎవరికైనా ఇట్టే అర్థమైపోతుంది అతను చచ్చిపోయాడని! మిడిగుడ్లుపడి రెప్ప ఆర్పకుండా చూస్తున్న ఆ కళ్ళవంక ఒక్కసారి చూస్తే చాలు -

 మాతృక: ఫ్రెడరిక్ నాట్

అనుసరణ: ప్రఖ్యా శ్రీరామమూర్తి 

జా: (నిందాగర్భితంగా) అంటే అతని మొహం చూశారన్న మాట మొత్తానికి మీరు!

పద్మ: (అసమర్థ కోపంతో) అతని కళ్ళే చూశాను. అతని మొహం నాకేం కనిపించలేదు.

ఫణి: ఇదుగో ఇన్స్పెక్టరుగారూ! నా భార్య అతన్ని అంతకు ముందెప్పుడూ చూసి యెరగదన్న మాట ఖాయం. ఎందుకనవసరంగా దాన్నలా ఉక్కిరి బిక్కిరి పెడతారు? ఇంకేమైనా అడగాల్సింది వుంటే అడుగుదురూ.

[ఇన్స్పెక్టరు ఒక్క క్షణం ఫణివంక, మరో క్షణం పద్మవంక చూస్తాడు. మళ్లీ ఫణి వైపు తిరుగుతాడు]

జా: ఆ మనిషి రాత్రి లోపలికెలా ప్రవేశించాడని మీ అభిప్రాయం?

ఫణి: ఇంకెలా వస్తాడు? హాలు తలుపు తాళం వేసివుంది. తోట తలుపు గడియే ఎలాగో తీసుకుని వచ్చివుండాలి.

జా: వాడు తోటలోంచి రాలేదు.

ఫణి: మరెలా వచ్చాడంటారు?

[ఇన్స్పెక్టరు హాలు గుమ్మం కేసి వెళ్తాడు]

జా: (నెమ్మదిగా) వాడు ఈ గుమ్మంలోంచే వచ్చాడని నా నమ్మకం.

[తలుపు కొద్దిగా తెరిచి మళ్లీ చిన్న క్లిక్ తో మూసేస్తాడు]

ఫణి: కాని-ఆ తలుపు తాళం వేసివుంది ఇన్స్పెక్టర్! నేనూ శంకరం రాత్రి నాటకానికి వెళ్తూ నేనే తాళంవేసి వెళ్ళాను.

జా: ఈ తలుపుకెన్ని తాళం చేతులున్నై?

ఫణి: రెండు. నా దగ్గరొకటీ, నా భార్య దగ్గరొకటీ వుంటుంది (పద్మవైపు తిరిగి) పోనీ నే వెళ్ళిన తర్వాత ఆ తలుపును వ్వేమైనా తీసి మళ్ళీ తాళం వెయ్యడం మర్చిపోయావా?

పద్మ: లేదండీ, నే నసలా చాయలకే పోలేదు.

ఫణి: (ఇన్స్పెక్టరుతో) అసలు వాడిటే వచ్చాడని మీ కంత నమ్మకం ఎందుకనండీ?

జా: తోట వాకిలి బలవంతంగా తెరిచిన చాయలేవు. గడియ అసలే విరిగి లేదు. అదీ గాక రాత్రి కొద్దిగా వాన కురిసింది. వాడు తోటలోంచి వచ్చి వుంటే కొస్త కాకపోతే కాస్తైనా బురద అయి వుండాలి. కాని ఆ బురద మరకలు బైటవరండాలో మీ గుమ్మం ముందున్న పీచు మీద వున్నాయి దానికి తోడు ఆ పట్టా తాలూకు పీచు వాడి బూట్లకు కొద్దిగా అతుక్కుని వుంది కూడానూ.

ఫణి: ఐతేమటుకు___? వాడు తాళం ఎలా తీసుకు రాగలడు? అదీ పగలగొట్టి లేదు గదా!...... ఒక్క క్షణం ఆగండి. ఇప్పుడర్థమైందనుకుంటాను. (పద్మతో) నీ

హాండ్‌బ్యాగ్ ఓసారి పోయింది — నీకు జ్ఞాపకం వుందా?

పద్మ: అవును...

ఫణి: అప్పుడు నీ తాళంచెవి కూడా ఆ బ్యాగ్‌లోనే వుందా?

పద్మ: వుందిగాని మళ్ళీ దొరికినప్పుడు తాళంచెవితో బాటే దొరికిందిగా!

జా: (ఆసక్తితో) ఏమిటది? బ్యాగ్ పోయి దొరికిందా? ఏం బ్యాగ్?

ఫణి: హాండ్‌బ్యాగ్ సార్. మా పద్మ నాంపల్లి స్టేషనులో పారేసుకుంది.

పద్మ: తర్వాత లాస్ట్‌ప్రాపర్టీ ఆఫీసువాళ్లు స్టేషనులో దొరికిందని పంపించారు.

జా: ఏమైనా పోయిందా ఆ బ్యాగ్‌లోది?

పద్మ: అందులో వున్న డబ్బంతా పోయింది.

జా: ఇంకేమైనా?

[ఫణి క్రీగంట పద్మని పరిశీలించి చూస్తున్నాడు]

పద్మ: (కొంచెం సంకోచించి) ఇంకేం పోలేదు.

జా: (మామూలుగానే) ఏమైనా కాగితాలుగానీ, ఉత్తరాలు గానీ..?

పద్మ: ఊహుఁ.

జా: (వున్నట్టుండి సూటిగా) బాగా జ్ఞాపకముందా మీకు?

పద్మ: (నిశ్చయానికొచ్చి) బాగా జ్ఞాపకముంది.

జా: అది పోయినప్పుడు మీ తాళంచెవి అందులోనే వుందన్నమాట!

పద్మ: అవును కాని మళ్లీ సంచీ వచ్చినప్పుడు తాళంచెవితో సహా వచ్చింది

ఫణి: కాని ఆ డబ్బు కాజేసినవాళ్ళే మరో మారు తాళంచెవి కూడా చేయించుకుని ఉండవచ్చు.

జా: చివరికి సంచీ ఎక్కడ దొరికింది?

పద్మ: నాంపల్లి స్టేషనులోనేనట.

ఫణి: కాని చాలా రోజుల తర్వాత దొరికింది. ఆలోగా నే మారు తాళంచెవి చేయించి అసలు తాళంచెవి మళ్ళీ సంచీలో పెట్టేసి వుండొచ్చు.

జా: మారు తాళంచెవి చేయించినా వాడు దాన్ని తీసుకురాలేదండీ. తెచ్చివుంటే అది వాడి జేబుల్లో మాకు దొరికి వుండాల్సిందిగా! కాని అది కాదుగదా అసలే తాళంచెవి వాడి జేబుల్లో దొరకలేదే మాకు!

ఫణి: ఐసీ... ఐతే మళ్ళీ మొదటికొచ్చామన్నమాట!

జా: ఊహు లేదు... ఆఁ — మీరతన్ని కాచిగూడా స్టేషనులోనా చూశానన్నారు?

ఫణి: అవును.

జా: నాంపల్లిలో కాదుగదా?

[ఫణి ఒక్కక్షణం ఆలోచిస్తాడు.]

ఫణి: అయివుండొచ్చు (ఏదో తట్టి తొందరగా పద్మవంక తిరిగి) నీ బ్యాగ్ ఎప్పుడు పారేసుకున్నది? మనం చెంగల్వరెడ్డి యింట్లో పెళ్ళికి పోయిన రోజు కదూ? అవును. ఆనాడే! అది నాంపల్లే. ఇప్పుడు జ్ఞాపకమొస్తోంది — నేను చూసినప్పుడు ప్లాట్‌ఫారంమీద టీ తాగుతూ నుంచుని వున్నాడు!

జా. (పద్మతో) మీ బ్యాగ్ పోయింది కూడా అక్కడే గదూ?

ఫణి: అవునక్కడే! (పద్మతో) నేను నీతో కూడా అన్నట్టున్నాను కదు పద్మా — మా కాలేజీ మేట్‌లాగా వున్నాడనో యేదో —

పద్మ: నాకు జ్ఞాపకం లేదు.

[ఫణి ఇన్‌స్పెక్టర్ వంక చూస్తాడు. ఇన్‌స్పెక్టర్ పద్మవంక చూస్తున్నాడు.]

జా: మొత్తానికి హాండ్‌బ్యాగ్‌కీ వాడికీ ఏదో సంబంధం వున్నట్టే తోస్తోంది... ఆల్‌రైట్... అన్నట్టు — పంచాయతీ జరిగే లోపుగానే మీ యిద్దరూ వాఙ్మూలం ఒకటి ఇవ్వాలి. స్టేషనిక్కడికి చాలా దగ్గర. ఓసారి మీరు అక్కడకు రావాల్సి వుంటుం దిప్పుడు.

[హాలు తలుపు తట్టిన శబ్దం. ఫణి వెళ్ళి తలుపు తీస్తాడు. శంకరం వస్తాడు.]

శం: గుడ్‌మార్నింగ్ మిస్టర్ ఫణీ! హాలో పద్మా! (ఇన్స్పెక్టర్ని చూస్తాడు) ఏమిటి ఊరంతా గగ్గోలుగా వుంది—?

ఫణి: గుడ్‌మార్నింగ్ శంకరం! (ఇన్స్పెక్టర్ని చూపుతూ) వీరు ఇన్స్పెక్టర్ జాఫర్. ఇన్స్పెక్టర్ - ఈయన నా స్నేహితుడు శంకరం. మంచి రచయిత. ఈయనా నేనూ కలిసే రాత్రి నాటకానికి వెళ్ళింది!

[శంకరం, ఇన్‌స్పెక్టరు కరస్పర్శ చేస్తారు. ఇన్స్పెక్టరు శంకరాన్ని కొంత విచిత్రంగా చూస్తాడు]

జా: ఓ! మీరా శంకరంగారంటే!... మీరు రాత్రి ఫణి గారితో వున్నారుగనక మీరు మాకు కొంత సాయం చేయగలరనుకుంటాను: వీరు ఫోన్ చెయ్యడానికి వెళ్ళినప్పుడు టైమెంత అయిందో చెప్పగలరా?

[శంకరం ఒక్కక్షణం ఆలోచిస్తాడు]

శం: Yes పదిగంటల నలభై నిముషాలు.

జా: అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలరు?

శం: నాటకం రెండో సీను జరుగుతోందప్పుడు. చాలా విసుగ్గావుంది. టైం చూసుకుని ఇంకెంత సేపు పడుతుందిబాబూ అని ఫణిగార్ని అడిగాను. ఆ వెంటనే ఫోన్ చేసి వస్తానని వెళ్ళారు.

ఫణి: అవును అప్పుడే వెళ్ళాను.

జా: థాంక్యూ సార్. ఆ ఫోను అప్పుడు చెయ్యడానికి ఈవిడగారు హాల్లోకి రాంగానే ఎవరో ఆమెను ఎటాక్ చేశారు పాపం.

శం: అంటే... [ఫణితో] మీరు రాత్రి ఫోను చేసింది ఇంటికా?

ఫణి: అవును:

శం: అదేమిటి — నాతో అనటం మీ ప్రొప్రైటరు గారికి ఫోను చేసివస్తాననికదూ?

పద్మ: (వున్నట్టుండి ఫణివైపు తిరిగి) అఁ — అవునండీ ఇందాక మిమ్మల్ని అడగబోయి మర్చిపోయాను కూడానూ — ఇంతకీ రాత్రి మీ రెందుకు ఫోను చేశారు?

[అందరూ ఫణివంక తిరుగుతారు]

చూడండి!

సన్‌లైట్

సగంబిళ్ల మాత్రమే

ఈ బట్టలన్నిటిని ఉతికింది!

అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ!




సన్‌లైట్

సబ్బు

బట్టలను తెల్లగానూ, కాంతివంతముగానూ ఉతుకును

S. 242-X52 TL

భారతదేశంలో
తయారుచేయబడినది

 ఫణి 

జా: (ఫణికేసి వస్తూ) ఒక్కక్షణం ఆగండి సార్. లేకపోతే మళ్ళీ మర్చిపోతాను. 10-40కి మీ ప్రొప్రయిటరుకు ఫోన్ చెయ్యడానికి వెళ్ళారు కదూ మీరు?

ఫణి: అవును. హాలు ముందున్న పబ్లిక్ ఫోన్ దగ్గరికెళ్ళాను.

జా: ఐతే మీరు ఇంటికి ఫోన్ చేసే ముందు మీ ప్రొప్రయిటరుతో ఎంతసేపు మాట్లాడారు? గజపతి మరణించిన Correct time తెలుసుకోడానికి అడుగుతున్నాను-

ఫణి: నిజానికి నేనాయనకు ఫోను చెయ్యనే లేదసలు. తీరా ఫోను చెయ్యబోయేసరికి నంబరు గుర్తురాలేదు. అందుకని ఇంట్లో నా నోట్‌బుక్కులోనో డైరక్టరీలోనో చూసి నంబరు చెప్పమని చిన్నదానికి దామని నీకు ఫోన్ చేశాను.

పద్మ: అంటే మీ ప్రొప్రయిటరు ఫోను నంబరు అడగడానికా నన్నర్ధరాత్రి పన్నెండింటికి నిద్ర లేపింది!

ఫణి: ఏంచెయ్యను మరి-ఆ టెలిఫోన్ బూత్‌లో డైరక్టరీ లేదాయె! అదీగాక నువ్వింకా నిద్రపోయి వుంటావనుకో లేదు నేను. (ఇన్స్పెక్టరుతో) ఆయనే మో ఇవ్వాళ తెల్లారంగానే ఢిల్లీకి విమానంలో వెళ్తున్నాడు. ఒక సంగతి జ్ఞాపకం చెయ్యాల్సి వచ్చింది. చాలా అవసరమైన విషయం.

జా: ఐతే ఇంతకీ ఆయనకసలు ఫోనే చెయ్యలేదన్నమాట!

ఫణి: లేదు. ఇక్కడ జరిగిన గొడవ వినంగానే ఇహ కాళ్లూ చేతులూ ఆడలేదు. ఆసంగతి పూర్తిగా మర్చిపోయాను.

జా: ఐసీ... (శంకరంతో) ఆఁ-శంకరం గారూ! వీళ్లిద్దరూ ఇప్పుడు వాఙ్మూలం ఇవ్వడానికి మా స్టేషనుకు వస్తున్నారు. (నోట్ బుక్కు తీస్తూ) దయచేసి మీ అడ్రసు కాస్త ఇస్తారా-మళ్లీ ఓ సారి మిమ్మల్ని కలుసుకోవాలి.

[ఫణి హాలుగుమ్మంకేసి వెళ్తాడు]

శం: తప్పకుండానూ.

[పద్మ పడకగదిలోకి వెళ్తుంది]

నేను తాజ్ హోటల్లో-

జా: (నోట్‌బుక్, పెన్సిలూ అందిస్తూ) ఇందులో కాస్త వ్రాయండి అడ్రసు. మీ ఫోను నంబరుకూడా వ్రాయండి.

(శంకరం వ్రాయడం పరిశీలించిచూస్తూ) ఇంతకు ముందెప్పుడైనా ఈ వూరొచ్చారా సార్ మీరు?

[ఆ ప్రశ్న ఎందుకడుగుతున్నాడో శంకరానికి బోధపడదు.]

శం: (రాస్తూ) ఆ. యేడాది క్రితం ఓ సారి వచ్చానండీ.

జా: ఐసీ, [శంకరం తిరిగి యిచ్చిన నోట్ బుక్కు, పెన్సిలు తీసుకొని అడ్రసు వంక ఓ సారి చూచి, జేబులో పెట్టుకుంటాడు. ఫణి మళ్ళీ హాల్లోకి వస్తాడు.]

ఫణి: ఏమండీ ఇన్స్పెక్టరు గారూ! బైట జనం పోగైనారు. వాళ్ళని పంపించేద్దురూ మీకు పుణ్యం వుంటుంది.

జా: పంపించిన కొద్దీ పోగవుతారు వాళ్లు. మనం ఇలా తోటలోంచి దొడ్డిగుమ్మాన వెళ్లిపోదాం లెండి. అటు వేపు గేటు వుంది గా?

ఫణి: వుంది. కాని అదితాళం వేసి వుంటుందేమో చూసి వస్తానుండండి.

[ఫణి తోటవాకిలి తలుపు గడియ తీసి తోటలోకి వెళ్తాడు. అతను వెళ్ళేదాకా ఆగి ఇన్స్పెక్టరు అప్పుడు శంకరం వైపు తిరుగుతాడు]

జా: (కొంచెం దగ్గిరగా జరిగి) ఆయనకేమైనా తెలుసా-మీ యిద్దరి గొడవా? మీకూ పద్మావతిగారికీ వున్న సంబంధం-?

శం: (ఉలిక్కిపడి) ఏమిటి?

జా: మీరావిడకు ఒక ఉత్తరం రాశారు. మద్రాసు నుంచి. (శంకరం తెల్లబోయి నిర్విణ్ణుడై అతనివంక చూస్తూ వుండిపోతాడు) ఆ వుత్తరం రాత్రి ఇక్కడ చచ్చిపోయిన మనిషి జేబులో దొరికింది ఫణిగారికీవ్యవహారం ఎంత వరకూ తెలుసో నాకు తెలీక ఇప్పటి దాకా నేనా సంగతి యెత్తలేదు. ఆ వుత్తరం అతని జేబులోకెలా వచ్చిందో మీకేమైనా తెలుసా?

శం: ఊఁహూఁ.

[పద్మ పడకగదిలోంచి వస్తుంది. తల కొద్దిగా సర్దుకుని వుంది. చేతిలో హేండుబ్యాగ్.]

పద్మ: వారేరి?

శం: ఇప్పుడే అలా తోటలోకి వెళ్ళారు.

జా: ఏమండీ-మీరు బ్యాగ్ పారేసుకున్నప్పుడు ఉత్తరం కూడా ఒకటి పోయిందా?

[పద్మ గబుక్కున శంకరంవంక చూస్తుంది]

పద్మ: లేదు.

శం: అది ఆ చచ్చిపోయిన మనిషి జేబులో దొరికిందట!

జా: అది మీ బ్యాగ్‌లోంచి పోయింది కదూ?

పద్మ: (ఏమీ చెప్పలేక నీరసంగా తల ఆడిస్తుంది).

జా: మరి ఇందాక అడిగినప్పుడెందుకు చెప్పలేదు?

పద్మ: మా వారికేం తెలీదండీ ఆ గొడవ!

జా: వాడు మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు కదూ?

శం: ఇంకేం దాచి లాభంలేదు పద్మా.

[తన జేబులోంచి పర్సు తీస్తాడు. పద్మ అతనివంక భయావిహ్వల నేత్రాల్తో చూస్తూంది]

పద్మ : వొద్దు. వొద్దు శంకరం!

శం : ఇంతకంటే చెయ్యగలిగిందేం లేదు. ఇన్స్పెక్టర్ ! పద్మ నేరాసిన వుత్తరం పారేసుకున్నాక ఇవిగో ఈ రెండు చీటీలు పోస్టులో వచ్చాయట !

[రెండు ఆకాశ రామన్న వుత్తరాలూ తీసి ఇన్స్పెక్టరుకు ఇస్తాడు. ఇన్స్పెక్టరు అవి చదువుతాడు]

జా : (పోస్టు ముద్రలుచూసి) కిందటి ఫిబ్రవరిలోవి. (పద్మతో) అప్పట్నుంచీ మీదగ్గరికి ఎన్నిసార్లు వచ్చాడీమనిషి ?

పద్మ : ఎప్పుడూ రాలేదు.

జా : నిజం చెప్పడం——

పద్మ : (కోపంవచ్చి) నేను నిజమే చెప్తున్నాను. వాడు నాదగ్గరికి ఎప్పుడూ రాలేదు.

జా : (తొందరగా) మిస్టర్ శంకరం! మీరుకూడా మాతో ఇప్పుడేవస్తే బాగుంటుంది.

శం : దానికేం, అలాగే.

జా : పద్మావతిగారూ! మీరు వాఙ్మూలం ఇచ్చేటప్పుడు మరికొందరు పోలీసు ఆఫీసరుకూడా వుంటారు. మీకు ముందే హెచ్చరిక ఇస్తున్నాను. మీరుచెప్పే ప్రతి మాటా మావాళ్లు వ్రాసుకొని అవసరమైతే మీకు ప్రతిగా కోర్టులో ఉపయోగిస్తారు. ఇప్పటిదాకా మీరు నాతో మాట్లాడిందంతా మర్చిపోండి. నేనూ మర్చిపోతాను. ఇప్పటికైనా ఈ మనిషిని గురించి మీకు తెలిసిందంతా—రాత్రి అసలేం జరిగిందో అదీ వున్నదున్నట్టు చెప్పండి. మీ రేదైనా దాచిపెట్టడానికి ప్రయత్నిస్తే అది బైట పడ్డప్పుడు మటుకు మీపరిస్థితి చాలా విషమంగా వుంటుంది.

పద్మ : అసలు మీ వుద్దేశ మేమిటో నాకు అర్థం అయ్యేట్లు చెప్తే బాగుండును మీరు.

జా : చెప్తాను. ఈ మనిషిని చంపానని మీరు ఒప్పుకుంటున్నారు.

[ఫణి నిశ్శబ్దంగా తోటలోంచి వచ్చి వింటూ నిలబడతాడు]

ఆత్మ రక్షణకోసం ఆపని చెయ్యాల్సి వచ్చిందని అంటూన్నారు మీరు కాని దురదృష్టవశాత్తూ దానికి సాక్ష్యం ఎవరూ లేరు. మీ వొక్కరిమాటే, మేం నమ్మినా నమ్మక పోయినా!

ఫణి : ఇందులో అపనమ్మకానికి తావెక్కడుంది ఇన్స్పెక్టర్ ?

జా : వాడు దొంగతనానికి వచ్చినట్టు ఎక్కడా ఏ నిదర్శనమూ లేదు ఫణిగారూ. పైగా మీ భార్యని వాడు బ్లాక్ మెయిల్ చేస్తున్నాడంటానికి మటుకు కావాల్సినన్ని నిదర్శనాలున్నాయి.

## ★ ఫణి ★

ఫణి : షాక్ తెయిలా ?

జా : తోటలోంచి వచ్చాడని మీరంటున్నారు. కాని వాడు వరండాలోంచి— ఆసింహద్వారంగుండా నే స్ట్రైట్ రాయల్ గా లోపలికి వచ్చాడని మాకు ఖాయంగా తెలుసు,

పద్మ : (గుండెల్లో దడతో) అలా ఎలా కాగలదండీ? తలుపు తాళం వేసివుంది! వున్న తాళం చేతులు రెండు. (తన హేండ్ బ్యాగ్ లో వెతుకుతూ) మావారి తాళం చెవి వారిదగ్గరుంది. నాది...ఇదుగో—నా బ్యాగ్ లోనే వుందే!



[తీసిచూపుతుంది. ఒక్కక్షణం అవకాశం]

జా : అదే వచ్చిన చిక్కు! మీకే మీ తాళం చెవితో తలుపుతీసి అతన్ని లోపలకు రానిచ్చి వుండొచ్చు.

ఫణి : అది రానిచ్చిందనా మీ అభిప్రాయం ?

జా : ప్రస్తుతానికి అంతకు మించి మరో మార్గాన వచ్చివుంటానికి అవకాశాల్లేవు.

పద్మ : నామీదపడి నాగొంతు పిసికెయ్యడానికి ప్రయత్నించాడన్నా కూడా మీరు నమ్మడంలేదా ?

[చేతో గొంతు తడుముకుంటుంది]

జా : ఆ గాయాలు మీరే చేసుకోవచ్చు. ఆ తోటగుమ్మం అవతల ఫెన్స్ లో రెండు రిబ్బను మధ్యమధ్య ముడి వేసి దొరికాయి

పద్మ : దాంతోనే ననుకుంటూను నాకంఠం చుట్టూ చుట్టి నొక్కెయ్యడానికి ప్రయత్నించింది!

జా : ఆ రిబ్బన్లు మీవి! కదూ ?

పద్మ : (మనిషికి బాగా భయమేసింది) ఊహు

జా : అవి మీవని మాకు తెలుసు! ఒక రిబ్బను కొద్దిగా చిరిగివుంటే రంగుకలియని సిల్కుదారంతో కొత్తగా కుట్టి వుంది కూడాను. ఆ సిల్కుదారంపు బంతి మీ అల్లిక సామాన్ల బుట్టలో మాకు దొరికింది.

[పద్మ హేండ్ బ్యాగ్ టేబులుమీద పడేసి గబగబా అబుట్టదగ్గరకు వెళ్ళి అందులో వెతుకుతుంది.]

పద్మ : (బాగా భయపడిపోయింది) ఏమండీ-ఇందులో రెండురిబ్బన్లు వుండాలి-కనిపించవేం ?......

[ఫణి టేబులు దగరకువెళ్ళి త్వరత్వరగా ఒక నంబరు డయల్ చేస్తాడు]

ఫణి : (డయల్ చేస్తూ) పోలీసులు తమ కేసులు నెగ్గడంకోసం వాళ్ళ కనుమాన మున్నచోట డెలిబరేట్ గా సాక్ష్యం పుట్టిస్తారని వింటమే గాని మన మెప్పుడూ చూసెరగం.

పద్మ : (అతనిదగ్గిరికి పరుగెత్తికెళ్ళి) రాత్రి తెల్లవార్లూ వాళ్ళిక్కడే వున్నారు. వాళ్ళే ఆ రిబ్బన్లుతీసి ఏంచేసినా చేసి వుండొచ్చు.

ఫణి : అంతే అయివుండాలి. ఆ వచ్చి పోయినవాడిబూట్లు పీటమీద తుడిచింది కూడా వీళ్ళే అయివుండాలి!

[పద్మ శంకరంవైపు తిరుగుతుంది. ఫోనులోంచి లాయరు రామనాథం గొంతు వినిపిస్తుంది.]

రాము : హలో - రామనాథం స్పీకింగ్.

ఫణి : హలోరామూ! నేను ఫణిని. రాత్రి మాయింట్లో ఒకదొంగ పడ్డాడు. పద్మని ఎటాకు చేశాడు కూడాను.

రాము : పద్మనా! దెబ్బలేమైనా తగిలాయా ?

ఫణి : లేదు. ఆమె బాగానేవుంది. కాని ఆ దొంగమటుకు తప్పిపోయాడు. పోలీసులు ఇక్కడే వున్నారు. వాళ్ళేమో-పద్మ వాడిని చంపాలని చంపింకంటున్నారు

జా : (మధ్యలో అందుకుని) చాలా తొందరపడి మాట జారుతున్నారు మీరు!

రాము : వాట్ ?

ఫణి : ఆశ్చర్యం వేస్తోందికదూ ?... వాళ్ళు మమ్మల్ని ఇప్పుడు స్టేట్మెంట్ ఇవ్వడానికి ఖైరతాబాద్ పోలీస్ స్టేషనుకు రమ్మంటున్నారు. నా లాయరువి నువ్వు వచ్చేదాకా ఏ స్టేట్మెంటూ ఇవ్వమని. చెప్తాను సరాసరి నువ్వక్కడికి వచ్చేస్తావా?

రాము : పదినిముషాల్లో వచ్చిపడతాను. పద్మనేం భయపడొద్దని చెప్పు.

ఫణి : థాంక్స్, గుడ్ బై.

[ఫణి ఫోనుదించేసి పద్మకేసి వెళ్తాడు]

జా : మీరు చాలా తొందరపాటు మనుషులు. నా సంగతి మీకు తెలీదు. ఇంకో ఇన్స్పెక్టరయితే రాత్రే మీ భార్యని అరెస్టు చేసి వుండేవాడు!

ఫణి : మీ గామ్యతం నిదానించినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. (పద్మభుజంమీద చెయ్యి వేసి) మరేం ఫరవాలేదు పద్మా! మన రామనాథంకూడా పోలీస్ స్టేషనుకు వస్తున్నాడు.

జా : మిస్టర్ ఫణీ! మీకు నేనో సలహా ఇస్తాను—

ఫణి : థాంక్స్ మాక్కావాల్సిన సలహా లన్నీ మా లాయరు ఇవ్వగలడులెండి

[ఫణి, పద్మ తోటవైపు గుమ్మంలోంచి బైటకు వెళ్ళబోతారు. శంకరం టేబులు మీద హేండ్ బ్యాగ్ చూస్తాడు.]

శం : నీ హేండ్ బ్యాగ్ పద్మా! (బ్యాగ్ అందిస్తాడు)

పద్మ : ఓ! అది తీసుకుని ఓసారి అయోమయంగా గదిఅంతా కలయజూస్తుంది. వెను తిరిగి తోటలోకి వెళ్తుంది. ఫణి ఓ అడుగు వెనకా తాను. శంకరం ఆమెవెనకే వెళ్తాడు. ఇన్స్పెక్టరుకూడా వెళ్ళబోతూ ఆగి ఫణివైపు తిరిగి అడుగుతాడు—]

జా : మీరుకూడావస్తున్నారుకదూ సార్!

ఫణి : మరి! తప్పకుండా వస్తున్నా నిన్స్పెక్టర్!

జా : (తనలోతాను గొణుక్కుంటున్నట్టు) ఊఁ - ఎస్ - అవును - అఁహాఁ - నేననుకున్నానూ....

[ఇన్స్పెక్టరు బైటికి వెళ్తాడు. ఫణి ఓసారి గిరుక్కున గదిఅంతా చూసి కోటు జేబుల్లో చేతులుపెట్టుకుని ఇన్స్పెక్టరు వెనకాల బైటికివెళ్ళి తలుపులు దగ్గరిగా లాగి మూసేస్తాడు] తెర

(ఇంకా ఉంది)

# మరణ కారణం

## ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

౧

గౌతమి ఆ దుర్వార్త విని మొదలు నరికిన తరువులా నేలపై కూలబడి పోయింది. ఆమె ఏకైకపుత్రుడు, అయిదేళ్ళ వాడు, ఆడుకుంటూ ఆడుకుంటూ పాము కరిచి నురగలు గక్కుకుంటూ అక్కడే పడి పోయాడు! ఇరుగు పొరుగు వారంతా ఆ పసి వాణ్ణి గౌతమి కుటీరానికి తీసుకు వచ్చారు. అంతలోనే ఆ పసివాడి ప్రాణం కాస్తా ఎగిరిపోయింది.

ఆ విష సర్పం కరిచీ కరవడంతోనే భయోద్వేగం వలనే ఆ పసివాడి ప్రాణాలెగిరి పోయాయేమో! ఎవరు చెప్పగలరు? అంతా అయిపోయిన తరవాత పదిమందీ పది విధాలుగా గౌతమి నోదార్చారు.

క్రమంగా ఇరుగుపొరుగు వారా కుమారుని కంత్య క్రియలు జరిపించి తమ తమ ఇళ్ళకు మళ్ళిపోయారు. పొద్దు వాలేవరకు చిట్టి చిట్టి పరుగులు పెడుతూ ఆమె కళ్ళ కెదురుగా ఆడుకునే పసివాడు సూర్యాస్తమయం అయ్యేసరికి అదృశ్యుడై పోయాడు!

గౌతమి ఆ దురదృష్టం తలుచుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. ఇరుగు పొరుగు లున్నంతవరకు కొంతవరకు ఉపశమించిన ఆమెదుఃఖం వారంతా ఇళ్ళకు మళ్ళి పోగానే పరవళ్ళు దొక్కుతూ పై కుబికింది. ఆ చిన్ని కుమారుని ముద్దులీలలు తలుచుకొన్న కొద్దీ ఆమె దుఃఖం మరింత హెచ్చు పెరిగి పోయింది.

అంతలో పంజె చీకట్లు కాలుకునైపులా అలుముకొన్నాయి. ప్రపంచం అంతా సాయంకాల కాలసర్పం నోటిలో ప్రవేశిస్తున్నట్టు బాగా మసకమసకగా మారి పోయింది.

పిమ్మట ఒక బోయవాడక్కడికి వచ్చాడు. అతని చేతికర్ర చిట్టచివర ఒక పెద్ద నాగసర్పం వేళ్ళాడుతూంది. బోయవాడు తాటితో దాని కంఠానికి ఉచ్చు బిగించాడు. ఆ చేతికర్ర పై కత్తి పట్టుకుని గౌతమి కెదురుగా నిలబడ్డాడు:

"అమ్మా! నీ పసిపిల్లవాడి ప్రాణాలు పొట్టబెట్టుకొన్న విషసర్పం ఇదే! నన్ను తప్పించుకొని పారిపోవడానికి దీని కెన్ని గుండెలున్నాయి? ఎలాగో అలాగ వెతికి వెతికి పట్టుకున్నాను. ఎక్కడికి పోతుందిది? దీన్ని నా చేతి కత్తితో ముక్కలు ముక్కలుగా నరికి వెయ్యమన్నావా? లేకపోతే భగభగమండే మంటలోపడవేసి భస్మం చెయ్యమన్నావా? ఏమి చెయ్యమన్నావో చెప్పు!"

అని ఎంతో జాలిగా ఆమె వైపు చూచాడు. ఆమె ఆ విష సర్పాన్ని చూచి అలాగే దిగాలుపడిపోయింది. అంతేగాని ఇక ఏమనడానికీ ఆమె నోట మాటరాలేదు!

గౌతమి చాలా ధర్మస్వభావురాలు. భర్తృవియోగం కలిగినప్పటినించీ ఆ పసికందుమీదే పంచప్రాణాలు పెట్టుకుని నిత్యము గృహదేవతా పూజలతోనే పొద్దు పుచ్చేది. ఎవరికైనా కష్టమొస్తే ఇట్టే కంట నీరు పెట్టుకునేది. చాలా జాలిగుండె ఇరుగు పొరుగు వారందరికీ తలలో నాలుకలా మసులుకొనే ఆ ఉత్తమ సాధ్వికి అంతటి ఆపత్తు వచ్చిందే అని ఆ జనపద నివాసులంతా ఎంతో విచారించారు. అది అలాంటి ఉత్తమురాలికిరావలసినఆపదకాదని వారందరూ కంట తడిపెట్టారు. వారందరు ఆమెను ఓదారుస్తూంటే బోయవాడదంతా విన్నాడు

అతనికి కూడా ఆమె దీనావస్థ చూచే సరికి గుండె నీరైపోయింది. వెంటనే ఆ పరిసరం అంతా గాలించి ఆ విషసర్పాన్ని పట్టుకొన్నాడు. ఆమెకెదురుగానే దానిని ముక్క ముక్కలుగా నరికివేస్తే ఆమెకు కొంతవరకైనా మనశ్శాంతి కలగ గలదని అనుకొన్నాడు. కాని ఆమె ఆ సర్పాన్ని చంపివేయడాని కంగీకరించలేదు. పైగా తాటితో ఉచ్చుబిగించడం మూలంగా అది విలవిలా తన్నుకుని ఎంతో బాధపడుతున్న దనీ, దానిని వెనువెంటనే విడిచిపెట్టి వెయ్యవలసిందనీ ప్రార్థించింది. కాని బోయవాడా మాట వినలేదు.

"నాయనా! దాన్ని చంపివేస్తే చచ్చి పోయిన నా కొడుకు మళ్ళీ బతికివస్తాడా? ఏమన్నావా? పాపం! నిష్కారణంగా దాన్నికూడా చంపడం ఎందుకులే. విడిచి పెట్టు. పాపం! నోరులేనిప్రాణి!"

అని వల వలా వాపోయింది. బోయ ఆమాటవిని ఒక్క విషపునవ్వు నవ్వాడు:

"అమ్మా! నీవంటి అమాయికురాలిని నేనెక్కడా కనీ వినీ ఎరగను! పసికందు ప్రాణాలు పొట్టబెట్టుకొన్న విషనాగును విడిచిపెట్టి వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతా ననుకున్నావా? ఇది జరిగేపని గాదు!"

అని బోయ దాన్ని ముక్కలు ముక్కలుగా నరికివేసేకోపంతో ఒరలోని చేతికత్తి తటాలున పైకిలాగబోయాడు.

"ఏమైనాసరే! నీవు దీనిని చంపడానికి నేనంగీకరించను! ఈ ప్రాణిహింస నా కళ్ళ ఎదట జరుగుతూంటే నేను చూస్తూ ఊరుకోలేను!"

అని అతని చేతి కడ్డు పడిందా బ్రాహ్మణి

"ఇలాంటి విషనాగును చంపివెయ్యడం కూడా హింసేనా? చాల్బాలు లేవమ్మా! ఎక్కడ నేర్చావమ్మా! ఈ ధర్మాలన్నీని! ఇప్పుడు దీన్ని విడిచిపెడితే ఇంకా ఇది ఎంతిమందిని చంపుతుందో."

అని బోయవాడామె చేతిపట్టు విడిపించుకొని ఒరలో ఉన్న కత్తి మళ్ళీ పైకిలాగ బోయాడు.

అయినా ఆమె అతన్ని విడిచిపెట్టలేదు! సర్పాన్నేమీ చేయవద్దనీ దాన్ని విడిచి వెయ్యవలసిందనీ పరిపరివిధాలుగా బతిమాలింది. అంతలో వారిద్దరికీ అశరీరవాణిలాగ ఒక సన్నని పిలుపు వినబడింది. బోయ నిర్ఘాంతపడి అటువైపు చూచాడు. గౌతమి కాపిలుపు అతి విచిత్రంగా వినబడింది. అది బోయచేతికర్ర చివర ఉచ్చులో ఊపిరి ఆడకుండా కొట్టుకుంటున్న నాగుబాము కంఠంలోనుంచి వెలువడిన పిలుపు! అదివిని వారిద్దరు నిలువునా నిర్ఘాంతపోయారు!

౨

నాగుబాము బోయ కేసి తిరిగి సన్నని గొంతుతో మొరపెట్టుకుంది: "అయ్యా! నీవనవసరంగా నామీద పగబట్టి మాట్లాడుతున్నావుగాని దీనిలో నేను చేసినతప్పేమీ లేదు! నేను మృత్యుదేవత చేతిలో కేవలం

# నమ్మకాలు; చింతకాయలూ

మంత్రాలకు చింతకాయలు రాలవని సామెత; రాలుతాయని మన దేశంలో ఒక నమ్మకం.

కొన్ని సందర్భాలలో చింతకాయలు రాలనందువల్ల, వాటిమీద మనుషుల నమ్మకాలే రాలిపోయాయి! చింతకాయలు రాలగా చూచినవారికి నమ్మకాలు గట్టిగా నిలిచిపోయాయి.

బాణామతి మంత్రం మొదలు శాపం ఇవ్వడంవరకూ — తేలుమంత్రం, పాముమంత్రం, చేతబడి మొదలైన రకరకాల మంత్రాలు ఉన్నాయంటారు. క్రీస్తుశకంలో శాపాలకథలు వినకపోయినా, కనకపోయినా, అంతకన్న చిన్నరకం మంత్రాల గురించి, వాటి మహిమలను గురించి కథలు వింటునే ఉంటాం.

మీరు ఇవి నిజం అంటారా? ఉత్తి కథలంటారా? ఏమన దలచుకున్నా దాన్ని రుజువు చేయడానికి మీకు తెలిసిన — జరిగిన కథలూ నిదర్శనాలు సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాసి పంపితే ప్రకటిస్తాము.

*　　*　　*　　*

"మంత్రాలు; నమ్మకాలు శీర్షికకు" అని స్పష్టంగా కవరుమీద వ్రాసి, ఆంధ్ర వారపత్రిక చిరునామాకు పంపండి. —ఎడిటర్.

## ★ మరణ కారణం ★

ఒక కీలుబొమ్మను! ఆ దేవత ఎలాగ ఆడిస్తే అలాగే ఆడుతున్నాను. ఇందులో నా తప్పిదం ఏమి ఉన్నది? నాకొ పసిపిల్లవాడి మీద కోపతాపాలేవీ లేవు. అన్యాయంగా నన్నెందుకు సంహరిస్తావు. నేనెవరికీ ఏ విధమైన అపకారమూ చెయ్యలేదు. కొంచెం విదానించి ఆలోచించిచూడు!"

ఆ మాటలు విని బోయవాడు వెటకారంగా ఒక పెద్దనవ్వు నవ్వాడు.

"ఎవరో శత్రువులు బాణం వేశారనీ పాపం బాణంచేసిన తప్పేమీ లేదని చెప్పి బాణం ముక్కలుముక్కలు గా ఖండించకుండా ఊరుకునేవారెవరైనా ఉన్నారా? ఎవ్వరో కరవమన్నారని చెప్పి ఏ పాపము ఎరుగని ఆ పసివాణ్ణి కరచి పారిపోతావా? పైగా నా తప్పేమీ లేదని వాదిస్తావా? అదిగాక మృత్యుదేవతకు మీరంతా ప్రాణంతో ఉన్న ఉపకరణాలు! కనక మీ అందరి తలలు చితక పొడిచివెయ్యవలసిందే!"

అని బోయ మళ్ళీ ఒరలోని కత్తి పైకి తీయబోయాడు. అంతలో సర్పం మళ్ళీ అడిగింది: "ఆగు! ఆగు! నా ప్రశ్నకు తిన్నగా సమాధానం చెప్పు! ప్రాణంతో ఉన్న ఉపకరణాలన్నీ ఒకవ్యక్తి చేసిన కర్మల ఫలితాలనుభవిస్తున్నాయా?"

"అనుభవించితీరవలసిందే!" అన్నాడు బోయ మహాహంకారంతో హుంకరిస్తూ.

"అయితే ఒక్క ప్రశ్న! యజ్ఞకర్తకు ఋత్విక్కులు ప్రాణాలతో ఉన్న ఉపకరణాలేనా?" విషసర్పం నిలదీసి అడిగింది.

"బోయకా ప్రశ్న ఎందుకు పుట్టిందో తెలియలేదు. అందుచేత కొంత విసుగుదలతో సమాధానం ఇచ్చాడు:

"కాకేమి? కాదని ఎవరన్నారు?"

"యజ్ఞకర్తకు వారంతా స్వప్రాణ పరికరాలేగదా?"

"అవును!"

"అయితే యజ్ఞఫలితం ఋత్విక్కులకెందుకు చెందడంలేదు! యజ్ఞఫలితం అంతా యజమానికే చెందనేల?"

ఆ ప్రశ్నతో బోయవానినోటిమాట కట్టుబడిపోయింది. అతనికిక ఏమనడానికీ పాలుపోలేదు. ఆ సర్పం శిశుమరణంలో తన తప్పిదమేమీ లేదనీ మృత్యుదేవతే దానికి కారణమనీ మృత్యుదేవత ఆజ్ఞానిర్వహణంలో తన పాపం సోకదనీ సోదాహరణంగా నిరూపించింది.

ఇక బోయ ఏమని సమాధానం చెప్పగలడు? క్షణకాలం అలాగే ఆ సర్పం కళ్ళకేసి చూస్తూ నిలుచున్నాడు. అతనికదంతా ఏదో ఒక విచిత్రమైన ఇంద్రజాలంలా కనిపించింది. ఆ విషసర్పం ఏదో మిష పెట్టి తప్పించుకుపోవడానికే అవిశ్రాంతంగా ప్రసంగిస్తున్నదని అనిపించింది. కాని అది చెప్పిన దానికిమీ ప్రత్యుత్తరంతోచలేదు. చేతికత్తితో దానిని ముక్కలుముక్కలుగా నరికి వెయ్యడమే దాని ప్రశ్నకొక చక్కని సమాధానం కాగలదని అనుకొన్నాడు. అప్రయత్నంగా అతని చెయ్యి తిరిగీ ఒరమీదికి పోయింది.

అంతలో మృత్యుదేవత అక్కడ ప్రత్యక్షమై అతని కెదురుగా నిలబడింది. కాని అతని వైపైనా చూడకుండా విషసర్పంతో సంభాషణ మొదలుపెట్టింది:

"ఇదేమిటీ అన్యాయం?"

"దీనిలో నేను చేసిన అన్యాయం ఏమి ఉంది? నీ ప్రేరణవల్ల నే ఆపసివాణ్ణి చంపివేశానని చెప్పాను"

"దీనిలో నేను చేసినదికూడా ఏమీలేదే! అన్యాయంగా ఈ నిందఅంతా నా మీదికి నెట్టివేశావు! నీవు చేసినట్టే నేనుకూడా మరి ఒకరి ఆజ్ఞప్రకారమే నావిధి కృత్యం నిర్వర్తించాను. అంతే! దీనిలో నీవు నేను కూడా అస్వతంత్రులమే!"

"ఓహో! అలాగా! ఎవరిచేత?"

"నేను నిన్నాజ్ఞాపించినట్టే కాలపురుషుడు నన్నీ పని చెయ్యమని ఆజ్ఞాపించాడు. అంతే గాని నేనే పాపము ఎరగను. అనవసరంగా నన్నెందుకు నిందిస్తావు"

ఆ మాట విని నాగుబాము కొంచెం తమాయించుకొని నెమ్మదిగా సమాధానం చెప్పింది:

"నేను నీమీద ప్రత్యేకంగా మోపిన నింద ఏమీ లేదు నీ ఆజ్ఞప్రకారం నడుచుకున్నాననీ దీనిలో నా తప్పిదమేమీ లేదనీ అన్నాను. అంతే! ఈ తప్పిదమెవరిదైతే నాకేమి కావాలి ఇదంతా కాలపురుషుడే చేశాడని నీవంటున్నావు. ఆ కాలపురుషుణ్ణి



[ధగధగ మెరిసే కాంతిని చల్లే
కల్లునెమలి కెవరిచ్చారో,
పురి విప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికి రాడా !] (చింతా దీక్షితులు)

—ఫొటో : బి. పి. శాస్త్రి.

మాత్రం నేనెందుకు నిందించాలి? దీనిలో నా తప్పేమీ లేదని చెప్పడమే నా ఉద్దేశ్యం! ఈ కార్యకారణ భావాల గొడవంతా నా కెందుకు?"

ఆ సంబోధన వినగానే బోయ కెంతో ఆశ్చర్యం వేసింది! ఆ పసిపిల్లవాణ్ణి ఆ పాము కరిచింది. వెంటనే ఆ పిల్లవాడు చనిపోతాడు. కళ్ళున్న వారి కెవరికైనా ఆ విషయం విస్పష్టంగా తెలిసిపోతుంది. ఇంత విస్పష్టమైన విషయంమీద నాగుబాము, మృత్యువు కలిసి అనవసరమైన వాదోపవాదాలు పెంచుతున్నాయి ఇలాంటి స్వల్ప విషయంలో ఇంతింత వాదోపవాదాల అవసరం ఏమి ఉంది? అని వాడిలాగే ఆశ్చర్యపోయాడు. అయినా వాదోపవాదాలు జరుగుతూంటే అతని కిక వినక తప్పలేదు.

పిమ్మట నాగుబాము బోయకేసి తిరిగింది: "విన్నావా? మృత్యుదేవత చెప్పిన మాటలు. నిజానికి మేమిద్దరము కూడా దీనిలో నిర్దోషులమే! కాలపురుషుని ఆజ్ఞప్రకారమే ఈ ప్రపంచ లీల అంతా అవిచ్ఛిన్నంగా సాగిపోతున్నది. సూర్యచంద్రాదు లందరు కాలపురుషుని ఆజ్ఞప్రకారంగా క్రమం తప్పకుండా సాగిపోతున్నారు. సృష్టికీ, స్థితికీ, లయానికీ కాలపురుషుడే మూల కారణం. ప్రాణులన్నీ కాలానుగుణంగా ఈ లోకంలో ఉద్భవిస్తున్నాయి. ఆయు కాలం తీరిపోగానే ప్రాణత్యాగం చేస్తున్నాయి చివరకన్నీ కాలగర్భంలో లీనమైపోతున్నాయి. కొంచెం గాఢంగా

# ★ మరణ కారణం ★

మననం చేస్తే నీకే ఇది తెలిసిపోతుంది. కొంచెం నిదానించు నాయనా! అనవసరంగా హింసకెందుకు పాల్పడతావు?"

బోయ కదంతా వింటూన్నకొద్దీ బాగా విసుగెత్తిపోయింది. కాని ఆ వాదోపవాదాలు సాగించేవారు సామాన్యులు కారు. ఒకవైపున సాక్షాత్తుగా మృత్యుదేవతే నిలబడింది. తన తప్పేమీ లేదని వాదిస్తున్నది. మరిఒకవైపున విషసర్పం తన తప్పేమైనా ఉంటే అది మృత్యుదేవ ఆజ్ఞానిర్వహణమేననీ, అంతకుమించిన దోషమేమీ లేదనీ అంటున్నది. ఏతావతా దానికంతటికీ కాలపురుషుడే కారణమని తేలిపోయింది.

అయినా బోయకదంతా కేవలం అసంబద్ధంగానే కనిపించింది. అతను మృత్యువుకేసీ, సర్పం కేసీ మాసి రుసరుసలాడాడు: "మీ రిద్దరు మహా పాపాత్ములే! నిష్కారణంగా ఏ పాపము ఎరగని పసిపాప ప్రాణాలు తీశారు. మిమ్మల్నిద్దరినీ ఇక ఏమి చేసినా పాపం లేదు!"

మృత్యుదేవత అతనివైపు చూచి చిరునవ్వు నవ్వింది. "మే మిద్దరము కాలపురుషుని భృత్యులమే. ఇద్దరము అతని ఆజ్ఞ ప్రకారమే నడుచుకున్నాము. దీనిలో మా తప్పేమీ లేదు! ఆ పైన నీ ఇష్టం!"

గౌతమికి ఆ వాదోపవాదాలన్నీ చాలా విచిత్రంగా కనిపించాయి. కాని సర్పము, మృత్యుదేవత చెప్పిన విషయాలలో ఆమె కేమీ అనుమానం కలగలేదు. అయినా ఆ బోయవాడు తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లని కూర్చున్నాడు. తనకదంతా తెలియదనీ, ఆ విషసర్పాన్ని సంహరించి తీరతాననీ పంతం పట్టాడు. తనకంటె మృత్యుదేవతే అతనికి బాగా నచ్చజెప్పగలదనే ధైర్యంతో గౌతమి ఆ వాదోపవాదాలన్నీ వింటూ అలాగే కూర్చుండిపోయింది.

మృత్యుదేవత తిరిగీ, అతనికి తమ ఇద్దరి పరాధీనత్వము వివరించి చెప్పింది. ఆ శిశువు మరణంలో సర్పము, తాను కేవలం నిర్దోషులమని అనేక విధాలుగా నిర్ధారణ చేసింది.

"ఏమో! నాకీ మెట్టవేదాంతాలేవీ నచ్చలేదు! నే నీ సర్పాన్ని చంపితీరతాను! ఇంక ఎవరేమి చెప్పినా వినదలుచుకోలేదు!"

అని బోయ తన ఒరలోని కత్తి పెకెత్తి పట్టుకొన్నాడు. అంతలోనే కాలపురుషు డక్కడ ప్రత్యక్షమైనాడు!

## 3

ఆ నూతన పురుషుని చూచి బోయ మళ్ళీ నిర్ఘాంతపోయాడు. విషసర్పము, మృత్యువు బోయవైపు చూచి ఒకేమాటగా ఇలా గన్నాయి:

"అదుగో, ఆ కాలపురుషుడే ఇక్కడికి విచ్చేశాడు! ఆయన్నే అడుగు, నీ సందేహాలన్నీ తీరిపోతాయి!"

అని సవినయంగా కాలపురుషుని కెదురుగా నిలుచున్నాయి. కాలపురుషుడు బోయవైపు చూచి ఒక నవ్వు నవ్వాడు:

"నాయనా! వారిద్దరు చెప్పినది యథార్థమే! ఆ ఇద్దరూ నిర్దోషులే! నా ఆజ్ఞప్రకారమే వారీవిధంగా ప్రవర్తించారు!"

ఆ గంభీరస్వరం వినగానే బోయకిక ఏమనడానికీ నుక్క తిరగలేదు.

మళ్ళీ మేఘగంభీర స్వరంతో కాలపురుషుడిలా గన్నాడు: "వెర్రివాడా! అంతమాత్రంచేత ఆ పసివాని మరణానికి నేనే కారణమని అనుకుంటున్నావేమో! ఆ విషయంలో నేనూ నిర్దోషినే! మర్త్యులు తాము చేజేతులా చేసుకొన్న మనోవాక్కాయ కర్మల మూలంగానే జనన మరణాది దుఃఖాలనుభవిస్తున్నారు! జన్మాంతరాలలో వారు వారు చేసిన కర్మల కనుగుణంగానే నేను మానవుల కాయాకర్మఫలాలందిస్తున్నాను. అంతేగాని దీనిలో నా పక్షపాతమేమీ లేదు. మర్త్యులు తమ కర్మల కనుగుణంగానే సుఖదుఃఖాలనుభవిస్తున్నారు. జీవలోకం అంతా కేవల కర్మాధీనమై అస్వతంత్రంగా సాగిపోతున్నది. నేను కూడా కర్మానుగుణంగానే ప్రవర్తిస్తూంటాను. ఈ లోకము సర్వము కర్మాధీనమే!"

అక్కడ ఉన్నవారంతా కాలపురుషుని జలధర గంభీర కంఠస్వరం వింటూ అలాగే విస్తుపోయి నిలుచున్నారు. కాని బోయ మనస్సులో ఏదో ఒక చిన్న సంశయం బయలుదేరింది. ఆ సంశయం అతని ముఖంలో చూచాయగా పొడచూపించింది. అది చూచి కాలపురుషుడు తిరిగీ ఇలా గన్నాడు:

"మీరంతా కర్మమే సర్వస్వతంత్రమనీ, మానవులంతా కేవలం కర్మాధీనులై జనన మరణాదిదుఃఖాలనుభవిస్తూంటారనీ భావిస్తున్నారేమో! అది సరికాదు! కర్మకూడా సర్వస్వతంత్రం కాదు!"

ఆ మాట వినగానే అక్కడ ఉన్నవారందరి ముఖాల్లోను తిరిగీ సందేహాచ్ఛాయ లలముకొన్నాయి. కాలపురుషుని కంఠస్వరం మళ్లీ గంభీరంగా ధ్వనించింది:

"ప్రపంచంలో ప్రతిప్రాణీ, ప్రతివ్యక్తీ సర్వస్వతంత్రుడే! కాని అజ్ఞానమూలకంగా స్వయంగా చేసిన కర్మఫలితం అనుభవించక తప్పదు. అయితే మానవులు తిరిగీ తమదైనందిన సుకృతకర్మల ద్వారా ప్రాచీన కర్మబంధనాల నుండి విడివడి విముక్తులు కావచ్చును.

"నిజానికి జీవులందరు సర్వస్వతంత్రులే! నిత్య విముక్తులే! కాని అజ్ఞాన భావనామూలకంగా జనన మరణాది బంధనాలలో చిక్కుకొంటున్నారు. తిరిగీ స్వకర్మశక్తివల్లనే బంధవిముక్తులౌతున్నారు. జీవులందరికీ జననమరణాది దుఃఖాలు కలిగించే వారింకెవరు లేదు! వారే చేజేతులా తమ బంధనాలు, సుఖదుఃఖాలు కల్పించుకొంటున్నారు.

"ఈ శిశువు స్వీయకర్మ ఫలితంవల్లనే ఈ విధంగా హఠాత్తుగా సర్పదష్టుడై మరణించాడు. నిజానికీ పసిబాలుని మృతికి అతని పూర్వజన్మకర్మ సఫలితమే ప్రధాన కారణం!

"ఈ జనన మరణాల కర్మ పరిణామము, ఈ కార్య కారణ భావ శృంఖల అత్యంత దురవగాహమైన విషయాలు! మహా మేధావులు మాత్రమే ఇవి అవగాహన చేసుకొని సమస్త బంధనాల నుండీ విముక్తులు కాగలరు!

"అజ్ఞులు మీ వలెనే కార్యకారణాది బంధనాలలో చిక్కుకొని నిత్యము సంకుచిత సుఖదుఃఖాల ద్వంద్వాలతో కుమిలి కృశించిపోతూంటారు!"

ఆ గంభీర జ్ఞానబోధ వినగానే గౌతమి ముఖంలో మొట్టమొదటగా ఒక చిరునవ్వు మొలిచింది.

సర్పం తాను చెప్పింది యథార్థమే అని బుజాన్నదిగదా అని ఆనంద సూచకంగా పడగ విప్పింది. మృత్యుదేవత ఒక నిట్టూర్పు విడిచి పెట్టింది.

అవంతా విని బోయవాడు ఉత్కంఠంమీద ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి పెట్టాడు.

గౌతమి బోయను ఎంతో ఆప్యాయంగా పిలిచింది.

"నాయనా! అసలే పసివాని మృతితో కుమిలి కృశించిపోతున్న నాకింకో పాపం కూడా చుట్టబెట్టడం ఎందుకు? ఆ నాగుబామును విడిచిపెట్టు! నా మాటవిను!"

అని బతిమాలింది. బోయవాని చేతిలోని కత్తి అప్రయత్నంగా నేలమీద పడిపోయింది.



# అమృత హస్తాలు

గుర్రు గుర్రుమని వినిపించిన గురక కృష్ణమూర్తికి మెలకువ తెచ్చింది. తొలకరి వానల మూలాన కొట్టంలో గొడ్లను కట్టివేసి, తానూ ఆ కొట్టంలోనే వోమూల వరిగడ్డి పాన్పు వేసుకునీ, దానిమీద కంబళి పరచి, జంబుకానాతో మెత్తన మర్చుకొని వెచ్చగా పడుకున్నాడు కృష్ణమూర్తి, తన ప్రాణప్రదమైన పశుసంపద సరసన. మేతగా మిగిలిన వరిచెత్త వత్తుగా ప్రక్క వేసికొని, నిద్ర వచ్చినపుడల్లా మోరలు చాచి కండ్లుమూస్తూ, మెలకువ వచ్చినప్పుడల్లా బుసకొట్టి మెడలు విరిచి నెమరు వేస్తూ మళ్ళీ కళ్లుమూస్తూ ఆవులూ, కోడెలూ, లేగలూ గడిపి వేస్తున్నయ్ రాత్రిని. మధ్య మధ్య దూడలు మెళ్ళో గంటల్ని మువ్వల్ని మోగిస్తున్నయ్ మెడలాడించి. కొట్టం బయట దట్టంగా చీకటి. ఆ అమావాస్య రోజులకుతోడు మబ్బువేసి అటు తుంపరా, యిటు చినుకులూ గాకుండా అప్పుడప్పుడు టపటప మంటున్నది. ఈదురుగాలి రివ్వుమని జొరబడ్తది కిటికీలకుండా కొట్టంలోకి. కృష్ణమూర్తి ముసుగు బిగదన్ని, ముడుచుకు పడుకున్నాడు తనకేం పట్టనట్లు; గొడ్లసలు లెక్క చెయ్యలేదు యీ గాలినీ, తుంపరనీ. నిర్విచారంగా గడచిపోతున్నది రాత్రి ఆ వెచ్చని కొట్టంలో గొడ్లకూ, కృష్ణయ్యకూ గూడ.

ఒక్క యెల్లావుమాత్రం నిల్చోనివుంది అటు నెమరూ వేయకుండా; యిటు నిద్రాపోకుండా! ఆ యెల్లావు పెట్టిన గురకే కృష్ణమూర్తిని హఠాత్తుగా నిద్రలేపింది. నిద్రానించి గురకను విని లైటు పెద్దదిజేసికొని యెల్లావుదగ్గరకు వెళ్ళాడు కృష్ణమూర్తి. కండ్లు లోపలికి పీక్కుపోయి, బిక్కచూపులు చూస్తూ, గుర్రు గుర్రుమని గురక పెడుతూ, కండ్లవెంట నీరు కారుస్తూ నించోనుంది యెల్లావు కృష్ణయ్య లాంతరుతో దగ్గరకు రాగానే వొక్కమాటు చెవులు కదిలించి, కండ్లలోకి చూచింది అతి దీనంగా. వేసిన మేత వేసినట్లుంది; ఒక్క పరకనుకూడా ముట్టుకొన్నట్లుగాని మూచూచినట్లు గానీ లేదు. ఏమీతోచక దిగాలుపడి పోయాడు కృష్ణమూర్తి. గురక అంతకంతకూ యెక్కువౌతున్నది. ఆవు నిలబడలేక తడబడుతున్నది. పొట్టంతా పట్టుకున్నట్లు మెలికలు తిరిగిపోతున్నది ఆవు కడుపునొప్పేమో ననుకున్నాడు కృష్ణమూర్తి. కాని మైల కోడెకు వెనక కడుపునొప్పని మంగలి రాముడు మందిచ్చినప్పుడు కోడెకళ్ళిలా పీక్కుపోలేదు. మంగలి రాముడన్నా వుంటే యెలావుండేదో; వాడూ చచ్చిపోయాడు ఊళ్ళో గొడ్డువైద్యం తెలిసిన వాడు యెవ్వడూ లేడిప్పుడు. ఆవు బాధ చూస్తున్న కొద్దీ యేడుపొస్తున్నది కృష్ణమూర్తికి. భరించలేక వూళ్ళోకి పరుగెత్తాడు, కొండాయకన్నా చెబితే యేగచ్చాకో పుచ్చాకో చెబుతాడేమోనని. కొండాయా, తానూ తిరిగి వచ్చేపాటికి ఆవు పడిపోయి

*◆◆◆◆◆◆◆◆◆*◆◆◆◆◆◆◆◆◆*

**"చైతన్య"**

*◆◆◆◆◆◆◆◆◆*◆◆◆◆◆◆◆◆◆*

వుంది. గురక కొట్టానికంత దూరాన వుండంగానే వినిపిస్తున్నది. ఆ గురకవింటే కృష్ణమూర్తి పేగులు దూసుకొచ్చాయి. "అంబా" అని వో అరుపరచి కాళ్లు తన్నుకుంటూ గుడ్లు తేలవేసింది ఆవు. గోలుమన్నాడా అరుపును విని కృష్ణమూర్తి. కొండాయ వెళ్తూనే తిరిగి పోతున్న ఆవు మెడను పట్టుకున్నాడు. "విడిచి యేం లాభం తమ్ముడూ! గురక రోగమొచ్చి యేగొడ్డు బతుకుతుందని?" అన్నాడు కొండాయ కృష్ణమూర్తిని చూస్తూ. మళ్ళీ గురక వినిపించలేదు.

తెల్లవారి మాదిగలు యెల్లావును యీడ్చుకపోవటానికి వస్తే ఆవుకుమ్మన్నాడు కృష్ణమూర్తి. దానిమీద వున్న అభిమానం కొద్దీ, చింతలచేలో పూడ్పించున్నాడు చర్మం వొలవనీకుండా. ఎల్లావు 'యిలవేల్పు'లా ఆ యింటే పుట్టి పెరిగి, ఆరుకోడెదూడల్ని రెండు పెయ్యదూడల్ని పెట్టిందా యింట్లో. ఈ సంపదను చూసుకుంటే యెంతో ముచ్చటేసేది కృష్ణమూర్తికి. ఎల్లావును చూస్తే ఆప్యాయంగా ఆదరంతో నిమిరేవాడు. చంటిపిల్లలు దగ్గరకు వెళ్ళినా కసురుకొని యెల్లావు, గంగడోలును మోరపైకెత్తి గోకించుకుంటుంటే యెలాంటి ఆనందానుభూతిని పొందేవాడో కృష్ణయ్య! ఆవు తన చేతుల్ని నాకుతుంటే అమ్మ ముద్దెట్టుకున్నట్లయి పిల్లాడై పోయేవాడు. అవన్నీ జ్ఞప్తికివచ్చి కృష్ణయ్యకు దుండు రేగినట్టయ్యేది. కళ్లెంట కారుస్తూ, కాళ్ళీడ్చుకుంటూ చింతలచేనికెళ్లి కూర్చొని కూర్చొని వచ్చేవాడు కొట్టానికి యేదూడ అరుపోవిని. తల్లి దగ్గర పాలుపోతే యెల్లావే తలెంచిట పాలివ్వటానికి కృష్ణమూర్తికి. అందుకనే యెల్లావు చావు తల్లిచావులా తలచుకొని కుమిలిపోయేవాడు. ఎల్లావు చావు కృష్ణమూర్తికి వో పెద్ద లోపాన్ని గుర్తింపజేసింది. మంగలి రాముడన్నావుంటే యెల్లావుండేదో ననుకొని వుస్సురు మనుకుంటూ, యెల్లావును తలచుకొని నిట్టూరుస్తూ చింతలచేలో యెంతసేపో గడిపేవాడు రోజూ.

* * *

కృష్ణమూర్తి, చలమయ్య పంతులుగారి కొడుకు. చలమయ్య పంతులుగారు మహాపండితులు; సదాచారసంపన్నులూను, భగవంతుడిచ్చిన పొలాన్ని సాగుచేయించుకుంటూ ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించి పోతన్నగారిని మరపిస్తుండేవారు చలమయ్య పంతులుగారు. కొడుకు కృష్ణమూర్తికి పుట్టిననాటి నుంచి; పశువులంటేనూ పొలమంటేనూ ప్రాణం. కృష్ణమూర్తిని అంతా 'పండిత పుత్రుడని' అంటుండేవారు చిన్నప్పుడు చదువుమీద ధ్యాసలేక పోవటాన. అయితే ఏడవయేటికల్లా కృష్ణమూర్తికి 'చిక్కాలల్లటం; 'సిగమోరలు' వేయటం; పలుపుత్రాళ్ళు వేయటం వెన్నతో బెట్టిన విద్య. అదేం ఖర్మమో చదువనగానే తలనొప్పి, కడుపునొప్పి వంతులు వేసుకొని వచ్చేవిట!... పదేళ్లు వచ్చేదాకా ప్రయత్నించి వదలివేశారట చలమయ్య పంతులుగారు కృష్ణమూర్తిని చదువురాదని. పదేళ్ళకల్లా నాగటికొండ్ర వేయటానికి కృష్ణమూర్తికిసాటి వూరుమొత్తంమీద వొకరో

యిదగ్గో వుండేవారట. పన్నెండేళ్ళొచ్చే పాటికి కృష్ణమూర్తి స్వయంగా, యెల్లావు పెట్టిన కోడెదూడల్ని రవార్పి సేద్యం సాగించాడు. కృష్ణమూర్తి అప్పటినుంచి కృష్ణయ్యయ్యాడు. నాలుగేండ్లు దాటీ దాటకుండానే యెల్లావు జీవితం తెల్లవారింది ఇది కృష్ణయ్య బాల్యం.

ఇప్పుడు కృష్ణయ్యగారు నలభైయేండ్ల మనిషి. సేద్యమే వృత్తి, మంచి పలుకుబడీ పరపతీ సంపాదించిన వ్యక్తి. పెద్దకొడుకు పూర్ణానందం తెలివితేటలకు తాతగారికి సామ్యం తేగలవాడు. చదువంటే యెంతో శ్రద్ధ! కాబట్టే పంధొమ్మిదేండ్లన్నా నిండకుండా బి యె ప్యాసు అయ్యాడు. తరువాతేం జేయాలో నిర్ణయించలేక తొలకరి రోజులు వచ్చినా యింకా యింటివద్దే వున్నాడు యెటూ వెళ్ళకుండా.

ఆరాత్రి సామాన్యమైన రాత్రిగా లేదు. ఈదురుగాలి, కడుపునొప్పి తెరలులాగా మధ్య మధ్య జల్లులూ చిమ్మచీకటీని! వీటికి, తోడు గోంగ్రించే కప్పల గోల! బలులూ, భవనాలూ గల పెద్దలంతా గాఢనిద్రలో వున్నారేమోగాని, మిగతా నాసిరకమంతా యెంత ముడుచుకున్నా తీరని చలికి కలత నిద్రపోతున్నారనో సగం నిద్రపోతున్నారనో చెప్పాలి. రెండోజాము దాటుతూ దాటుతూ వుంది. "కిష్టయ్యగారూ! కిష్టయ్యగారూ!" అని అదే పనిగా వినబడుతున్న కేకలకు కలత నిద్రలోవున్న పూర్ణానందం లేచి "ఎవరది?" అని విసుక్కుంటూ ప్రశ్న వేశాడు. మాది బల్లుఖానుడి పాలెం బాబూ! కిష్టయ్యగారి కోసం..." సమాధానం పూర్తిగాకుండానే "కృష్ణయ్యగారిప్పుడురారు. వంట్లో బాగాలేక యిదివరదాకా బాధపడుతూ యిప్పుడే కండ్లు మూశారు" ముసుగు తన్నుతూ ముక్తసరిగా మూడుమాటలకు తక్కువలోనే తేల్చి చెప్పేశాడు పూర్ణానందం బి యె

"బాబ్బాబూ! వొక్కమాటు లేపండి నాయనా! మాయెల్లావు..."

ఎల్లావూ లేదు పుల్లావూ లేదు; నీగోలే నీదిగాని చెప్పింది వినిపించుకోవేం? యెల్లావు యెలావుంటూ" పూర్ణానందం చివరిమాటలు వింటూనే గబుక్కున లేచిన కృష్ణయ్య, యెల్లావా? యెలా వుంటిరా పూర్ణా" అంటూ వొక్క వుదుటున లేచి కూర్చున్నారు. "ఎవరో బల్లుఖానుడిపాలెంట. కిష్టయ్యగారూ, కిష్టయ్యగారూ అంటూ వొకటే కేకలు. వంట్లో బాగాలేదన్నాని నిపించుకోడు; న్యూసెన్సు "అని సమాధానమిచ్చాడు పూర్ణానందం బి. యె. తండ్రికి. మారు మాటాడకుండా తలుపు తెరచుకొని బయట కొచ్చారు కృష్ణయ్యగారు. వళ్లుమండిపోతున్నది పూర్ణయ్యకు.

"ఏమిటి నాయనా?" ప్రశ్నించారు వచ్చిన పదహారేండ్ల అబ్బాయిని కృష్ణయ్యగారు. "మాయెల్లావండీ పొద్దుటేల నించి మేతేమెయ్యలేదండి. నీళ్లన్నా తాగలేదండీ. ఒకటేమా వుమాసుద్ది, కళ్లు లోనికి పీక్కుపొయినయ్ యీపూట. అవును జాతుంటే యేసు పాగక మీకాడికి పరుగెత్తుకొచ్చా బాబూ! మీది గొప్ప సెయ్యి. మీ సెయ్యి దగిలితే నా ఆవు బతుకుద్ది..." వింటున్నారు కృష్ణయ్య, పూర్ణయ్యలు. సరిగా ఆ అమావాస్య! సరిగా కృష్ణయ్య ఆ వయసులో వుండగానే; సరిగా యెల్లావే! కృష్ణయ్యకు పాతికేండ్ల క్రిందటి సంఘటన గ్రుర్తుకు వచ్చింది; ఆకాళరాత్రిని తానెలాగడిపాడో యెలాంటి ఆదుర్దాతో కొండాయదగ్గరకు పరుగెత్తాడో. ఇక ఆలోచించకుండా, మారుమాట మాట్లాడకుండా, క్షణం వృథా చేయకుండా కంబళి వేసికొని బయలుదేరారు కృష్ణయ్య గొడుగన్నా లేకుండా, బల్లుఖానుడి పాలానికి. "ఏమిటి నాన్నా! మీకు వచ్చిన జ్వరానికి యీ అర్ధరాత్రి చీకటీ చినుకుల్లో ప్రయాణమా? ఏమన్నా ఆలోచించే చేస్తున్నారా?" పూర్ణానందం బి. యె. నిలదీసి అడిగాడు తండ్రిని.

బాబ్బాబూ! వారినాపబాకండి మీకు దండం బెడతా; వారిచెయ్యి దగిలితే నాయల్లావు దక్కుతుందనికళ్ల నీరు కారుస్తూ బతిమాలుకున్నాడు బల్లుఖానుడిపాలెపు అబ్బాయి.

పూర్ణా! సరిగా యి దేసితిలో నేనూ ఇరవై నాలుగేండ్ల క్రిందట అలమటించాను నాయనా! అయినా యెల్లావు దక్కలేదు" ప్రశాంతంగా చెప్పుకుపోతున్నారు కృష్ణయ్య. నెమ్మదిగా ముసుగుతీసి వింటున్నాడు పూర్ణానందం.

"ఆ రోగమొచ్చిన మూగజీవాన్ని చూస్తే పాషాణంవంటి హృదయం కూడా కరిగిపోతుంది నీ కనుభవం లేదుగాని మన యెల్లావు చావే నన్ని వైద్యం నేర్చుకోవటానికి, యీనోరులేని పశువులకు సేవచేయటానికి పురికొల్పింది. నేర్చుకున్న జ్ఞానాన్ని నిష్ప్రయోజనం చేయటం తప్పు. అందులోనూ నోరులేని మూగజీవుని, తెలిసివుండీ, చేతైవుండికూడా బాధనుంచి తప్పించటానికి ప్రయత్నం చేయక పోవటం క్షమించరాని తప్పు. గొడ్లు పక్కనేపడుకొని, వాటితోటే జీవనంగా జీవనంగడుపుతున్న రైతుకు, బిడ్డలపైన వొకవాత్సల్యమూ గొడ్లపైన మరో రకపు వాత్సల్యమూ వుండవు. నాకు వంట్లో సరిగాలేక పోవటం వల్ల యే ప్రేమతో నీవునన్నాపాల నిప్రయత్నిస్తున్నావో అలాటి ప్రేమే ఆ అబ్బాయిదీని! నాకిప్పుడు ప్రాణంమీద కొచ్చిఉంటే యెలాంటి ఆదుర్దాతో నీవు డాక్టరు దగ్గరకు పరుగెత్తి వుండేవాడవో అలాంటి ఆదుర్దాతోనే ఆ అబ్బాయీ యీరెండుమైళ్లూ; అర్ధరాత్రి పరుగెటుకొచ్చాడు. ఆ డాకర నీవు ప్రార్థిస్తేదారాకుంటే నీమన సెలావుంటుందో వూహించుకో నాయనా!" అంటూనే సాగిపోయాడు కృష్ణయ్యగారి బల్లుఖానుడు పాలానికి

పూర్ణానందానికి ఠరీ పరీ తోచలేదు తండ్రికి మరేమి చెప్పటానికి అవకాశమే కన్పించలేదు. తండ్రి పగలంతా వుష్యాసే సనిజ్ఞప్తికి వచ్చి పూర్ణయ్య చొక్కావే

## స్టార్ వాల్యూ; కార్ వాల్యూ

"బర్సాత్" చిత్రంతో రాజ్ కపూర్, పేరూ, డబ్బూ కూడా గడించుకున్నాడు. వాటిలో డబ్బుతో మంచి కారుకొన్నాడు. అప్పటికది సరికొత్తరకం. రాజ్ కపూర్ పేరువల్ల, అందరికీ ఆకారు బాగా గుర్తు అయిపోయింది. కొద్దిరోజుల్లోనే ఆ కారూ పేరు గడించుకుంది. అక్కడినించి, జనం ఆ కారునిబట్టి రాజ్ కపూర్ ను గుర్తించడం మొదలు పెట్టారు. ఆకారు కనబడితే, అతడక్కడ ఉన్నట్టు పసిగట్టి చూడబోయేనారు.

"రాను రాను 'ఈ రాజ్ కపూర్ కన్న' అతగాడి కారుకే ఎక్కువ పేరు వచ్చేస్తోందని నాకు భయం వేసింది. ఇదెక్కడి గొడవ అని ఆ కారుని కాస్తా అమ్మివేశాను" అన్నారు రాజ్ కపూర్ పకపకనవ్వుతూ. ఫిలిం జర్నలిస్టులతో గోష్ఠి నెరపుతూ అయన ఈ ఛలోక్తి విసిరారు.

నాలుగైదేళ్ళక్రితం హాలీవుడ్ లో ఇటువంటిదే, కొంచెం భారీఎత్తున జరిగిందని వినికిడి. మిక్కీరూనీ అనే నటుడు, ఏవాగార్డ్నర్ ను వివాహం చేసుకొన్న కొత్తల్లో, అక్కడివారంతా ఆమెను మిసెస్ మిక్కీరూనీ అని పిలిచేవారట. ఇందువల్ల మిస్ ఏవాగార్డ్నర్ గా తనకున్న పేరు, ప్రచారం, స్టార్ వాల్యూ దెబ్బతింటాయని ఆమె భయపడి, భర్తకి విడాకులిచ్చిందట.



# అమృతహస్తాలు



కొని వొక్క పరుగులో పోయి కలుసుకున్నాడు తండ్రిని; అలాగే అనుసరించాడు చక్కని జాగిలంలా. పోతూనే ఆవును చూచారు. పూర్ణయ్య కళ్లు నీళ్ళతో నిండిపోయాయి. ఆపుకోవాలని ప్రయత్నించినా ఆపటం కష్టమైపోతోంది. కృష్ణయ్యగారు పిడకలు తెప్పించి రాజేసి యినపగునపాలు ఐదింటిని సన్నపాటివి తెప్పించి కాలుస్తున్నారు. పదిమంది మనుషులు పోగైనారు; గడ్డిగడ త్రాళ్లనూ, యారమోను నొకదాన్నీ తెప్పించారు. ఎర్రగా కాలిన గునపాలతో ఆవు చెవు క్రిందుగా ఐదుచుక్కలవాతల్ని వేశారు కృష్ణయ్యగారు, ఆవు గిలగిలలాడింది. పూర్ణయ్యహృదయం క్షోభించిపోయింది. కట్లూ దడీయంగానే బెదిరిపోయి పరుగెత్తిందావు. "ఇది గురకరోగం; సమయానికి కనుక్కున్నాడు కుర్రాడైనా తెలివిగలవాడు గాబట్టి. మరో జాము దాటితే ఆవు దక్కేదిగాదు. ఎండుగడ్డిని మాత్రం వేసి; కాచిచల్లార్చిన వేడినీళ్ళు నే పెటండి. తెల్లవారి బారెడు ప్రొద్దు యెక్కేపాటికి ఆవు మేతకు తిరుగుతుంది," అని చెప్పుతున్న కృష్ణయ్యగారి కాళ్ళమీదపడి యేడ్చాడు ఆవుగలబ్బాయి "నా ఆవును బతికించారా బాబూ!" అంటూ. ఆ అబ్బాయికి ధైర్యం చెప్పిబయలుదేరారు కృష్ణయ్యగారు పూర్ణయ్యతో.

"పంతులుగారిది అమురుతి అస్తం" అంటూ పదిమంది చెతులెత్తి దణ్ణం పెట్టారు "పశువైద్య విశారదు"లకు. త్రోవలో తండ్రే చెప్పారు పూర్ణయ్యతో ఆనాటికే యీ వైద్యం తెలిసి వుంటే తన యల్లావు అలా పోయేదిగాదని. వస్తూనే ముసుగు తన్నాడు పూర్ణానందం. నిద్ర వెంటనే రాలేదు. ఆ ఆవూ, వాతలూ, తండ్రికి అమృత హస్తా అంటూ నమస్కరించిన మనుష్యుల ముఖాలు, ఆవు చూసిన చూపులూ, యివే జ్ఞాపకానికి వస్తున్నయ్. అలాగే మాగన్నుగా నిద్రపట్టింది. కలతనిద్రలో గూడా యీ ఆలోచన దొర్లుతూనే వుంది. అంత వరకూ "దమ్మిడీ ఆదాయం క్షణంతీరికాలేని యీ వెట్టిచాకిరి" అని కనితండ్రిని గురించి అనుకునే పూర్ణయ్యలో విపరీతమైన పరివర్తన వచ్చింది. తండ్రి గొప్పదనాన్ని వున్నత భావాల్ని అంతదాకా గ్రహించనే లేకపోయినందుకు కించబడ్డాడు. తన తండ్రి హస్తాలు తనకంత వరకూ సర్వసామాన్యమైన చేతులనే తెలుసుగాని ఆరోజువరకూ అవి అమృత హస్తాలని తెలియదు.

సినిమా తెర మీద కన్పడ్డట్టుగా రెండు చేతులు ప్రత్యక్షమయ్యాయి. వాటి నావరించి తెల్లని వెలుగు మిరుమిట్లు గొల్పేలా స్వచ్ఛంగా ప్రకాశిస్తోంది. భక్తితో నమస్కరించాడా హస్తాలకు. అవి తనతండ్రిచేతులే. అంతవరకూ సామాన్యమైనవిగా మాత్రమే కన్పించిన చేతులు. తన నెత్తికొని, లాలించి, నవ్వించి ఆదరించి, పెంచి, పెద్ద చేసిన నాన్న చేతులు! అమృతహస్తాలు.

ఆ రెండు చేతులూ నెమ్మదిగా తెరనుంచి తప్పుకున్నాయి వెంటనే మరెన్నో చేతులు కన్పించాయి ఎన్నో చేతులు. అన్నీ చేతులే. ఆకాశంలోని చుక్కల రాశిలో దేదీప్యమానంగా వెలిగే దివ్యనక్షత్రాల్లా ఆ హస్తసముదాయంలో యేరినట్లు యెక్కడో కొన్ని జతలచేతులు దివ్యకాంతుల్ని విరజిమ్ముతున్నయ్. ఆ దివ్యహస్తాలకు విప్రముడైనాడు పూర్ణానందం.

తరువాత కల కథలా నడిచింది. "ఈ రెలుపెయన్నో అమృతహస్తాలు పని జేస్తేనో తయారైనీకీరోజు నీ ప్రయాణాన్ని సుకరమూ, సౌఖ్యప్రదమూ చేసింది. ఈ చిన్ని సీసాలోని గుక్కెడు మందూ మానవుణ్ణిరక్షించి బ్రదికిస్తుంది. ఈ ఆహారం నీకు ప్రాణాధారం. ఈ వస్త్రం నీమానరక్షకురాలు. ఈ గృహం నీకావాసం. నీవు చూచే యీ ప్రతివస్తువూ మానవుల సుఖసౌఖ్యాల కోసమూ; మానవుని వునికికోసమూ; నిర్మింపబడిందే. ఇవన్నీ యెన్ని అసదృశ అమృత హస్తాల శ్రమ ఫలితమో వూహించు" మళ్ళీ నమస్కరించాడా హస్తాలకు పూర్ణానందం. ఈ అమృతమయ హస్తాలన్నీ సమ్మె పేరు చెప్పి పనిమాని ముడుచుకుంటే నని ప్రశ్నించుకున్న పూర్ణానందం గుండెదడదడలాడింది. తక్షణమే ఆలోచన మార్చుకున్నాడు.

"నీవు చూచిన నలభైకోట్లజతల చేతులలో కనీసం సగం వొకవొక సంవత్సరం దేశసౌభాగ్యంకోస - మీకోసం; మీబిడ్డలకోసం; తరతరాల మీ భావిసంతతికోసం - ఉదారంగా శ్రమిస్తే, భారతం భూతలస్వర్గం! స్వర్గసీమలో విహరిస్తున్న పూర్ణానం దాని కానందానుభూతి పట్టలేనంతే మెలకువ వచ్చింది.

"ఓం అంగుష్ఠాభ్యాన్నమః. ఓం తర్జనీభ్యాన్నమః. ఓం మధ్యమాభ్యాన్నమః ఓం అనామికాభ్యాన్నమః. ఓం కనిష్ఠికాభ్యాన్నమః" అని కృష్ణయ్యపంతులుగారి కంఠం గంభీరంగా వినిపించింది అమృతహస్తాలను పూజిస్తూ, ఆత్మలో నమస్కరించాడు నిమీలిత నేత్రాలతో ఆ అమృత హస్తాలకు.



# ★ సూయజ్ రగడ ★

జూలై 26 వ తేదీని నాసర్ సూయజ్ కాలవను జాతీయం చెయ్యడంతో ఇంగ్లండులోను, ఫ్రాన్సులోను ఒక పెద్ద కలకలం చెలరేగింది. బ్రిటిష్ ప్రధాని ప్రకటనల ధోరణి చూచి ప్రముఖ రాజకీయ వేత్తలు చాలామంది సూయజ్ సమస్య యుద్ధానికి దారితీయగలదని కూడా భయపడ్డారు.

తరవాత, అమెరికా ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన దేశాల మధ్య జరిగిన సంప్రతింపుల ఫలితంగా, ఆగస్టు 16 న లండన్‌లో 22 దేశాల సమావేశం జరిగింది ఈ సమావేశంలో అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన దేశాలేకాక రష్యా, భారతదేశం ఇండోనీషియా మొదలైన దేశాలు కూడా పాల్గొన్నాయి

ఆ సభలో అమెరికా విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డలెస్ సూయజ్ సమస్య పరిష్కారానికి ఒక చతుస్సూత్ర ప్రణాళిక ప్రతిపాదించారు. ఇది సూయజ్ కాలవను అంతర్జాతీయ ఆధిపత్యం కిందికి మార్చాలనే లక్ష్యంతో చేసిన ప్రతిపాదన. డలెస్ ప్రతిపాదించిన నాలుగు సూత్రాలు ఇవి:

(1) 1888 కాన్‌స్టాంటినోపిల్ ఒప్పందంలోని మొట్టమొదటి సూత్రం ప్రకారం సూయజ్ కాలవను ఇంకా పటిష్టమైన రవాణా సౌఖర్యాలతో అభివృద్ధి పొందించాలి అన్ని దేశాలకు ఈ కాలవ గుండా స్వేచ్ఛగా ప్రయాణం చెయ్యడానికి తగిన అవకాశాలు ఏర్పాటు చెయ్యాలి.

(2) ఈ ఏర్పాట్లను జాతీయ దృక్పథంతో గాని, రాజకీయ దృక్పథంతో గాని పరిశీలించరాదు.

(3) సూయజ్ కాలవ రవాణావల్ల వచ్చే ఆదాయంలో న్యాయమైన భాగం ఈజిప్టు దేశానికి ఇవ్వాలి.

(4) పాత సూయజ్ కెనాల్ కంపెనీకి న్యాయమైన నష్టపరిహారం చెల్లించాలి

మొదటి లండన్ సమావేశం ప్రారంభిస్తూ బ్రిటిష్ ప్రధాని ఆంథోనీ ఈడెన్ ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగిసిన తరవాత, ఇంతటి క్లిష్ట సమస్య ఎన్నడూ తలెత్తలేదని అన్నారు.

పిమ్మట జరిగిన చర్చలో సూయజ్ కాలవ అంతర్జాతీయ పరిపాలనకోసం ఒక ప్రతిపాదన చేశారు. భారతదేశం వేరొక పంచ సూత్ర ప్రణాళిక ప్రతిపాదించింది ఐతే ఆ ప్రతిపాదన లండను సమావేశ ఆమోద ముద్ర పొందలేదు.

లండను సమావేశంలో 18 దేశాలు మాత్రమే డలెస్ ప్రతిపాదనకు తమ అంగీకారం తెలియజేశాయి.

ఇథియోపియా, ఇరాన్, స్వీడన్, అమెరికా, ఆస్ట్రేలియా దేశాల ప్రతినిధులతో ఒక రాయబార సంఘం ఏర్పాటు చెయ్యాలనీ, ఈ సంఘానికి ఆస్ట్రేలియా ప్రధాన మంత్రి రాబర్టు మెంజిస్ అధ్యక్షత వహించాలనీ



ఈజిప్టు అధ్యక్షుడు నాసర్

ఈ రాయబార సంఘం లండను సమావేశ ప్రతిపాదనలపై నాసర్‌తో చర్చించాలనీ సమావేశంలో తీర్మానించారు. భారతదేశం, ఇండోనీషియా, రష్యా, సింహళం నాలుగు దేశాలు దీనికి వ్యతిరేకించాయి.

ఇదే సమయంలో రష్యా కమ్యూనిస్టు పార్టీ నాయకుడు నికితా కృశ్చేవ్ ఆగస్టు 24 న రుమేనియా రాయబార కార్యాలయంలో ప్రసంగిస్తూ, బ్రిటను, ఫ్రాన్సులు యుద్ధంలో చిక్కుకోరాదనీ, యుద్ధమే వచ్చినట్లయితే అరబ్ దేశాలన్నీ ఏకమై ఈజిప్టు ప్రభుత్వానికి అండగా నిలబడగలవనీ ఆ యుద్ధంలో ఈజిప్టుకు "వలంటీర్ల" సహాయం కూడా లభించగలదనీ హెచ్చరించారు.

భారతదేశం ప్రతిపాదించిన పంచసూత్ర ప్రణాళిక ఇది:

1888 కాన్‌స్టాంటినోపిల్ ఒప్పందాన్ని సూయజ్ కాలవ సంరక్షణ దృష్టితో పునః పరిశీలన చెయ్యాలి.

కాన్‌స్టాంటినోపిల్ ఒప్పందంలో పాల్గొన్న దేశాలే కాక సూయజ్ కాలవ వినియోగించుకునే దేశాలన్నీ ఒక సమావేశం ఏర్పాటు చెయ్యాలి. ఈ పథకం ఆచరణకు అవసరమైన ఇతర చర్యలుకూడా తీసుకోవాలి.

సూయజ్ కాలవపై ఈజిప్టు సర్వాధిపత్యానికి భంగం రానివిధంగా అంతర్జాతీయమైన రవాణా సౌకర్యాలు ఏర్పాటు చెయ్యాలి

సూయజ్ కాలవ వాడకందారుల సంఘం ఒకటి ఏర్పాటు చేసి, దానికి సూయజ్ కాలవ నిర్వహణలో సముచితమైన సలహా ఇచ్చే ప్రతిపత్తి కల్పించాలి.

ఈజిప్టు ప్రభుత్వం ఐక్యరాజ్యసమితి ప్రతి ఏడాదీ సూయజ్ పరిపాలనసంఘ నివేదిక సమర్పిస్తూండాలి

ఈ ఐదు సూత్రాలలో సూయజ్‌పై ఈజిప్టు సర్వాధిపత్యాన్ని అంగీకరించడం చాలా ముఖ్యమైన అంశం.

భారత ప్రతిపాదనలో మొదటి లండను సమావేశంలో అంగీకారయోగ్యం కాకపోయినా, భారతదేశం సూయజ్ సమస్య పరిష్కారంలో చూపిన రాజనీతిజ్ఞత ప్రపంచంలో చాలా రాజ్యాల మన్నన లందుకున్నది.

సెప్టెంబరు 2 న మెంజీస్ రాయబారవర్గం కైరోలో నాసర్‌తో సంప్రతింపు జరిపింది.

రాయబారవర్గాధ్యక్షుడు రాబర్ట్ మెంజీస్ సెప్టెంబర్ 9 వ తేదీని ఒక ప్రకటన చేస్తూ రాయబారవర్గ ప్రయత్నాలు ఫలించలేని పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉన్నదని అన్నారు.

నాసర్ ఆ రోజునే ప్రసంగిస్తూ సూయజ్‌పై ఈజిప్టు సర్వాధిపత్యానికి భంగం కలిగించే ప్రణాళికను దేన్నీ ఈజిప్టు అంగీకరించ జాలదని ప్రకటించారు

పిమ్మట వేరే ఒక ప్రకటన చేస్తూ కాన్‌స్టాంటినోపిల్ ఒప్పందం తిరిగి సమీక్షించడానికి తాము సంసిద్ధులమేననీ, అయితే ప్రత్యేక సంప్రతింపుల సంఘం ఆ సంప్రతింపులు జరపవచ్చుననీ అన్నారు.

తరవాత సెప్టెంబరు 11 న బ్రిటిష్, ఫ్రాన్సు ప్రభుత్వాలు ఈజిప్టు చేసిన ప్రతిపాదన తమ కంగీకార యోగ్యం కాదని ప్రకటించాయి

పాత సూయజ్ కంపెనీ ఈజిప్టుతో చేస్తున్న నౌకా చోదకులందరు తమ పనులనుంచి విరమించాలని ఆజ్ఞ జారీ చేసింది.

సెప్టెంబర్ 12 వ తేదీని బ్రిటిషు ప్ర

(30-వ పేజీ చూడండి)

జేబుల్నిండా తుపాకీమందు...
నిప్పువాడీలాగా ఉంది ప్రస్తుత ...
కుప్పతెప్పలుగా తయారుచేసుకు...
ఎటునుంచి ఒక్క నిప్పురవ్వ ...
వేడుసులు హామకున్న సూయజ...
దారుణమారణంగా మారిపోవచ్చు...
బ్రిటన్ ఫ్రాన్సులు ఈ సమయం...
రాలకు భంగం లేనివిధంగా కాలువ...

# ప్రాక్పశ్చిమ...

# సూయ...



...న్ని అడ్డంకులు ఎదురైనా సూయజ్ కాలవను త్రవ్వించటమే జీవిత ...ధ్యేయంగా పెట్టుకుని పదేళ్ళలో ఆ పని పూర్తిచేసిన ఫ్రెంచి ఇంజనీరు ...డి లెసెప్స్, (కుడినుంచి రెండోవ్యక్తి) ఆయన సహాయకులు.

మన ఆర్థిక వ్యవస్థలో పెట్రోలు
...ప్రాధాన్యం నానాటికీ ఎక్కువవౌ...
...ది. ఈ పెట్రోలులో ఎక్కువభాగం
...యజ్ కాలువ గుండానే మనదేశానికి
...ంది. అందుచేత ఆ కాలువ గుండా
...రవాణా స్వేచ్ఛగా, నిర్విఘ్నంగా
...సాగడం మన అభివృద్ధికి చాలా అవ
...', అని బ్రిటిష్ ప్రధాని సర్ ఆంథోనీ
...న్ ఇటీవల కామన్సు సభలో ప్రక
...రు.
...టిష్ వారి ఆర్థిక వ్యవస్థకు సూయజ్
...ంత ప్రధాన మైనదే. ఈ మాట ఎవరూ
... లేరు. ఒక్క బ్రిటిష్ వారికే కాక
... పాశ్చాత్య రాజ్యాలకూ, ఆమాట
అనేక ఆసియా రాజ్యాలకూ కూడా
...జ్ కాలువ అత్యంత ప్రధానమైన
మార్గం. ఈ కాలువను నిర్వహించే
...పనీని రెండు నెలల క్రితం
... జాతీయం చేసింది. కాలువ నిర్వహ
...తీయం చేసినప్పటికీ అంతర్జాతీయబడం
...ు తాము మన్నిస్తామనీ, ఏ దేశపు నౌక
...విరోధం కల్పించమనీ, ఈజిప్టు ప్రభు
...గ్దానం చేసింది. పాశ్చాత్యరాజ్యాలు
...గానాన్ని తృణీకరిస్తూ, కాలువ నిర్వ
... అంతర్జాతీయ యాజమాన్యంలో నే
...లని, ఈజిప్టు యాజమాన్యంలో ఉండ
...వీలు లేదనీ వాదిస్తున్నాయి. తమ
...నెగించు కోవడానికి అవసరమైతే
...యోగానికి కూడా ఈ రాజ్యాలు
...మవుతున్నాయి. దీన్ని బట్టి

చూడగా సూయజ్ కాలువలో స్వేచ్ఛగా, నిరవరోధంగా రవాణా సాగడం కంటే, కాలువ నిర్వహణ తమచేతిలో ఉండడం, కాలువ పెత్తనంలో తమదే పైచెయ్యిగా ఉండడమే పాశ్చాత్యరాజ్యాలకు ముఖ్యమని స్పష్టపడుతున్నది. ప్రపంచంలోని అనేక కీలక ప్రాంతాలు పాశ్చాత్య రాజ్యాల ఆధీనంలో ఉన్నాయి. గత యుద్ధానంతరం నుంచీ ఈ ప్రాంతాలపై పాశ్చాత్యుల ఆధిపత్యం నెమ్మది నెమ్మదిగా దెబ్బతింటూ వచ్చింది. ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని అనేక దేశాలు శతాబ్దాల నిద్రావస్థనుండి మేల్కొని తమ హక్కులను తిరిగి సంపాదించుకుంటున్నాయి. ఇది తమ ఆర్థిక, రాజకీయాధిక్యానికి భంగకరం అని గ్రహించి పాశ్చాత్యులు ప్రాగ్దేశాలతో ఘర్షణ పడుతున్నారు. ఈ ఘర్షణకు సూయజ్ తాజా ఉదాహరణగా తయారైంది.

## వెర్రివాడి పగటికల

సూయజ్ కాలువ నిజంగా బ్రిటిష్ ఆర్థిక వ్యవస్థకు ముఖ్యమైనదే. అయితే ఇది ఈనాటిమాట. కాని నూరేళ్ళ కిందటి మాట వేరు. మొన్న కామన్సు సభలో బ్రిటిష్ ప్రధాని ప్రకటించిన దానికి పూర్తిగా విరుద్ధమైన ధోరణిలో నూరేళ్ళ కిందటి బ్రిటిష్ ప్రధాని ఒక ప్రకటన చేశాడు.

ఆ బ్రిటిష్ ప్రధాని పేరు లార్డ్ పామర్‌స్టన్.

సూయజ్ వద్ద కాలువ త్రవ్వడం అసాధ్యం, కేవలం వెర్రివాడి పగటికల అని

ఆయన ఆ ప్రతిపాదన త్రోసివేశాడు. యూరప్ లోని ఇంజనీర్లందరూ కలిసి సాధ్యమే నని వాదించినా తన అభిప్రాయం మారదని ఆయన మొండి పట్టు పట్టాడు. ఒకవేళ కాలువ త్రవ్వకం సాధ్యమైనా, అసలు త్రవ్వకానికే తానంగీకరించనన్నాడు.



సుమారు నూరేళ్ళ కిందట సూయజ్ కాలవ త్రవ్వ...

[illegible]

# ...గాలను కలిపే జలసంధి

# సూయజ్ కాలువ చరిత్ర

ఈ కాలువ త్రవ్వితే భారతదేశంతోను, ఇతర ఆగ్నేయాసియా దేశాలతోను బ్రిటిష్ వ్యాపారం అభివృద్ధి చెందుతుందన్నమాట నిజమే కాని బ్రిటన్ కెంతలాభకరమో ఫ్రాన్సుకూ అంతే లాభకరం కాలువ మూలంగా బొంబాయి మార్సేల్సు మధ్యదూరం 4600 మైళ్ళకు తగ్గుతుంది. అప్పుడు ఫ్రెంచి వారి సామ్రాజ్య విస్తరణ దాహానికి ఇండియా బలి అవుతుంది. అందుచేత ఇదంతా బ్రిటన్ పై దెబ్బ తీయడానికి ఫ్రెంచివారు పన్నిన పన్నాగమే అని పామర్ స్టన్ వాదించాడు.



...కం ప్రారంభమైంది. త్రవ్వకం దృశ్యాన్ని చూపించే ఈ ఫోటో 1868లో తీసినది.




నూరుమైళ్ళ సూయజ్ కాలువ.

సూయజ్ కాలువ త్రవ్వించిన ఫ్రెంచి ఇంజనీరు ఫెర్డినాండ్ డి లెసెప్స్ బ్రిటిష్ సహాయాన్ని అర్థించగా పామర్ స్పష్టంగా అతని అభ్యర్థన త్రోసిపేశాడు. కాని డి లెసెప్స్ నిరుత్సాహపడలేదు. ప్రత్యర్థుల కుట్రలకు, పనివాళ్ళ తిరుగుబాట్లకు రోగాలకు, కష్టాలకు వెనకంజ [illegible] తాననుకున్న పని సాధించాడు.

సూయజ్ కాలువ పూర్తయ్యేవరకి బ్రిటిషువారు అంతవరకూ అప్రధానమని భావిం[illegible] ఆ కాలువ వారికి అతిప్రధానమైం[illegible] 1875 లో బ్రిటిష్ ప్రధాని డిస్రేలీ సూయజు కాలువ కంపెనీలో 1,76,602 వాటాలు 40 లక్షల పౌనులకు కొన్నాడు. దీం[illegible] బ్రిటిష్ ప్రభుత్వం అందరికంటె [illegible] వాటాదారైంది.

ఈ సూయజ్ కంపెనీ చరిత్ర కొం[illegible] పరిశీలిద్దాం, కాలువ త్రవ్వకం తలపెట్టిన డిలెసెప్స్ 1854 లో అప్పటి ఈ

# ★ సూయజ్ కాలువ చరిత్ర ★

వైస్రాయి సయద్ పాషా అనుమతి సంపాదించి సూయజ్ కంపెనీ స్థాపించాడు. 1858 లో కంపెనీ వాటాల అమ్మకం ప్రారంభమైంది. ఒక్కొక్క వాటా 500 ఫ్రాంకుల చొప్పున నాలుగు లక్షల వాటాలు అమ్మజూపాడు. నెల తిరిగేలోగా 3, 14, 494 వాటాలు అమ్ముడు పోయాయి. వీటిలో రెండులక్షలు పైగా ఫ్రాన్సులోనే అమ్ముడు పోయాయి. 96, 000 వాటాల పైగా టర్కీ ప్రభుత్వం కొన్నది. మరొక 85, 506 వాటాలు ఈజిప్టు వైస్రాయి కొన్నాడు. ఇంగ్లండు, ఆస్ట్రియా, రష్యా, అమెరికా తమకేమీ పట్టనట్లు దూరంగా ఉండిపోయాయి

## వెట్టిచాకిరి

ఈ విధంగా కంపెనీ ప్రారంభమైంది. కాలువ త్రవ్వకానికి 1859 ఏప్రిల్ 25 న పోర్టు సయద్ వద్ద ప్రారంభోత్సవం జరిగింది. మొదట్లో పని చురుగ్గా సాగలేదు. ఈజిప్షన్ కార్మికులచేత నిర్బంధంగా వెట్టి చాకిరి చేయించుకునే వారు. ఈ వెట్టి చాకిరీమీద ఇంగ్లండులోనూ, ఈజిప్టులోనూ కూడా ఆందోళన బయలుదేరినందువల్ల ఆపద్ధతి రద్దుచేశారు. వెట్టిచాకిరీ బదులు యాంత్రిక పరికరాలను, ఆధునికమైన ఇంజినీరింగ్ పద్ధతులను ప్రవేశపెట్టారు. దీనివల్ల పని చురుకుగా సాగడం సాధ్యమైంది. 1869 నాటికి పోర్టు సయద్ నుండి సూయజ్ వరకూ కాలువ మార్గం పూర్తయింది.

1869 నవంబరు 16 న కాలువలో ప్రయాణాలకు ప్రారంభోత్సవం జరిగింది. ఆ మర్నాడు వివిధదేశాలకు చెందిన 68 నౌకలు పోర్టు సయద్ నుంచి బయలుదేరాయి. టిమ్సా సరస్సుమీద ఉన్న ఇస్మాలియాను అవి ఆరోజునే చేరుకున్నాయి. 19 వ తేదీన దక్షిణంగా ఉన్న బిటర్ లేక్స్ చేరుకున్నాయి. 20 వ తేదీన సూయజ్ చేరాయి. అక్కడ నుంచీ, క్రమంగా నౌకా ప్రయాణాలు ప్రారంభమయ్యాయి. 1870 లో సుమారు 500 నౌకలు కాలువలో ప్రయాణం చేశాయి.

పోర్టు సయద్ నుంచి సూయజ్ దాకా కాలువ పొడవు నూరుమైళ్ళు. మొదట్లో కాలువలోతు 8 మీటరు ఉండేది. దీన్ని తరువాత 9 మీటర్లు చేశారు. వెడల్పు పోర్టు సయదుకు, బిట్టర్ లేక్స్‌కుమధ్య 65 మీటర్లు, బిటర్ లేక్స్‌కు సూయజ్‌కుమధ్య 75 మీటర్లు తీరాలు వంపులున్న చోట వెడల్పు 80మీటర్లు చేశారు. 1887 మార్చినుంచి రాత్రిపూట కూడా నౌకలు తిరగడానికి అనుమతించారు. 1886 లో నిబంధనలను బట్టి ఒక నౌక కాలువగుండా పోవడానికి 36 గంటలు పట్టేది కాని కాలువను అభివృద్ధి చేసిన తరవాత, 15 గంటలలోనే నౌకలు ప్రయాణం చేయడానికి వీలైంది. ఇప్పుడు కాలువ లోతు 26 అడుగులు ఉంది. కాలువ గర్భంలో వెడల్పు 78 అడుగులుంది. గత సంవత్సరం దానిగుండా 14, 600 నౌకలు ఒక్కొక్కటి సగటున 11 గంటల 18 నిమిషాలలో ప్రయాణం చేశాయి త్రవ్వకానికి మొదట్లో అయిన ఖర్చు 1, 60, 00, 000 పౌనులు. మొదటి సంవత్సరాలలో కంపెనీకి బాగా నష్టం వచ్చింది. రవాణా పెరిగిం కొద్దీ లాభం రాసాగింది. గత సంవత్సరం కంపెనీకి వచ్చిన లాభం సరిగా మొదట్లో ఖర్చుకు అయినంత—అంటే 1,60,00,000 పౌనులు. కాలువ నిర్వహణకు ఈజిప్టు ప్రభుత్వం 99 ఏళ్ళదాకా డిలెసెప్స్‌కు అనుమతి ఇచ్చింది. ఈ అనుమతి పరిమితి మరో 12 ఏళ్ళదాకా, అంటే 1968 నవంబరు 17 వ తేదీదాకా ఉంది. కాని ఈలోగా ఈజిప్టు ప్రభుత్వం న్యాయసమ్మతమైన విధానంలో కంపెనీని జాతీయం చేసి కాలువపై తన హక్కును ప్రకటించుకుంది.

కాలువ నిర్వహణకు, మరమ్మతులకు, ఏడాదికి 90 లక్షల పౌనులు ఖర్చవుతున్నది. 1949 లో ఏడాదికి మరో 30 లక్షలపౌనుల వ్యయంతో అభివృద్ధిపనులు తలపెట్టారు

కాలువలో జరిగే ముఖ్యమైన రవాణా పెట్రోలు. గతసంవత్సరం పాశ్చాత్యదేశాలకు ఎగుమతిఅయిన 11 కోట్లటన్నుల పెట్రోలులో 6½ కోట్లటన్నుల పెట్రోలు సూయజ్ గుండానే రవాణా అయింది. కాలువలో ప్రయాణించే ప్రతి 5 నౌకలలో మూడునౌకలు పెట్రోలు తీసుకుపోయే పెద్దరకం టాంకర్లే. ఈటాంకర్లలో చాలమటుకు 45 వేల టన్నుల బరువుగల పెద్దనౌకలు. వీటిలో స్విమింగ్ పూల్స్ దగ్గిర్నించి సినిమాలదాకా అన్నిరకాల ఆధునిక సౌకర్యాలు ఉన్నాయి

మరొక పదేళ్ళలో కాలువలో రవాణా పరిస్థితి ఎలాగూ విషమించేదేనని అభిజ్ఞులు అభిప్రాయపడుతున్నారు పెట్రోలు రవాణా పదేళ్ళలో ఇప్పటికి రెట్టింపు (సుమారు 20 కోట్ల టన్నులు) అవుతుందనీ, అంతర్జాతీయ వ్యాపారం క్రమంగా విస్తరించుతుందనీ, ఈరవాణా అభివృద్ధిని సూయజ్ కాలువ భరాయించలేదనీ వీరు చెబుతున్నారు. ఉన్న కాలువను విశాలమూ, లోతూ చేయించడంకంటె దానిపక్కనే మరో కాలువను త్రవ్వించడం మంచిదని కొందరూ, ఇప్పటికున్న టాంకరకంటె పెద్దపెద్దవాటిని నిర్మించి, వాటిని పూర్తిగా నింపి గుడ్ హోప్ అగ్రం చుట్టి రప్పించడం తేలికా, చవకా అని మరికొందరూ ఇలా రకరకాలుగా ఇప్పటిదాకా ఆలోచనలు చేస్తూవచ్చారు ఈపరిస్థితిలో సూయజ్ కాలువ నిర్వహణాన్ని ఈజిప్టు జాతీయం చేయడం జరిగింది. ★

# ★ సూయజ్ తగాదా ★

(27-వ పేజీ తరువాయి)

మంత్రి ఈడెన్ ఒక ప్రకటన చేస్తూ భద్రతా సంఘాధ్యక్షుడికి సూయజ్ సమస్య విషయం తెలియజేశామనీ అయితే ఐక్యరాజ్య సమితి కీసమస్య నివేదించే సంకల్పమేమీ లేదనీ అన్నారు.

ఆంథొనీ ఈడెన్ ఆ ప్రకటనలోనే సూయజ్ కాలువ వాడకం దారుల సంఘం ఒకటి ఏర్పాటు చెయ్యబోతున్నామనీ, సూయజ్ కాలువ నిర్వహణలో తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ ఆ సంఘం తీసుకోగలదనీ ఈజిప్టు ప్రభుత్వానికి ఈవిషయంలో న్యాయ్యమైన ప్రతిఫలం ముట్టచెప్పగలమనీ అన్నారు. అమెరికా విదేశాంగమంత్రి డల్లెస్ సెప్టెంబరు 18న ఒక ప్రకటన చేస్తూ ఆయుధబలంతో సూయజ్ సమస్య పరిష్కరించే ఉద్దేశ్యమేమీ లేదనీ ఈజిప్టు ప్రభుత్వం వాడకం దారుల సంఘ వ్యవహారాల కంగీకరించని పక్షంలో, అమెరికా నౌకలు గుడ్ హోప్ అగ్రంమీదుగా ఆఫ్రికా చుట్టిరాగలవనీ అన్నారు.

ఈ ప్రకటనతో బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వాలధోరణి కొంతవరకు చల్లబడింది.

వాడకం దారుల పథకం అమలు చెయ్యడం జరిగితే, అది యుద్ధానికి దారి తీయగలదని అమెరికాలో ఈజిప్టు రాయబారి ఒక హెచ్చరిక చేశారు.

అయితే, పాశ్చాత్య రాజ్యాలు వాడకం దారుల సమావేశం వ్యవహారం విరమించలేదు. ఈ సమావేశం సెప్టెంబరు 19 తేదీన లండన్‌లో ప్రారంభమైంది. ఈ సమావేశానికి రమ్మని భారత ప్రభుత్వానికిగాని రష్యాప్రభుత్వానికిగాని 'ఆహ్వానాలు' రాలేదు. అయినా భారతప్రభుత్వ ప్రతినిధి వి. కె. కృష్ణమీనన్ సామరస్యం కోసం శాయశక్తులా ప్రయత్నిస్తూనే వున్నారు.

పాశ్చాత్య రాజ్యాలెంతగా హంగామా చేసినా భారత ప్రతిపాదన ప్రాతిపదిక మీదనే సామరస్య సూచనలు కనిపిస్తున్నాయి. ★

# అబ్బాయి ఆడిన నాటకం


## గాడేపల్లి సీతారామయ్య


అమ్మ, కనకమ్మ వడ్డిస్తూవుంటే గోపాలం ఏం తింటున్నాడో తెలియకుండా ఆదరా బాదరాగా భోంచేస్తున్నాడు. సీనియరుగారి ఇంటిదగ్గరనుండి వచ్చేటప్పటికి పదిన్నర అయింది. నిద్ర మంచంమీద వుండగానే ఏదో కొంప మునిగినట్లు సీనియరుగారు కబురుచేస్తే, ఏంపనో అని తను తొందరగా ముఖం కడుక్కుని. ఆలస్యం అవుతుందని అయ్యరుగారిని కాఫీకి దర్శించి, ఆఫీసరుగారి ఇంటికి వెళ్ళేడాయన. ఎంతైనా బ్రాహ్మణుడు కాబట్టి స్నానం లేకుండా భోంచేయలేక, వచ్చి స్నానం చేశాడు. అప్పుడే పావుతక్కువ పదకొండు గంటలు కావస్తోంది. ఆఫీసరుగారు పన్నెండు గంటల రైలులో క్యాంపు వెడతానన్నారు. ఆయనకి ఫైల్సుసర్ది పదకొండూ నలభైఅయిదుకన్నా రెడీ చేయాలి. ఆఫీసు ఇంటికి ఒక మైలుపైగా వుంటుంది. ఎలాలేదన్నా నడచి వెళ్ళడానికి పావుగంట పడుతుంది. తను వున్న బెజవాడ బస్తీలో రోజూ రిక్షాలు ఎక్కితే, తన నెలజీతం ఇరవై రోజులు రాదు, "గాజుల బేరం భోజనంతో సరి" అన్నట్లు. పదకొండూ ఇరవైకన్నా ఆఫీసులో లేకపోతే సీనియరుగారికి రైలు టైముకి ఫైల్సు అందచేయలేడు. ప్రొద్దున్న దగ్గరనుండీ ఆయనదగ్గరే వున్నాడు కదా 'క్యాంపు' అని ఏ తొమ్మిదింటికన్నా చెప్పివుంటే వెంటనే ఇంటికివచ్చి, వెళ్ళివుండేవాడు. పది గంటలు అయ్యాక "ఆఫీసు టైమవుతోంది ఇంకా భోంచేసి వెళ్ళాలి" అని తను అంటే ఆయన "అన్నట్లు మరిచిపోయాను గోపాలం" అని ఎంతో ఆప్యాయంగా ప్రారంభించి "పన్నెండింటికి రైలులో క్యాంపు వెళ్ళాలి. ఫలానా, ఫలానా ఫైల్సు సర్ది బంట్రోతుచేత స్టేషనుకి పంపు" అన్నాడు. గోపాలం సీనియరుగారి సెలవు తీసుకునేముందు ఆయన మరొకటి కూడా హెచ్చరించారు, "గోపాలం నేను రైలుకు వెడుతూ ఆఫీసుకు రావడానికి టైముండదు. నువ్వు నే చెప్పిన అన్ని ఫైల్సు సరిగ్గాసర్ది పంపించు స్టేషనుకి". అని.

ఆఫీసరుగారి హెచ్చరిక జ్ఞాపకం వచ్చేటప్పటికి గోపాలానికి ఎక్కడలేని కోపం వచ్చింది. "తనకి, భోజనం చేసి రైలుకి వెళ్ళేటప్పుడు, దగ్గరగావున్న ఆఫీసుకు రావడానికి టైముండదట; నేనుమాత్రం భోజనం, తను చెప్పినపనులూ అప్పుడే వచ్చి ఎలా చేస్తాననుకుంటాడు, మూర్ఖుడు. వారి సుఖమే కాని గుమస్తాల కష్టాలు అక్కరలేదు ఆఫీసర్లకి" అనుకుంటూ కోపంలో ముద్దలు దిగమ్రింగుతున్నాడు.

ఇంతట్లో కనకమ్మ ప్రారంభించింది "నెయ్యి నేలపాలయింది కదా అని డబ్బు యియ్యకపోతే వూరుకుంటుందా గవరమ్మ..." అమ్మ మాటలువిని గోపాలం ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా తలెత్తి చూశాడు. "ఏమీ లేదురా నాయినా, ప్రొద్దున్న నేను కాని, అరవీసెడు నెయ్యి బుడ్డీలో పోద్దామని క్రిందపెడితే నీ పెళ్ళాం తన్నేసింది. నెయ్యిపోతేమాత్రం గవరమ్మకు రెండున్నర రూపాయలూ ఇయ్యొద్దూ? మధ్యాహ్నం రెండుగంటలికి డబ్బుకి వస్తానంది. నువ్వు ఆసమయానికి వుండవుకదా అని." అని టూకీగా పూర్తిచేసింది.

ప్రక్క గదిలోకి అప్పుడే స్నానంచేసి వచ్చిందేమో గోపాలంభార్య, లక్ష్మి వింది ఆమాటలు. లక్ష్మి మంచిదేకాని మాట పడేదికాదు. మొన్న మొన్నటిదాకా కనకమ్మ ఎన్నిఅన్నా ఎలాగో తను పడుతూ వుండేది. అంచేత ఏగొడవా పైకివచ్చేది కాదు. కాపరానికివచ్చి తను అప్పుడే రెండు సంవత్సరాలు కావస్తోంది. ఈమధ్య "తప్పులేందే అత్తగారిమాట ఎందుకు పడాలి, తనభర్త సంపాదిస్తూవుంటే" అనే ఆత్మాభిమానం కలిగింది. అప్పట్లో అత్తగారు తనమీద నేరాలు అప్పుడప్పుడు చెప్పినా, తనభర్త తిన్న సంజాయిషీలు అడక్కపోవడంచూసి, సంతోషించి వూరుకుంటూ వుండేది. "అమ్మ కాబట్టి చెప్పే వద్దనలేక వింటున్నారు." అనుకుని తృప్తిపడేది. కాని యీ మధ్య గోపాలం, అమ్మమాటలు విని, "ఇలా అయితే ఎలాగ సంసారం చెయ్యడం? పగలంతా కష్టపడి నేను తెస్తూవుంటే నీకు తెలియడం లేదు. నానాగడ్డీ మేస్తేకాని యీ చాలీచాలనిజీతం రావటం లేదు; నీకు ఏమన్నా తెలుస్తోందా?" అంటున్నాడు. నిన్న అత్తయ్య తను పావలాకు కొన్న రిబ్బనుకి చేసిన హంగామా జ్ఞాపకం వచ్చింది. అయినా తను తన్నెయ్యాలని నెయ్యిని తన్నేసినట్లు చెప్పుతూవున్న అత్తగారి మాటలు వినేటప్పటికి కోపం ఆపుకోలేకపోయింది లక్ష్మి.

"అదేమిటండీ అత్తగారూ, నేను నేటి గిన్నెని తన్నెయ్యాలని తన్నేసినట్లు చెబతారు మీ అబ్బాయితోటి. అదీకాకుండా మట్టినేలకాబట్టి కొంత నెయ్యి అన్నా దక్కలేదు కాని లేకపోతే..."

"తన్నెయ్యాలని తన్నెయ్యకపోతే చూడక తన్నేశావు పాపం. ఏరాయి అయితేనేం పళ్ళూడడానికి నెయ్యిపోయిందా లేదా? పట్టపగలు నేలమీద నడిచేటప్పుడు నక్షత్రాలు లెక్కపెడతారు కాబోసు యీకాలం ఆడవాళ్ళు. అవున్లే! కట్టుకున్న చీర సవరించుకోవడం, రిబ్బను ముళ్ళుమార్చి ముళ్ళేసుకోవడం సరిపోతుంది, నేలమీద వున్నవి కనబడతాయా? చూసి తన్నేసినా, చూడక తన్నేసినా రెండున్నర రూపాయలూ వదెయ్యక తప్పదు కదా గవరమ్మ. ప్రొద్దున్న పోస్తానే చెప్పింది "రెండు గంటలకి వస్తాను, డబ్బు పూర్తిగా యిచ్చెయ్యాలి దూళ్ళకి చిట్టుపరక గుప్పెడన్నా లేదు" అని. గవరమ్మ మధ్యాహ్నం వస్తానంది కదా, డబ్బు ఇయ్యాలని అబ్బాయితో చెబుతున్నాను. ఇంతకీ వాడు ఆ సమయానికి వుండడు కాబట్టి చెప్పేను. నిజమేలే! వున్నది వున్నట్లు అంటే ఎవరికన్నా వుక్రోషమే" అని గుక్క త్రిప్పకుండా ఏకరువు పెట్టింది.

భర్త అత్తగారిని వారించక పోవడం చూసి లక్ష్మికి, ఎక్కడలేని కోపం వచ్చింది "వేమన పద్యంలోలా ఎవరు చేసినవి వాళ్ళకి కనబడవు. మొన్న యింకో నాలుగు మెట్లెక్కి డాబామీద పెట్టడానికి బద్ధకించి, ప్రక్కనున్న వంటయింటి రేకులమీద పెట్టినందు వల్ల, పదిరూపాయలజాడీ, ఇరవై రూపాయల సంవత్సరం పొడుగునా నిలవలసిన వూరగాయ నేలపాలయ్యాయి. ఊరగాయ ఎందుకూ పనికిరాకుండా దాని

## ★ అబ్బాయి ఆడిన నాటకం ★

నిండా ఇసుక. ఇంక జాడీయూ, కొన్ని ముంతల ముక్కలయి, ఆవేళ మీకూ, నాకూ పని చెప్పింది. మరచిపోయారు కాబోసు." అని ఎత్తిపొడిచింది.

"దానిమీద కాకి వాలటం మూలాన్ని పడిపోయింది కాని, లేకపోతే పడిపోయేదా జాడీ ఎన్నిసార్లు అలా పెట్టలేదు. ఇప్పుడంటే కర్మం కాలి పడిపోయింది కాని, అంతకుముందు ఎప్పుడన్నా పడిందా?" అని సర్దుకోబోయింది కనకమ్మ.

"పాపం! అప్పుడు జాడీ దానికర్మం కాలి పడిపోయింది. ఇప్పుడు మాత్రం నాకర్మం కాలి, గిన్నెకి కాలుతగిలి ఒలికిపోయింది నెయ్యి. ఏం, అంతేనాఅండి" అని అత్తగారివైపు చురచురా చూసింది లక్ష్మి.

"ఆ! బాగుంగి వరుస" అన్నాడు తలెత్తి తలవని తలంపుగా గోపాలం

ఇంతవరకూ శ్రుతి మించుతూవున్నా, భార్యని మందలించాలని కాని, అమ్మని వారించాలని కాని గోపాలానికి తట్టలేదు. వాళ్ళ ధోరణి వింటున్నాడే కాని, ఆఫీసుకు త్వరగా వెళ్ళాలనే తొందరలో ఎక్కువ పట్టించుకోలేదు ఇప్పుడన్నా భార్యని వారించక పోయేవాడే, తనకి అమ్మ మజ్జిగ మొదటిసారి అడిగినప్పుడే ఖండించివుంటే. అతను అన్న రెండుముక్కలూ మాత్రం మంచి తూకంగా వచ్చాయి లక్ష్మి అక్కడనుంచి వెళ్ళిపోయింది. కనకమ్మ మళ్ళీ నోగు విప్పలేదు; కావలసిన మజ్జిగపోసి తన పనిమీద తప్పుకు వెళ్ళిపోయింది.

గోపాలం భోజనంచేసి బట్టలు వేసుకుంటూ "అమ్మా" అని పిలచాడు. కనకమ్మ మామూలు ప్రకారం గ్లాసుతో మంచినీళ్ళు పట్టుకువచ్చింది. పర్సులోనుంచి అయిదు రూపాయలు తీసి, కనకమ్మకిచ్చి "ఇంకో అరవీసెడు నెయ్యి తెమ్మను గవరమ్మని" అన్నాడు. మంచినీళ్ళు తాగి చేతిగడియారం చూశాడు. పదకొండూ పది అయింది. వెంటనే బయల్దేరి ఆఫీసుకు వెళ్ళేడు.

గోపాలం కష్టంమీద సీనియరు గారికి అనుకొన్న ప్రకారం రైలు టైముకి కావలసిన ఫైల్సు సర్ది, కట్టకట్టి పంపించాడు. ఒక అర్జీకి నకలు తీయవలసి వుండి తెల్లకాగితం, కలం పట్టుకున్నాడు వ్రాద్దామని ప్రయత్నించాడు. వ్రాత జరుగలేదు. కలం అరలో పెట్టి ఆలోచిస్తున్నాడు. అతనికి ఎంతసేపూ ఆ వేళ భోజనం దగ్గర జరిగిన సంఘటనే జ్ఞాపకం వస్తోంది. ఎలాగ ఇంటి దగ్గర పరిస్థితుల్ని ఎదుర్కోవాలో అర్థం కావడం లేదు. ఎన్ని పద్ధతులు ఆలోచించినా, ఏదీ చివరికి సరియైనదిగా కనబడటం లేదు. రెండుగంటలూ ఆ ప్రాంతంలో తోడిగుమస్తా రాఘవరావు వచ్చి, "నకలు తీసేవా?" అని ప్రశ్నించాడు. "లేదు" అని గోపాలం "సీనియరు గారు క్యాంపునుండి వచ్చేటప్పటికి నకలు తీయలేకపోనులే" అని విరక్త్యంగా సమాధానం ఇచ్చేడు. సీనియరుగారు వూళ్ళో లేకపోతే పని ఎగనెయ్యటం గుమస్తాలకి అలవాటే కాబట్టి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు రాఘవరావు.

గోపాలానికి మాత్రం దృష్టి యింకా ఇంటిమీదే వుంది. పొద్దున్న అన్నం దగ్గర తను అమ్మని ప్రారంభంలోనే వారించక పోవ

డానికీ, లక్ష్మిని మందలించక పోవడానికీ ఏమిటి కారణం అని ప్రశ్నించుకున్నాడు. వెంటనే చెప్పుకున్న సమాధానం: "అప్పట్లో అలా వూరుకోవడం మంచిదిగా తోచడం" పోనీ తరువాత మాత్రం ఏమి చేశాడు గనుక "ఆ బాగుంది వరుస" అన్నాడు. దానితో తనమీద వున్న గౌరవమే అనండి, భయమే అనండి వాళ్ళు అంతటితోటి ఆపేశారు వాదన. లేకపోతే ఏమి చేయగలిగేవాడు తను? పూర్వం తను అంటే ఎంతగౌరవం లక్ష్మికి, తనముందు ఎప్పుడైనా తన తల్లిని ఎదురించిందా? కనకమ్మ మాత్రం తీసిపోయేదా లక్ష్మి విషయంలో. తను అనేకసార్లు విన్నాడు "అమ్మాయీ, లక్ష్మీ" అని పిలవడం. అమ్మ అననే అంది తనతో ఒకసారి, తనకి కూతురు లేని కొరత లక్ష్మి తీర్చిందని. మరి యీ మధ్య యీ మార్పేమిటి? అదే అర్థం కావడం లేదు గోపాలానికి.

సుమారు రెండు నెలల క్రితం, సంవత్సరానికి ముందు రోజుని అత్తా కోడళ్లూ తగువు పడ్డారు. వాళ్ళు తగువు పడడం తను ప్రక్కగదిలో పేపరు చదువుకుంటూ తొలిసారిగా విన్నాడు. అది వీధులోకి వచ్చిన మాటల వాడి దగ్గర పండుక్కి చీరకొనడంలో వచ్చింది. లక్ష్మి పదిహేను రూపాయల చీర కొనుక్కుంటానంది. అమ్మ రోజూ తెపడానికి పదిరూపాయల చీర బాగుంటుంది కొనమంది. ఎంత చెప్పినా అత్తగారి మాట వినలేదు లక్ష్మి. తన్ని లక్ష్మి పదిహేను రూపాయలు అడిగితే "ఎందుకు?" అని అన్నా తను అడక్కుండా యిచ్చేశాడు. చీర కొన్న తరువాత అమ్మ "చీర మంచిదే. రంగుబాగానే వుందిలే" అని ఒప్పుకోవడం విన్నాడు. అంచేత ఆ వేళ వాళ్ల వాదన తనకి సంతోషాన్నే కలిగించింది.

అది మొదలు అత్తా కోడళ్లు వాదించుకోవడం గోపాలం తరుచు వింటూవచ్చాడు. అప్పుడప్పుడు తనకి వాళ్ళ వాదన వింటూ వుంటే బాధ కూడా కలిగేది. ఆవాదనలు వినలేక లక్ష్మిని ఏదో వంకని పిలుస్తూ వుండేవాడు. కాని తను లక్ష్మిని కాని, తన తల్లిని కాని 'ఎందుకు తగువు' అని ఎప్పుడూ ప్రశ్నించలేదు. అదే పొరపాటయిందని తరువాత వచ్చినప్పుడు అల్లా అనుకుంటాడు.

పూర్వంలా కాదు, ఇప్పుడు పరిస్థితులు విషమించాయి. నెల క్రితం వాళ్ళు, తన ముందు ఎప్పుడూ వాదించుకోలేదు. ఈ మధ్య వాళ్లు తన్ని లక్ష్యం చేయకుండా తన సముఖంలోనే తగవులు పడుతున్నారు. అంతకు ముందు వాదనే కాని, యీ మధ్య వారం రోజుల నుంచి, ఒకళ్లనొకళ్ళు దెప్పుకోవడం, దేపు కొనడం జరుగుతోంది. తను మాత్రం తటస్థంగా వింటున్నాడు. వీలైనంత వరకూ సమయం చూచి వినోదంగా వారిస్తున్నాడు. అమ్మమాత్రం తనతో లక్ష్మిమీద రోజూ ఏవో నేరాలు చెప్పడం మొదలు పెట్టింది. అన్నీ చెప్పి "ఇంక ఏమున్నా వుందా, సంసారం గుండమై పోదూ యిలా అయితే" అంటుంది, కేవలం సంసారం మీద మమకారం కొద్దీ అంటూవున్నట్లు. పదిసార్లకి ఒకసారియైనా తను లక్ష్మిని మందలించకపోతే, తను పెళ్లాము మాటలు వింటున్నాడు అంటుందేమోనని లక్ష్మిని మందలిస్తున్నాడు. అది కాకుండా సీనియరుగారు వూళ్లో వుంటే యీ పనీ అపనీ చెప్పి, అనవసరంగా చికాకు పడి గుమస్తాలని విసుగెత్తిస్తాడు ఆ చికాకు మీద తను ఇంటికి వచ్చేటప్పటికి ఏదో అమ్మ చెప్పడం, అమ్మని వద్దనలేక లక్ష్మిని యీ మధ్య గట్టిగానే మందలిస్తున్నాడు. లక్ష్మిమాత్రం తను ఏమన్నా వూరుకుంటోంది. అంతేగాని వాళ్ళు తగవులు పడుతూవుంటే తను జోక్యం కలుగ చేసుకునేవాడు కాదు. వీలైతే తగ్గించడానికి ప్రయత్నించేవాడు, లేకపోతే విననట్లు వూరుకునేవాడు, అంతే. తను ఎందుకు వాళ్ళ తగవుల్లో జోక్యం కలుగ చేసుకోవడం లేదు? మళ్ళీ ఆ ప్రశ్నే! ఇలా ఆలోచిస్తూ వుంటే టపా వచ్చిందన్నాడు బంట్రోతు తలెత్తి, వుత్తరాలు పుచ్చుకుని డి. ఇ. ఓ గారి ఆఫీసు నుంచి వచ్చిన వుత్తరం తీసి విప్పేడు. దాని మీద "రిమైండరు" అని వుండగానే హెడ్డు గుమస్తా గారి దగ్గరికి తీసుకు వెళ్లేడు.

ఆ సాయంకాలం, గోపాలం ఇంటి దగ్గర వీధి గదిలో, పడక కుర్చీలో పడుకుని పేపరు చూస్తున్నాడు. కొంత సేపు పోయాక కనకమ్మ మాటలు వినపడ్డాయి అతనికి. మాటల వరుస చూసి, వినడం యిష్టం లేక గట్టిగా చదవడం మొదలు పెట్టేడు. తనకి వినపడాలని గట్టిగా అంటూవుంటే, కొంతసేపటికి వినక తప్పింది కాదు గోపాలానికి.

"రైలులో పాడుతూ వుంటారు చూడు బ్రహ్మంగారి పదాలు- 'పెళ్లాము అరటి పండగును, అమ్మ ఏదో అగును' అంటూ అలాగ కన్నకొడుకే అయితే ఏంచేస్తాను? వాడు నీ చేతులో కీలుబొమ్మ కాబట్టి నువ్వాడింది ఆట, పాడింది పాట అవుతోంది. అరవిసెడు నెయ్యి నేలపాలు చేసినా నిన్నేమన్నా అన్నాడా? పైగా యింకో అరవీసెడు పుచ్చుకోమని అయిదు రూపాయలు ఇచ్చాడు. ఇచ్చింటే యిచ్చేడు గాని నెయ్యి లేదుట గవరమ్మ దగ్గర. ఎలాగ వాడికి నెయ్యి లేకుండా వడ్డించడమా రాత్రి, అని నేను దేవుళ్ళాడుతూ వుంటే..." అంటోంది కనకమ్మ.

ఆ మాటలు వినేటప్పటికి గోపాలానికి గుండెలో పెద్దరాయి పడ్డట్టు అయింది. వెంటనే పడక కుర్చీలో లేచి కూర్చున్నాడు. వెళ్ళి అమ్మని "ఏమిటి నీ మాటలు, మంచీ చెడ్డా లేకపోతే సరీ, ఎప్పుడూ ఇంట్లో ఏదో ఒక గొడవేనా?" అని వారిద్దామనుకున్నాడు. మళ్లీ "పోనీ" అని వూరుకున్నాడు. ఆ సమయంలో తను అలా అంటే లక్ష్మి, తను తన వైపు మాటలాడుతూవున్నట్లు భావించి, తనతల్లిని లోకువ చేస్తుందని అభిప్రాయం. అదే తను, లక్ష్మి అమ్మ నంటూ వున్నా తరుచు మందలించక పోవడానికి కారణం. స్వతహాగా అమ్మ, కనకమ్మ ఏదో అంటూనే వుంటుంది లక్ష్మిని. తను లక్ష్మిని మందలిస్తే ఇంక ఏమైనా వుందా మరీ రెచ్చిపోతుంది. ఇంచుమించు వాళ్ల తగవుల్లో జోక్యం కలుగ చేసుకోకుండా, తటస్థంగా వుండడం తన "పాలసీ" అయింది తను మధ్యాహ్నం ఆఫీసులో ఎంత ఆలోచించినా "తను ఎందుకు ప్రొద్దున్న అన్నం దగ్గర తల్లిని 'తప్పని' వారించకుండానూ, లక్ష్మిని మందలించకుండాను వూరుకున్నాడు?" అనే ప్రశ్నకి అప్పుడు తోచని సమాధానం ఇప్పుడు ఇట్టే తట్టింది. మళ్ళీ "పోలసీ" అన్న మాట జ్ఞాపకం రాగానే అంత గొడవలోనూ ఒక చిన్న నవ్వు నవ్వేడు గోపాలం.

"అదేమిటండీ, పెద్దవాళ్లయి అలా అంటారు, నెయ్యిలేకపోతే సంసారంలో గడవదా ఒకపూట అనే ఉద్దేశ్యంతో అన్నాను కాని. మీమాటలు విని, ఆయన నన్ను తిట్టి, కొట్టాలని కాబోసు మీ ఆలోచన." అంది వూరుకోకుండా వెంటనే లక్ష్మి.

"నెయ్యి లేందే ఎలాగ వడ్డించను అనుకుంటూ నేనంటే ఇంత వ్యాఖ్యానం తీసేవుకదా, తిట్టే కొట్టే మొగుడయితే అలా మాటలాడగలవా? నెయ్యి లేంది నేను వడ్డించలేను, అరవై ఏళ్ళు దాటాయి కాని, యీ క్షణం దాకా నేను నెయ్యి లేకుండా ఎవరికీ గడ్డు అన్నం పెట్టలేదు నువ్వు వచ్చావు కాబట్టే ఇప్పుడు అన్నీ నేర్చుకోవాలిలా వుంది. కావలసే నువ్వు వడ్డించుకో లేకపోతే మానుకో నీ మొగుడికి. ప్రతీ దానికి 'నువ్వా' అంటే 'నువ్వు' అంటావు, పెద్దా చిన్నా తారతమ్యం లేకుండా"

"నువ్వు అని ముందు మీరంటే కదా "నువ్వు" అన్నా నన్నారు మీరు. "నువ్వు" అనలేదు. అనను లెండి. 'మీరు' అంటాను. వడ్డించడమే ఎందుకూ, మీకు వండడం యిష్టం లేకపోయినా, రోజూ నేనే వండిపెట్టుకుంటాను ఆయనకి" అని నిర్లక్ష్యంగా అనేసింది లక్ష్మి.

ఇంక వినడం ఇష్టం లేక పోయింది గోపాలానికి. పేపరు మడచి బల్లమీద పడేసి, మళ్లీ అమ్మ మాటలు వినవలసి వస్తుందేమోనని, కుర్చీకి తగిలించివున్న చొక్కా వేసుకుంటూ వీధిలోకి వచ్చాడు. "లాభంలేదు. పరిస్థితులు పూర్తిగా విషమించాయి" అని పెదవి విరచి తిన్నగా తన స్నేహితుడు, శంకరం ఇంటికి వెళ్లేడు.

# ★ అబ్బాయి ఆడిన నాటకం ★

గోపాలం బెజవాడ వచ్చిన కొత్తరోజులలో అతనికీ, శంకరానికి గ్రంథాలయంలో, చదరంగం దగ్గర పరిచయమైంది. అది మూడు సంవత్సరాల క్రితం మాట. శంకరం స్వగ్రామం ఆవూరే. అతను వచ్చిన సంవత్సరమే శంకరం బి. ఎల్. పరీక్షలో వుత్తీర్ణుడయ్యాడు. ఇప్పుడు అతను అక్కడే ప్రాక్టీసు చేస్తున్నాడు. ధనం వున్నా గర్వం లేదు. స్నేహితుడు అంటే ప్రాణం పెడతాడు. అందచేత రెండు మూడు మాసాలలో గోపాలం, శంకరం ప్రాణస్నేహితులు కాగలిగారు. గోపాలం బెజవాడ వచ్చిన సంవత్సరం కనకమ్మ కొడుకువాళ్ళ ఊరు, ఆమె తమ్ముడి దగ్గరకు వెళ్ళి, రెండుమాసాలపాటు వుంది. అప్పటికి యింకా లక్ష్మి కాపరానికి రాలేదు. శంకరం పట్టువల్ల ఆరెండు నెలలూ గోపాలం వాళ్ళ ఇంట్లోనే భోంచేశాడు.

గోపాలం వెళ్ళేటప్పటికి శంకరం ఆఫీసు గదిలో కూర్చుని, పేపరు చదువుకుంటున్నాడు. గోపాలాన్ని చూసి శంకరం పేపరు దించి "ఈమధ్య కనపడలేదేం?" అని ప్రశ్నించాడు.

"నిన్నేగా కనబడకపోతే. పనిమీద వచ్చాను; ఒక విషయంలో నీ సలహా కావలసి వచ్చింది. పత్రిక మూసై" అన్నాడు ఆందోళనగా ఒక కుర్చీలో కూలబడుతూ.

"ఆఫీసులో వున్నాను. సలహాకి ఫీజు యివ్వాలి తెలుసా" అన్నాడు పేపరు మడుస్తూ శంకరం.

"అలాగేలే, సరదాలకి సమయం కాదిది" అని రెండు నెలల క్రితంనుంచి, యీరోజు దాకా ఇంటిదగ్గర జరిగిన గొడవలన్నీ ఏకరువు పెట్టేడు గోపాలం. "ప్రతీ ఇంట్లో వుంటాయి గొడవలు, చెప్పేదేమిటి, వాటంతటికి అవే సర్దుకుంటాయని ఓ అరగంట క్రితం దాకా ఓపిక పట్టేను. పరిస్థితులు విషమించేటాయి నా చెయ్యి దాటిపోయినట్టు కూడా తోస్తూంది. స్నేహితుడివి కాబట్టి అడుగుతున్నాను; సలహా ఇయ్యగలిగితే ఇయ్యి... లేకపోతే ఏదో చేస్తాను" అని ఆలోచిస్తూ వూరుకున్నాడు.

గోపాలం, శంకరం ఆవిషయంమీద సుమారు ఒక గంట చర్చించారు. ఆఖరికి గోపాలం "9 గం. అయింది. భోజనానికి వెళ్ళాలి ఇంక." అని లేచాడు, తనచేతి గడియారం చూస్తూ.

"పోనీ ఇక్కడ భోంచేద్దువుగాని లే" అన్నాడు శంకరం.

"అలా కాదు. ఈ వేళ ఇంటికి తప్పకుండా వెళ్ళాలి భోజనానికి" అన్నాడు గోపాలం. ఆ వేళ సాయంకాలం గోపాలం ఇంటి దగ్గర, జరిగిన గొడవ విన్నాడు కాబట్టి "ఏం చేశావ్?" అని ప్రశ్నించలేదు శంకరం

వీధిలోకి వచ్చాక శంకరం గోపాలంతో "నేను చెప్పినట్లు చెయ్యి; అదే మంచిదిగా తోస్తోంది. ఆ విషయంలో నువ్వు ఏ మాత్రం సందేహించవద్దు" అన్నాడు ముఖంలోకి చూస్తూ.

"తప్పకపోతే అలాగే చేస్తాను."

"నా ఫీజుమాట"

"కేసు నెగ్గే" అని గోపాలం సమాధానం ఇచ్చి, ఇంటికి బయల్దేరేడు

ఇంటికి వచ్చిన తరువాత లక్ష్మి వడ్డిస్తే, గోపాలం భోంచేశాడు నెయ్యి లేకుండా. "అమ్మ ఎందుకు లేచిరాలేదు వడ్డించడానికి" అని అతను అడగలేదు, లక్ష్మి చెప్పలేదు. అతనికి మనస్సు తేలిగ్గా వున్నట్లు అనిపించింది. బహుశః ఒక నిర్ణయానికి వచ్చినందువల్ల అయివుంటుంది. భోంచేసి, కొంచం సేపు దినపత్రిక చదివి పడుకున్నాడు.

మరునాడు ప్రొద్దున్న లక్ష్మి కాఫీ తెచ్చి, బల్లమీద పెడుతూవుంటే "నువ్వు ఇప్పుడు తొమ్మిదిగంటల ప్యాసింజరులో నీ పుట్టింటికి వెళ్ళాలి. సామాను త్వరగా సర్దుకో" అన్నాడు గోపాలం.

"మావాళ్లు నన్ను రమ్మనలేదు. ఎందుకు వెళ్ళడం?" అంటూ తెల్లబోయి చూసింది.

"నా సుఖంకోసం — నీ బాగుకోసం. తప్పదు వెళ్ళితీరాలి" అన్నాడు కఠినంగా.

మళ్ళీ మాటాడలేదు లక్ష్మి. నిన్న ఇంట్లో గొడవకి గోపాలానికి కోపం వచ్చిందని తెలుసుకుంది. "మాటకి మాట తెగులూ, నీటకి నాచు తెగులూ లా అయ్యో! ఆయన వింటూవుండగా ఎందుకు అత్తగారి ప్రతీ మాటకీ సమాధానం చెప్పేనా, వూరుకున్నా సరిపోవును, ఇప్పుడు ఆయనికి కోపం వచ్చింది" అని చాలా బాధపడింది. ఏమన్నా ప్రయోజనం వుండదు అనుకుంది. ఈ ఆలోచన నిన్న లేనందుకు తన్ను తాను నిందించుకుంది. భర్తకి కోపం వస్తుందని సామాను సర్దుకుందే కాని మనస్సా పుట్టింటికి వెళ్ళాలని లేదు లక్ష్మికి. అయినా తప్పింది కాదు.

ఎనిమిదిన్నరకల్లా గోపాలం రిక్షా తీసుకు వచ్చేడు. రిక్షా అతనిని సామాను లోపల పెట్టమని అతను కనకమ్మ దగ్గరికి వెళ్ళాడు; "అమ్మా! లక్ష్మిని పుట్టింటికి పంపించేస్తున్నాను. నువ్వు తీసుకురమ్మన్నంతదాకా మళ్ళీ తీసుకురాను," అనేసి వచ్చేశాడు. కనకమ్మ విస్తుపోయింది. "నే నేం పంపించమన్నాను గనుకనా, మళ్ళీ తీసుకు రమ్మనటానికి" అందామనుకుంది; మాట రాలేదు. ఇంతట్లో లక్ష్మి వచ్చి "వెడుతున్నానండీ అత్తయ్యగారూ..." అని కళ్లనీళ్లు పెట్టుకుంటూ యింకా ఏదో అనబోయింది అంతట్లో "లక్ష్మీ!" అన్న గోపాలం కేకవిని, కళ్లు తుడుచుకుంటూ వీధిలోకి వెళ్ళింది.

తరువాత కనకమ్మ కొంచంసేపు అలాగే నుంచుండిపోయింది ఏమిచేయాలో తోచక. "పంపిస్తే పంపించాడు, నాకేం మన్నా. వాడికి ఇష్టమైతే తెచ్చుకుంటాడు; కష్టమైతే మానుకుంటాడు," అని సమాధానం చెప్పుకుంటూ ఎసట్లో బియ్యం పోయడానికి వెళ్ళింది.

* * *

కనకమ్మకి గోపాలం సంగతి బొత్తిగా బోధ పడటంలేదు. లక్ష్మి వెళ్ళిన తరువాత ఒక వారం ఏమిచేశాడో ఇంటిదగ్గర, అంతే. తరువాతపట్టుమని రెండుపూటలు వరుసవిస్తరి వేయలేదు. రెండు నెలలు సెలవుపెట్టేసినాడు తనతోటి ఒకరోజు భోంచెస్తూ. "ఎందుకు పెట్టేవురా సెలవు?" అని తను నిలదీస్తే ఒకసారి "నాకు ఒంట్లో బాగుండటం లేదనీ" ఒకసారి, "నాకు మనస్సు బాగుండడం లేదనీ" మరోసారి; "నాకు సెలవు పెట్టాలని అనిపించిందని" ఏదో ఇషం వచ్చినట్లు సమాధానాలు చెప్పేడు. సెలవు పెట్టిన తరువాత ఇంటికి రావడమే అబ్బురమై పోయింది.

రోజూ ఏదో ఒక టైముకి గోపాలం ఇంటికి వచ్చినా, బట్టలుమార్చుకు వెళ్ళిపోతున్నాడు. "అబ్బాయీ ఎక్కడ భోంచేస్తున్నావు?" అని తను అనేకసార్లు అడిగింది. "ఇంకెక్కడ శంకరం ఇంట్లో" అనేవాడు మామూలు సమాధానమే కదా వస్తుందని యీమధ్య తను గోపాలాన్ని ఆ ప్రశ్న వేయడం కూడా మానుకుంది. భోజనం సమయానికి వస్తే "లే, భోజనానికి; వడ్డించేను" అని తను అంటోంది. ఒకప్పుడు భోంచేస్తున్నాడు; ఒకప్పుడు ఏదో పనివుందని బట్టలు మార్చుకు వెళ్ళిపోతున్నాడు. ఎంత స్నేహితులు అయితే మాత్రం, రోజూ అన్నం పెడతారా ఇల్లుండగా? తను తమ్ముడిగారి వూరు వెళ్ళినప్పుడంటే, గోపాలానికి ఎవ్వరూ వండిపెట్టడానికి లేరు కాబట్టి, స్నేహంమీద పెట్టేరుగాని, శంకరం తను వుండగా భోజనం ఎందుకు పెడతాడు? ఒక వేళ పెట్టినా, ఒకరోజా రెండు రోజులా కాని ఇదేమిటి అప్పుడే నెలా పదిహేను రోజులనుంచి గోపాలం, శంకరంగారి ఇంట్లో భోజనం చేస్తున్నాడనే నమ్మకంపోయింది. మరి ఇంక ఎక్కడ భోంచేస్తున్నాడు?— సమాధానం దొరకడం లేదు తనకి. గోపాలం మాటలు ఏదో మిష పెట్టుతూవున్నట్లున్నాయి కాని, తనతో నిజం చెబుతూ వున్నట్లు లేవు కనకమ్మకి.

ఒకరోజు గోపాలం రాత్రి మూడుగంటలకి సినిమాకు వెళ్ళేనని వచ్చి పడుకుని, మరునాడు ఉదయం పదిగంటలకు లేచాడు.

స్నానం అయ్యాక తను కాఫీ ఇస్తే త్రాగి, బట్టలు వేసుకుని వెళ్ళిపోయాడు. వంట అయిందని ఎంత బ్రతిమాలినా "ఇప్పుడే కాఫీ త్రాగేను, త్వరగానే వస్తాలే." అంటూ భోంచేయకుండా వెళ్ళిపోయాడు. మళ్ళీ ఆరోజు తనకి కనబడలేదు. తరువాత "ఎంచేత రాలేదు నిన్న" అని అడిగితే "కబుర్లతో ఒంటిగంట అయిపోయింది. శంకరం 'ఇంకేం వెడతావు ఇప్పుడు' అంటే వాళ్ళ ఇంట్లోనే తినేశానమ్మా." అన్నాడు తడుముకోకుండా.

మరొకరోజు సాయంకాలం 6 గం. వచ్చి అన్నం పెట్టమన్నాడు. "ఇంకా వండలేదు, పిండి అయింది ఇప్పుడే" అని తను అంటే "పోనీ అదే పెట్టు, సినీమాకి అందుకోవాలి త్వరగా. నువ్వు మళ్ళీ వండుకుందువు గానిలే" అని పిండి తొందరగా తిని వెళ్ళిపోయాడు.

ఆఫీసుకు శెలవు పెట్టడం, ఇంటి పట్టున వుండకుండా రాత్రీపగలూ లేకుండా తిరగడం, పూర్వం అసహ్యపడే సినీమాలు ఇప్పుడు తిరుమమూడ్డం, భోజనం. ఇంటి దగ్గర ఎప్పుడోకాని చేయక పోవడం చూస్తూ వుంటే, కనకమ్మకి కొడుకు పాడై పోతున్నాడు అనే అనుమానం కలిగింది. కొడుకు తనతో శంకరం ఇంట్లో భోంచేస్తున్నాను అనడం పూర్తిగా మిథ్యగా నిశ్చయించింది. శంకరం గారి ఇంటికి వెళ్ళి వాకబు చేద్దామనుకుంది. మళ్ళీ గోపాలానికి తెలిస్తే ఏమంటాడో అని మానేసింది.

కనకమ్మకి కొడుకు ఇలావుంటే త్వరలో భ్రష్టుడు అయిపోతాడనిపించింది. లక్ష్మి వుంటే ఇంటిపట్టున వుంటాడేమో అనే ఆశ కలిగింది. గోపాలాన్ని, లక్ష్మిని తీసుకురమ్మంటే తను, తీసుకు రావచ్చును; కాని ఎలాగ తీసుకు రమ్మనడం? గోపాలం, లక్ష్మిని పుట్టింటికి పంపుతూ అన్నమాటలు స్ఫురణకు వచ్చాయి; తను ఆత్మాభిమానాన్ని చంపుకోవాలి. అయినా యీ పరిస్థితిలో తీసుకురమ్మన్నా, గోపాలం లక్ష్మిని తీసుకు వస్తాడన్న నమ్మకం తక్కువ. ప్రస్తుతం రోజుకి ఒకసారి అయినా వస్తున్నాడు ఇంటికి. లక్ష్మిని తీసుకు రమ్మంటే అదీ రాడేమోఅనే సందేహం వేసింది కనకమ్మకి. లక్ష్మిఅంటే ఇష్టం అంత లేకపోయినా, కొడుకు బాగు కోసం కోడలు అవసరం అనుకుంది. వెంటనే పుట్టింటి దగ్గరవున్న కోడలికి గోపాలం పరిస్థితి అంతా పూసలు గ్రుచ్చినట్లు వ్రాసింది. తన అభిప్రాయం కూడా క్రింది విధంగా వ్రాసి, పూర్తిచేసి పంపింది:

"గతాన్ని తలపెట్టడం నాకు ఇష్టంలేదు. నువ్వుకూడా తలపెట్టవని వుద్దేశ పడుతున్నాను. మనం, నువ్వు ఇక్కడికి కాపురానికి వచ్చిన మొదట్లోకన్నా ఎక్కువగా కలసికట్టుగా వుండాలని కుతూహల పడుతున్నాను. గోపాలాన్ని యీస్థితిలో బాగుపరచ కలిగితే, నువ్వే బాగుపరచాలి. నిజం చెప్పవలసివస్తే, ఆ నమ్మకంకూడా నాకు తక్కువగానే వుంది అయినా మన ప్రయత్నం, మనం, మనకోసం చేయాలి. వాడిబాగు మన ఉభయులకూ అవసరమైన విషయం. మన పూర్వపు తగువులు పాటించి నువ్వు రావడం మానేవంటే, మన ఉభయులం నష్టపోతాం; నవ్వులపాలు అవుతాం. తల్లినైన నాకంటే, భార్యవైన నీకే ఎక్కువనష్టం. తరువాత ఎంత విచారించినా ప్రయోజనం వుండదు అంచేత నువ్వు గతాన్ని మరచిపోయి వెంటనే బయల్దేరి రావలసింది."

* * *

కనకమ్మ, కోడలికి వుత్తరం వ్రాసి నాలుగు రోజులు అయింది లక్ష్మి పుట్టిల్లు ప్రక్కనున్న తాడేపల్లిగూడెమే కాబట్టి ఎలా లేదన్నా వ్రాసిన మరునాడు అంది వుంటుంది. లక్ష్మి వస్తే యీపాటికి రావలసింది. నిన్నా, ఈవేళా, రేపూకూడా తిథులు మంచివే—పౌర్ణమి వెళ్ళిన పాడ్యమి, విదియ, తదియలు. వస్తే రేపు రావాలి, వారం కూడా మంచిది కాబట్టి. ఒకవేళ బయల్దేరడానికి ఏకారణంచేత నన్నా వీలుపడని పక్షంలో, ఉత్తరం అన్నా వ్రాసివుండును. గోపాలం చూస్తాడేమో అని వ్రాయకా పోవచ్చును. ఇంతకీ లక్ష్మి వస్తుందని రూఢి ఏది? తను వ్రాసిన వుత్తరానికి తప్పకుండా లక్ష్మి వస్తుందని కనకమ్మ నమ్మకం.

మరుసటిరోజు ఉదయం గోపాలం భోంచేస్తూ "అమ్మ నిన్ను శంకరం భార్య, అమ్మగారు చూసి చాలారోజులయిందని చూడాలని అంటున్నారు. ఈవేళ సాయంకాలం, వాళ్ళతో నిన్ను తీసుకు వస్తానని చెప్పేను. అంచేత నాలుగు గంటలకి బయల్దేరి వెడదాం" అన్నాడు. కనకమ్మకి వెళ్ళటమో, మానటమో అర్థం కాలేదు. ఆలోచించింది. గోపాలానికి తెలియకుండా తను అంతకుముందు శంకరంగారి ఇంటికి వెడదామనుకున్నది. జ్ఞాపకం వచ్చింది. గోపాలం ఎక్కడ భోంచేస్తూవున్నదీ తెలుస్తుంది, వెడదామని "అలాగే, దానికేం. నాకుకూడా వాళ్ళని చూడాలనేవుంది. కాని ఆరుగంటలకన్నా తిరిగి వచ్చెయ్యాలి; లేకపోతే వంట అయ్యేటప్పటికి చాలా రాత్రి అవుతుంది" అంటూ తలవూపింది.

గోపాలం, కనకమ్మ శంకరంగారి ఇంటికి రిక్షామీద వెళ్ళేటప్పటికి, నాలుగున్నర అయింది. కనకమ్మకోసం ఎదురు చూస్తున్నారు ఏమో, సంకరం తల్లీ, భార్యా "లోపలికి రండి, క్షేమమేనా" అని కుశల ప్రశ్నలు వేస్తూ లోపలికి తీసుకు వెళ్ళేరు. గోపాలం శంకరం కోసం మేడ ఎక్కేడు.

కనకమ్మ, కాళ్ళుకడుక్కుని పీటమీద కూర్చుని వుంది. శంకరం భార్య "ఏమండీ పిన్నిగారూ, మీకోడలి వద్దనుంచీ ఉత్తరాలు వస్తున్నాయా! అని మామూలు యోగక్షేమాలు మాటలాడుకోవడంలో ప్రశ్నించింది.

"వస్తూనే వుండి వుంటాయి, రాక పోతాయా? కాని వచ్చినట్లు ఎప్పుడూ చెప్పలేదు మా అబ్బాయి" అని కనకమ్మ నసుగుతూ వుంటే, లక్ష్మి ఎదుటి నుంచి నవ్వుతూ, కనకమ్మ వ్రాసిన వుత్తరం పట్టుకు వచ్చింది కనకమ్మ తన కళ్ళని నమ్మలేక పోయింది. "ఎప్పుడు వచ్చావ్" అంటూ ఆశ్చర్యంగా అడిగింది.

"నేను మీ ఇల్లువదలి ఎన్నిరోజులు అయిందో; నేను ఇక్కడికి వచ్చి సరిగ్గా అన్నే రోజులయింది. కనకమ్మకి వుత్తరాన్ని చూపిస్తూ "ఇదిమీరు వ్రాసిందేనా?" అందిలక్ష్మి.

(56-వ పేజీ చూడండి)

# వర్షఋతువు



## మధురాంతకం రాజారాం

కొండలకావైపు ఎచటనుండినవో
మండువేసంగిలో ఎచట దాగినవో
ఇంద్రజాలమువోలె అట్టిపైకెగిరి
ఇట్టిలోకమ్ముల ముట్టడించుటకు
మదపుటేనుగులట్లు కారెనుములట్లు
అదిగదిగో వచ్చె మేఘమాలికలు!

చూపు చెదిరేటట్లు ధగధగా మెరసి
సొగసుల వెదజల్లు నొకజగా మెరపు
గిరులు ఢీకొనునట్లు పెళాపెళా పురిమి
ఉరుమొక లోకులకు కలిగించు వెరపు
ఇదిగిదిగో వానవచ్చెనని మనకు
ఈ వురుము, ఆ మెరపు హెచ్చరిక దెలుపు.

ఒకొక్కటిగవచ్చు, నంతలో హెచ్చి
హోరుహోరున పెద్ద రభసతో వచ్చు
ఏనుగుతొండమునెత్తి వెదజిమ్మినట్లు
ఏకధారగ కుండపోతగావచ్చు.
జారెడి వర్షమే దిక్కులదాక
ఔరౌర! చోద్యమీ జడివానరాక!

జల్లు జల్లున కురియు జడివాన మ్రోత
జలజాక్షి కాలిగజ్జెల చప్పుడనగ
విసురుగా వీచెడి సుడిగాలి మ్రోత
వెలది యాలాపించు రాగమాలికగ
వెయ్యి ఒయ్యారముల ఈ వర్షలక్ష్మి
విశ్వరంగముపైన నృత్యమ్మొనర్చు!

వింటపల్లమ్ముల నేకమ్ము జేసి
గట్టు కనబడనీక ప్రవహించె యేరు
నిండిన చెరువులో ప్రారంభమాయె
మండూకములచేత పాటకచ్చేరి!
భళ్ళుభళ్ళున తెల్లవారెడుసరికి
కొల్లగా తుమ్మెదలు కదలాడె మింట!

తొలగిపోయిన మబ్బుతెరలకు వెనుక
వెలిగిపోవునుసుడీ బాలభానుండు
పడమటి దిక్కునపుడు ప్రభవిల్లు
ఏడు రంగులతోడ యింద్రునివిల్లు
పల్లెసీమలజొచ్చి చూడవలెగానీ
వర్ణింప శక్యమా వర్షఋతుశోభ!

# వరాహమిహిరుడు

**గుమ్మిడి సింహాద్రి**

సాహసానికి, త్యాగానికి, విజ్ఞానానికి నిలయమైన విక్రమార్కుడొకసారి, తనకు సోదరుడు—మంత్రి అయినటువంటి భట్టితో కలసి దేశసంచారం చేస్తూ తపతీ స్రవంతి దగ్గర సూర్యునకర్ఘ్యమిస్తున్న ఒక భూసురుని చూచాడు. అతని ముఖంలో సరస్వతి తాండవమాడుతూ వుంది.

వారిరువురు ఆ తేజోమూర్తి యొద్దకు వెళ్లి, "మేము వర్తకులము త్వరలో మేముచేయనున్న ప్రయాణం నిర్విఘ్నంగా సాగి మాకు లాభం చేకూరుతుందా?" అని అడిగారు.

మారువేషాల్లో ఉన్న విక్రమార్కుని భట్టిని ఆ బ్రాహ్మణుడు ఒకసారి తేరిపార చూచి చిరునవ్వు నవ్వాడు. "అయ్యా! ఇప్పుడుమీరు నాతో చెప్పినట్లు వణిజులు కారు. ఇతడు సకల రాజలక్షణాలు కలవాడు. చక్రవర్తి. అద్భుతసాహసి" అని విక్రమార్కుని చూపాడు. భట్టిని చూచి "నీవు ఈ ప్రభువునకు మిత్రుడవు. వర్తకులమని నావద్ద అబద్ధమాడు తున్నారు. ఈ చక్రవర్తి ఉత్తమ క్షత్రియకాంత గర్భమున జన్మించాడు. నీవు వైశ్యకులానికి చెందిన ఒక పరమ సాధ్వీమణి పుత్రుడవు. మీరు నా విద్యను పరీక్షించు తలంపుతో నావద్ద నిజాన్ని మరుగు పరచారు. నేను సత్వగుణ సంపూర్ణుడనైతే నేను చెప్పిన మాటలు పొల్లుకావు." అని చెప్పేసరికి భట్టి విక్రమార్కులు ఆశ్చర్యపోయారు.

 **వరాహ మిహిరుడు** 

భట్టి విక్రమార్కులు భక్తిభావముతో ఆయనకు నమస్కరించారు. ఆయన చెప్పిన ప్రతి వాక్యమూ పరమ సత్యమని ఒప్పుకొన్నారు ఆ బ్రాహ్మణుడు వారిని తన గృహానికి తీసుకొనివెళ్లి ఆతిథ్యమిచ్చాడు.

భట్టి విక్రమార్కులకు ఆతిథ్యమిచ్చిన బ్రాహ్మణుని పేరు 'మిహిరుడు.' ఆయన సూర్యభగవానుని అనుగ్రహము వలన జన్మించడం వల్ల ఆయనకా పేరు పెట్టారు. మిహిరుడు తన ఎనిమిదవ ఏటనే వేదములను, జ్యోతిష శాస్త్రమును, నక్షత్ర శాస్త్రమును తండ్రివద్ద నేర్చుకున్నాడు. మిహిరునకిప్పుడు యిరవైఐదు సంవత్సరాలు. ఇంతవరకూ మిహిరుడు చెప్పిన ఏ విషయం కూడ పొల్లుపోలేదు. అతడు చెప్పినట్లు అక్షరాలా జరిగాయి.

ఆతిథ్యము స్వీకరించి భట్టి విక్రమార్కులు "మహాత్మా! మీరు మా కోరికను మన్నించి, మా ఆస్థానాన్ని అలంకరించవలసింది"ని కోరారు. మిహిరాచార్యుడు సంతోషంగా అందుకు అంగీకరించాడు.

## 2

రత్నఖచితమైన సింహాసనమున విక్రమార్కుడు ఆసీనుడై ఉన్నాడు. సభాభవనము భట్టి మొదలగు అమాత్యవర్యులతోను, కాళిదాసు ధన్వంతరి, ఘటకర్పుడు, మిహిరుడు వరరుచి మొదలగు నవరత్నములతోనూ శోభాయమానంగా వుంది.

ఆనాడు విక్రమార్కుని పట్టపుదేవి ఒక కుమారుని కన్నది. బాలుని జాతకమును వ్రాయవలసినదిగా విక్రమార్కుడు సభ నలంకరించి ఉన్న దైవజ్ఞులను కోరాడు.

కాళిదాసు వరరుచిగూడ జ్యోతిషములో నిపుణులు. వారు "యువరాజు తన పద్దెనిమిదవ ఏట వేటకు పోయి ఆ అడవిలో ఒక క్రూర మృగముచేత మరణించగల" డని తేల్చి, విక్రమార్కునితో చెప్పారు.

సభ నలంకరించియున్న మిహిరాచార్యుడు లేచి రాజు ముఖము చూచి నిశ్శంకగా "రాజకుమారుడు ఎక్కడ వున్నప్పటికీ, తన పద్దెనిమిదవ ఏట వరాహ కరాళ దంష్ట్రాలి వాతబడి మరణిస్తాడు. ఇతనిని మృత్యు ముఖంనుండి తప్పించడం మానవ సాధ్యంకాదు. మానవుల బుద్ధి కుశలత కాని, మణి మంత్రౌషధములు కాని రాజకుమారుని ఈ గండమునుండి కాపాడలే"వని చెప్పి తన స్థానంలో కూర్చున్నాడు.

విక్రమార్కుడు భట్టి మొదలైన మంత్రులతో చాలావరకు చర్చలు సాగించి రాజకుమారుని రక్షించుకోవడానికి ఒక బ్రహ్మాండమైన భవనం కట్టించాడు. దాని మధ్యలో ఏడంతస్తుల ఒంటి స్తంభంమేడకట్టి, ఏడవ అంతస్తులో రాజకుమారుడు వుండే ఏర్పాట్లు చేశారు. మహారాజు అనుమతి లేనిదే రాజకుమారుడు బయటకు వెళ్లటానికి వీలులేదని ఆజ్ఞాపించారు. రాజకుమారుడు ఆటపాటలతో ఖులాసాగా కాలం గడపటానికి అతని యీడుగల పిల్లలను కొందరిని రాజకుమారుని మందిరంలో ఉంచారు.

ఆ భవనానికి రాత్రింబవళ్లు సాయుధులైన భటులు కావలా కాస్తూ ఉంటారు. 'వారికి తెలియకుండా చీమైనా బయటికి వెళ్లటం కాని, బయటనుండి లోపలికి వెళ్లటం గాని అసంభవం. భవనానికి చుట్టూ లోతైన కందకం వుంది. ఏ మృగము కూడా కందకాన్ని దాటి భవనానికి చేరకుండా తగిన కట్టుదిట్టాలు చేయబడ్డాయి.

ఇదంతా చూస్తున్న ప్రజలలో సంచలనం కలిగింది. "మిహిరాచార్యుడు జ్యోతిషంలో ఎంతటి దిట్ట అయినప్పటికీ, యీసారి మాత్రం నిండు కొలువులో అవమానితుడు కాక తప్పదు" అని అనేకవిధాలుగా మాట్లాడుకుంటున్నారు.

## 3

నాటితో రాజకుమారునకు పద్దెనిమిది సంవత్సరాలూ పూర్తి అవుతాయి. రాజ్యంలో ప్రతిచోట "మిహిరాచార్యునికి ఓటమి తప్ప" దను మాటలే.

విక్రమార్కుడు ఆనాడు పెందలకడే సభతీర్చి ఉన్నాడు. మిహిరాచార్యుని చూచి "మీరు ఈనాడు ఇరవై ఏడు గడియలకు రాజకుమారుడు మరణిస్తాడని చెప్పారు. ఈ విషయంలో మాత్రం మీ జ్యోతిషం ఫలించదేమో! అని నా అనుమానం. నా కుమారుని వరాహం బారినుండి తప్పించటానికి నేను చేయించిన కట్టుదిట్టాలు దుర్భేద్యమైనవి. ఇన్ని రక్షణ లున్నప్పటికీ రాజకుమారుడు మరణిస్తే, మీ జ్యోతిష జ్ఞానానికి వరాహా చిహ్నమైన యీ రాజముద్రికను బహూకరిస్తాను." అని అన్నాడు.

మిహిరాచార్యుడు లేచి "మహారాజా! మీరు కుమారుని రక్షించటానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా, అవి మానవ నిర్మితాలే కాని వేరు కావు. దైవ ప్రేరేపిత వాక్కులు ఎప్పుడూ పొల్లుపోవు. నాకు రాజ

కుమారుని పైన ఏమాత్రం ద్వేషం లేదు. ఒకవేళ నా జ్యోతిషం ప్రకారము జరుగక రాజకుమారుడు జీవిస్తే నాకంటే ఎక్కువగా సంతోషించే వారుండరు. అప్పుడా రాజకుమారుని దీవించి, నా ఓటమిని అంగీకరించి అడవులకు పోయి తపస్సు చేసుకుంటా"నని శపథంచేశాడు.

విక్రమార్కుడు మిహిరాచార్యుని శపథానికి చింతించి "మహాత్మా! మీరు మీ శపథాన్ని ఉపసంహరించుకోండి. దైవ మిచ్చిన ఆయుర్దాయం ఎంతవర కుంటుందో అంతవరకూ మానవుడు బ్రతుకుతాడు. నా కుమారునిగూర్చి నాకు చింత లేదు. ఒకవేళ ఈ గండం గడిచి నా కుమారుడు బ్రతికి నప్పటికి నేను మీవంటి దైవజ్ఞులను కోల్పోటానికి ఇష్టపడను. మీరు నా ఆస్థానం విడిచిన మరుక్షణమే, నేనుగూడ ఈ రాజ్యాన్ని త్యజించి మీ వెనుక వస్తాను." అని అన్నాడు. అప్పటికి సభ చాలించి, తిరిగి ఇరవై గడియలు గడచిన తరువాత అందరూ సమావేశమయ్యారు.

గడియ గడియకూ రాజభటులు రాజకుమారుని క్షేమవార్తలు సభామందిరానికి అందజేస్తూ ఉన్నారు. ఇరవై ఏడు గడియలు పూర్తి అయ్యాయి. మిహిరాచార్యుడు లేచి "మహారాజా! కుమారుడు మృతి చెందాడు. ఇక మనం ఆయన మృతకళేబరమున్న చోటికి బయలుదేరవచ్చు" అని చెప్పాడు.

అంతలో ఒక సేనాని పరుగెత్తుకొని వచ్చి "రాజకుమారుడు క్షేమముగా ఉన్నా"డని చెప్పాడు. మరి కొంతదూరం వెళ్లేటప్పటికి ఇంకొక సేనాని అదేవిధంగా చెప్పాడు.

అందరూ సౌధం చేరుకున్నారు. ఏడవ అంతస్తు తలుపులు తట్టారు. తలుపులు తెరవబడ్డాయి. కాని అక్కడ రాజకుమారుడు లేడు. అక్కడున్న వారినడిగితే "రాజకుమారుడు యింతసేపూ మాతో చదరంగమాడి యింతకు మునుపే బడలికగా ఉందని పైకి వెళ్ళాడు. క్షేమంగానే ఉన్నా"డని చెప్పారు.

మిహిరాచార్యుడు విక్రమార్కుని చూచి "రాజకుమారుడు ఇరవై ఏడు గడియలకే చనిపోయాడు. పైకి వెళ్దాం పదండని" చెప్పాడు.

అందరూ పైకి వెళ్లారు. విక్రమార్కుడు వణకుతున్న చేతులతో తలుపు తెరచాడు. లోపలిదృశ్యాన్ని చూచి అందరూ నిర్విణ్ణులైనారు. రాజకుమారుడు రక్తంలో తడిసి మంచంమీద పడి వున్నాడు. అతడి గుండెలమీదఉన్న వరాహం వాడి కోరలు రాజకుమారుని గుండెల్లో దిగబడి ఉన్నాయి.

రాజకుమారుడు చనిపోయిన మంచం దగ్గర ఒక ధ్వజముంది. దానిమీద లోహంతో చేయబడిన ఒక వరాహముంది. రాజచిహ్నమైన అటువంటి ధ్వజములు రాజప్రాసాదాల పైన ఉండటం రివాజు.

రాజకుమారుని రక్షణకు ఇన్ని ఏర్పాట్లు చేసినా ఆ లోహ వరాహాన్ని ఎవరూ గుర్తించలేదు. బడలికగా ఉన్న రాజకుమారుడు సరిగా ధ్వజము క్రిందనున్న మంచంమీద నిద్రపోయాడు. గాలి తాకిడికి ఆ వరాహము ధ్వజము నుండి జారి రాజకుమారుని మీద పడింది. దాని వాడికోరలు గుండెలలో నాటుకొనడంవల్ల రాజకుమారుడు వెంటనే మరణించాడు. ఈ విషయం తెలియని భటులు రాజకుమారుడు క్షేమంగా ఉన్నట్లు చెబుతూ వచ్చారు.

విక్రమార్కుడు మిహిరాచార్యుని ఆలింగనం చేసుకొని తన వాగ్దానం ప్రకారం వరాహచిహ్నమున్న రాజముద్రికను బహూకరించాడు.

నాటినుండి మిహిరాచార్యుడు "వరాహ మిహిరు" డయ్యాడు. ★

బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

**జరిగిన కథ :—**

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొన వలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతెరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. వారు దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్లవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కౌన్సెల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి పుష్కలంగా భోజనం పెడతారు. తిరిగీ తను కన్నపానాలు రాలేదని అంతా మథన పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరూ బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. కెప్టన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరుచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది. తరవాత సాగరగర్భంలో క్రెస్పోద్వీపంలో వేట జరుగుతుంది. జలాంతర్గామి వానికొరో ద్వీపంమీదుగావెళ్లి గిబ్బోవాద్వీపానికి సమీపంలో నిలబడుతుంది. అరోనా అనుచరులతో కలిసి ఆ ద్వీపంలో ప్రవేశిస్తాడు. ముగ్గురు గిబ్బోవాద్వీపంలో వేట ముగించుకొనివస్తూండగా హఠాత్తుగా ఒకరాయి వారిదగర పడుతుంది. పిమ్మట కెప్టెన్ నీమో వజ్రాయుధంతో ఆటవికుల నందరినీ హడలగొట్టి వేస్తాడు. క్రమంగా జలాంతర్గామి పగడాలదీవి జేరుకుంటుంది. చనిపోయిన నావికునికొకనికి అక్కడ సమాధి ఏర్పాటుచేసారు. కెప్టెన్ నీమో మన్నారు సింధుశాఖలో ఒక పెద్దముత్యం సంపాదిస్తాడు. పిమ్మట ఎంతో చాకచక్యంతో ఒక జెస్తవాని ప్రాణాలు సంరక్షిస్తాడు, పిమ్మట జలాంతర్గామి మధ్యధరాసముద్రందాటి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశిస్తుంది. తరవాత జలాంతర్గామి నావికులు విగో అఖాతంలో మునిగి వెండిబంగారాల పోగులు సేకరిస్తారు. కెప్టెన్ నీమో ప్రొఫెసర్ అరోనాకుఅట్లాంటిక్ ఖండం చూపిస్తాడు,

## 24 సముద్రంలో బొగ్గుగనులు

అనువాదం: “వినాయక”

ఆ మర్నాడు నేను లేచేసరికి చాలా పొద్దెక్కింది. గడియారం చూసేసరికి 11 గంటలయింది. జలాంతర్గామి ఎటు పోతూందో తెలుసుకోవాలని అనిపించింది. యంత్రాలు చూస్తే అది దక్షిణపు దిక్కుగా పోతూందనీ 50 నిలువుల లోతు నీటిలో ప్రయాణం చేస్తున్నదనీ తెలిసింది.

అంతలో కౌన్సెల్ అక్కడికి వచ్చాడు. అతనికి గత రాత్రి చూచిన వింతలన్నీ తెలియజేశాను.

జలాంతర్గామి నీటిలో మునిగి పోయిన అట్లాంటిస్ ఖండంమీద 5 నిలువుల పైనున్న జలభాగంలో నే ప్రయాణం చేస్తూంది. అందుచేత మా కొక రైలులో కూర్చుని అతి వేగంగా ప్రయాణం చేస్తున్నట్టు తోచింది. మా కిరువైపులా

చిత్ర చిత్రమైన కొండలు, గుట్టలు, చిట్టడవులు, మొదలైన వెన్నో తగిలాయి. సముద్రం లోపలికి ఆకారాలన్నీ స్పష్టంగా కనిపించాయి.

ఆ విచిత్ర దృశ్యాలలా గ కన్నుల పండుగ చేస్తూంటే కౌన్సెల్ తో నేనా నీటిలో మునిగిపోయిన ఆ అట్లాంటిస్ ఖండం పురాతన గాథ సంగతి, అంతా ప్రసంగించాను. ఆ ప్రాచీన ఖండవాసుల యుద్ధాలు, జీవిత విశేషాలు మొదలైనవన్నీ చెబుతూంటే కౌన్సెల్ కొంత సేపటి వరకు శ్రద్ధగానే విన్నాడు గాని తరవాత అంతగా శ్రద్ధకనబరచలేదు.

చిత్ర చిత్రమైన చేపలపై పతని దృష్టి మళ్లింది. జలాంతర్గామి కొండలమధ్య నించీ, గుట్టల మధ్య నించీ చరచరా సాగిపోతూంది. మానాటిలస్ నావికుల చాకచక్యానికి నేనెంతైనా మురిసిపోయాను. ఏమాత్రం పొరబాటు వచ్చినా మా జలాంతర్గామి ఏ కొండకో గుట్టకో డీకొని ఢామ్మని పగిలిపోయేదే! ప్రతిక్షణము నేనలాంటి ఆపత్తేదో రాబోతూందని చాలా భయపడ్డాను. గాని అలాంటి ఆపత్తేమీ రాకుండా నావికులెంతో జాగ్రత్తగా మా జలాంతర్గామి నడిపించుకుపోయారు.

సాయంత్రం నాలుగున్నర అయింది. జలాంతర్గామి చుట్టుపక్కల కనిపించే భూభాగం అంతా ఏదో అగ్నిపర్వత ప్రాంతంలా కనిపించింది. అదేమైనా పూర్వం అగ్నిపర్వతాలున్న ప్రాంతమా? నాకెంతకీ ఆసందేహం తెగలేదు.

నేనా రాత్రిఅంతా అలాగే చూస్తూకూర్చున్నాను. అంతలో జలాంతర్గామి అద్దాల కిటికీలు మూసుకుపోయాయి. నేనిక చేసేదేమీ లేక నాగదిలోకి వెళ్లిపోయి హాయిగా నిద్రపోయాను. తెల్లవారి లేచేసరికి 8 గంటలయింది.

అప్పటికి జలాంతర్గామి సముద్రం పైభాగానికి వచ్చివేసింది. నేనద్దాల కిటికీల దగ్గిరికి వెళ్లాను. అవి తెరిచేఉన్నాయి. కాని చుట్టూ ఎటు చూచినా గాఢాంధకారమే. మేమిప్పుడెక్కడ ఉన్నాము? తెల్లవారిపోయిందని అనుకున్నానే! ఇంకా తెల్లారలేదా? లేకపోతే నేనేమైనా గాని పొరబాటు పడ్డానా? మళ్లీ గడియారంకేసి చూశాను. బాగా తెల్లవారిపోయిన మాట వాస్తవమే. అయితే చుట్టూరా గాఢాంధకారం అలుముకు పోవడానికి కారణమేమిటి? అంతలో నాకొక పిలుపు వినబడింది:

"ఎవరది? ప్రొఫెసర్ అరోనా?"

"అవును! నేనే కెప్టెన్! అయితే మనమిప్పుడెక్కడ ఉన్నాము?"

"భూగర్భంలో"

"భూగర్భంలోనా? మరి జలాంతర్గామి ఇంకా తేలుతూనే ఉందే!" అని ఎంతో ఆశ్చర్యంగా అడిగాను.

"అవును! తేలుతూన్న మాట నిజమే!" అన్నాడు అరోనా.

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

"మీరు చెప్పేదేమిటో నాకు తిన్నగా బోధపడడం లేదు."

"ఒక్క నిమిషం ఆగండి! ఇంతలో దీపాలు కూడా వెలుగుతాయి. దానితో మీ సందేహాలన్నీ తీరిపోతాయి.

అంతవరకు నాకు కెప్టెన్ నీమో కూడా తిన్నగా కనిపించ లేదు కాని వెంటనే విద్యుద్దీపాలు వెలిగాయి. ఆ ప్రాంతం అంతా ఒక్కమారుగా తళుక్కుమని మెరిసింది.

దీపాలు వెలిగేసరికి జలాంతర్గామి ఒక పెద్ద గట్టుదగ్గిర నిలబడినట్టు కనబడింది. అక్కడ సముద్రం అంతా ఒక నిశ్చలమైన సరస్సులా కనిపించింది. దానిచుట్టూరా పెద్ద పెద్ద గోడలలాంటి గట్లు కనిపించాయి. ఆ ప్రదేశం వైశాల్యం సుమారు ఆరుమైళ్లుండవచ్చును. ఆసముద్ర సరోవరానికి, మహా సముద్రానికి మధ్యన ఎక్కడో ఒక దోవ దారి ఉన్నదన్నమాట! లేకపోతే మా జలాంతర్గామి అక్కడికి ఎలాగ వెడుతుంది? చుట్టూరా ఉన్న గోడల ఎడిపి సుమారు 12 వందల అడుగులవరకు ఉండవచ్చును.

అదంతా చూసేసరికి నాకేదో పెద్ద అనుమానం బయలుదేరింది. నెమ్మదిగా కెప్టెన్ నీమోను పలకరించాను:

"అయితే మనమిప్పు డెక్కడ ఉన్నట్టు?"

"ఒక పెద్ద అగ్నిపర్వతం గర్భంలో ప్రవేశించాము. కాని ఆ అగ్నిపర్వతం ప్రస్తుతం సముద్రంలో మునిగిపోయింది. ఆ అగ్నిపర్వతానికీ, సముద్రానికీ మధ్యన ఒక సన్నని మార్గం ఏర్పడింది. ఆ మార్గంగుండానే జలాంతర్గామి ఇక్కడికి వచ్చింది. నిజానికిది ఒక పెద్ద ఓడరేవులాంటిదే! ఇక్కడ జలాంతర్గామి కేలాంటి ఇబ్బందీ ఉండదు. ప్రపంచంలో ఎక్కడా ఇలాంటి ఓడరేవు లేదనే చెప్పవచ్చును."

అని కెప్టెన్ నీమో ఎంతో గర్వంగా నాకేసి చూశాడు.

"కెప్టెన్! మీ రెంతైనా అదృష్టవంతులు! ఇలాంటి సురక్షితమైన ఓడరేవు ప్రాంతాలలో జలాంతర్గామి నిలిపే అదృష్టం మీలాంటి వారి కొక్కరికే దక్కుతుంది. ఐతే మరి ఇలాంటి రేవుల అవసరం మీ కేమీ లేదే! నాటిలస్ ఎక్కడబడితే అక్కడే నిలిపివెయ్యవచ్చునే! ఈ రేవుతో మీ కేమి పని?" అన్నాను నా సందేహం తీరక.

కెప్టెన్ నేనడిగిన ప్రశ్నకు సమాధానం ఇచ్చాడు:

"జలాంతర్గామి అంతా విద్యుచ్ఛక్తితో నడుస్తున్నదని మీ కెరుగుదురు గదా? ఆ విద్యుచ్ఛక్తి తయారు కావాలంటే పుష్కలంగా బొగ్గు సప్లయి కావాలి! ఈ ప్రాంతంలో పెద్ద పెద్ద అరణ్యాలు భూగర్భంలో పాతుకుపోవడంవల్ల ఎన్నెన్నో రాక్షసి బొగ్గు గనులేర్పడ్డాయి. ఇక్కడ ఉన్నన్ని పెద్ద పెద్ద బొగ్గుగనులు ప్రపంచంలో ఎక్కడా లేవు. రాక్షసిబొగ్గు నింపుకోడానికే జలాంతర్గామి ఇక్కడికి వచ్చింది. తెలిసిందా?"

అతని సమాధానంతో నాకంతా బోధపడిపోయింది:

"అయితే మీ నరంగులంతా బొగ్గుగనులలోనించి రాక్షసి బొగ్గు తవ్వి పైకెత్తడానికే ఇక్కడికి వచ్చారన్నమాట!"

"అవును! అందుకనే మే మిక్కడికి వచ్చాము."

"అయితే నేనా రాక్షసి బొగ్గు తవ్వడము, బొగ్గు ఓడలోకి చేరవెయ్యడము, మొదలైనవన్నీ కళ్లారా చూడవచ్చునా?"

"చూడవచ్చునుగాని. ఇక్కడ ఎంతో కాలం ఉండడానికి వీలులేదు. ఈ వేళ సాయంత్రంతో మీరిదంతా చూడగలిగితే నా అభ్యంతర మేమీ లేదు."

నేనామాట వినగానే ఎగిరి గంతేశాను. కౌన్సెలుతోను, నెడ్‌లాండ్‌తోను జరిగినదంతా చెప్పి వారిని కూడా బొగ్గు గనుల దగ్గిరికి ప్రయాణం చేయించాను. నెడ్‌లాండు కెంత సేపు జలాంతర్గామి లోనించి పారిపోవాలన్న ఘోషే గాని వేరే గొడవ ఏమీ లేదు. అయినా ఏదైనా మార్గం దొరకక పోతుందా అని అతడుకూడా మా వెంట పడ్డాడు.

వెంటనే మేము ముగ్గురము సాగరగర్భంలో ప్రవేశించడానికి తగిన దుస్తులు వేసుకొని సముద్రం లోపలికి దిగాము.

ఆప్రాంతంలో మాకొక వెలుగు కనిపించింది. ముగ్గురము ఆ వెలుగు చూచి సముద్రగర్భంలో ఆ వెలుగెలాగ వచ్చిందా! అని ఎంతో ఆశ్చర్యపడ్డాము. నెమ్మదిగా నడుస్తూ మేమంతా ఆ వెలుగు దగ్గిరికి వెళ్లాము.

జలాంతర్గామి నావికులంతా ఆసముద్రసరోవరానికొకమూలగా గుమిగూడి రాక్షసిబొగ్గు సేకరిస్తున్నారు. వారెవరు అట్టే శ్రమపడకుండానే రాక్షసిబొగ్గు తమ సంచీలలో వేసుకుంటున్నారు. గొడ్డలితో నెమ్మదిగా రెండుమూడు దెబ్బలు కొట్టేసరికి గుట్టలు గుట్టలుగా రాక్షసి బొగ్గు పోగుపడుతూంది. నావికులంతా అది తమ బుజాల మీదనున్న సంచీలలో వేసుకొని తొందర తొందరగా జలాంతర్గామి లోకి చేరవేస్తున్నారు.

నేనావ్యవహారం అంతా చూసి 'కెప్టెన్ నీమో ఎంతకైనా తగినవాడే! లేకపోతే! ఈ రాక్షసి బొగ్గు ఈవిధంగా సేకరించడం ఇంకెవరికైనా సాధ్యపడుతుందా?' అని అలాగే విస్తుపోయి చూశాను.

ఆ తరవాత మా ఎదట ఒక గుహ కనిపించింది. మేమంతా ఆ విచిత్రమేమో చూద్దామని నెమ్మదిగా ఆ గుహలో ప్రవేశించాము.

ఆ గుహ ఎదట ఇసక తప్ప ఇంకేమీ లేదు. ఆ ప్రదేశం విశ్రమించడానికి చాలా హాయిగా ఉంది. ఇసక రేణువులు విద్యుద్దీపకాంతులు ప్రసరించిన నీటిలో తళతళా మెరుస్తూ ఎంతో చూడ ముచ్చటగా కనిపించాయి.

ఆ ప్రశాంత ప్రదేశం చూచేసరికి నాకు కొంచెం సేపక్కడ విశ్రమించాలని బుద్ధి పుట్టింది. మేము ముగ్గురము ఆ ఇసకమీద ఒరిగి మెల్లిగా బాతాఖానీలో పడ్డాము.

కొంత సేపటిదాకా మా సంభాషణ అంతా ఆ పరిసరాల ప్రకృతి సౌందర్యంమీద పడింది. అటు పిమ్మట మరి కొంత సేపటికి మాకు ముగ్గురికీ ఆవలింతలు ప్రారంభమైనాయి. మా సంభాషణలు, క్రమంగా పలచబారిపోయాయి. ముగ్గురం నెమ్మదిగా కళ్లుమూశాము.

అంతలో తొందర తొందరగా ఏదో పెద్ద ప్రవాహం లోపలికి చొచ్చుకు వచ్చిన చప్పుడైంది! నాకదంతా ఏదో భయంకరమైన కలలా కనబడింది.

అంతలోనే కౌన్సెల్ మా ఇద్దరినీ భుజాలు తట్టి లేపాడు. 'చూడండి! చూడండి! ఆ విచిత్రం!' అని కేకలు పెట్టాడు!

నేను హఠాత్తుగా లేచి నాలుగు వైపులా చూచాను. ఏదో పెద్ద ప్రవాహం మా గుహలోకి ప్రవేశిస్తూంది. దానిమూలంగా మేమంతా గుహ పైభాగందాకా తేలిపోయాము.

"ఈ ప్రవాహం ఎక్కడినించి వచ్చింది?" ఎంతో కంగారు పడుతూ అడిగాడు కౌన్సెల్.

నేను కొంచెం తమాయించి అతనితో అన్నాను.

"ఇందులో పెద్దగా కంగారు పడవలసిందేమీ లేదు. సముద్రానికి పోటు తగలగానే నీరు పొంగడం సహజమే. ఆ నీరు బాగా పొంగి, ఈ గుహలోకికూడా వచ్చిఉంటుంది.

తరవాత ముప్పావుగంట గడిచేసరికి మేమంతా మళ్ళీ జలాంతర్గామిలో పడ్డాము.

జలాంతర్గామి క్రమక్రమంగా ఆప్రదేశం విడిచిపెట్టి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశించింది. శరవేగంతో తొందర తొందరగా మున్ముందుకు సాగిపోయింది.

—ఇంకా ఉంది.



# వనితాలోకం



## వదినా మరదళ్ళగోష్ఠి  తీరిక సమయాలలో గృహపరిశ్రమలు

# మాల్ట్ తయారుచేసే పద్ధతి

### ఎ. మాణిక్యాంబ

మన నిత్యజీవితావసరవస్తువులలో ప్రతి దానినీ మనం స్వయంగా తయారు చేసుకోవచ్చు. ఆ విధంగా చేసుకుంటే ఆ వస్తువు బజారులో కొన్న ధరకంటె ఎన్నోరెట్లు చౌకగా తయారౌతుంది. అందువల్ల మధ్యతరగతి కుటుంబాలకు ఇంటి ఖర్చులో కొంత మొత్తం కలిసివస్తుంది. వీటిని పురుషులే తయారు చేయనక్కరలేదు. తీరిక సమయాలలో స్త్రీలు కూడ తయారు చేయవచ్చు.

## వదినామరదళ్ళు

"నీ సలహా బాగానే వుంది వదినా, కాని ఆ వస్తువులను తయారుచేసే పద్ధతులు తెలియకపోవడంచేత, చేయవలెననే ఆసక్తి వున్నా ఉపయోగం లేకుండా వుంది. పోనీ తయారుచేస్తున్నవారి నెవరినైనా అడిగి తెలుసుకుందామంటే, వారు దానిని వ్యాపార రహస్యంగా కాపాడుకుంటున్నారు?"

"ఆమాటా నిజమే. కాని ఉత్సాహంతో నేర్చుకుంటామంటే చెప్పేవారు లేకపోలేదు. ఇంక వ్యాపార రహస్యంగా దాచుకుంటున్నారంటావు. వ్యాపారస్థులు ఎప్పుడూ దాచుకుంటారు. వారి నడగడం తెలివితక్కువ. ఇంతకీ, నీకు శ్రద్ధవుందా? నేను ఎట్లా చెయ్యాలో చెబుతాను."

"నువ్వు నేర్పుతానంటే, వద్దంటానా? శ్రద్ధగా నేర్చుకుని తప్పకుండా తయారు చేస్తా."

"అయితే విను. మన ప్రాంతాలలో పండే పచ్చజొన్నలతో మాల్టు తయారుచేసే పద్ధతి చెబుతాను. ఈ జొన్నలతో మాల్టు చేసి చక్కని డబ్బాలలోపోసి బోలెడు డబ్బు సంపాదిస్తున్నారు."

"ఈ మాల్టును ఏంచేస్తారు వొదినా!"

"ఉదయం కాఫీ, టీలకు బదులు వాడుకోవచ్చు. పిల్లలకు, జబ్బుపడిలేచిన వారికి బలవర్ధకమైన ఆహారం"

"ఇది తయారుచేయటానికి ఏయే వస్తువులు కావాలి?"

"పచ్చజొన్నలు చాలు. ఇంకేవస్తువులూ అక్కర్లేదు. జొన్నలు పుచ్చు లేకుండా చూచి, మంచివి తెచ్చుకుని రాళ్లు, మన్ను లేకుండా బాగు చెయ్యాలి. ఒక వెడల్పు మూతి గల కుండలో ఈ జొన్నలు వుంచి, మంచినీళ్లుపోసి 24 గంటలు - అంటే ఒక రాత్రి ఒక పగలు-పూర్తిగా నానబెట్టాలి. ఈ 24 గంటలలోనూ కుండలో పోసిన నీళ్ళను 4 గంటల కొకమారు తీసిపారబోసి, తిరిగి మంచినీళ్లు పోస్తూ వుండాలి."

"సరి, 24 గంటలు నానితే జొన్నలు మెత్తపడతాయా?"

"పూర్తిగా మెత్తపడకపోయినా, కొద్దిగానైనా మెత్తపడతాయి"

"ఆ నానిన జొన్నల్ని ఏమి చెయ్యాలి?"

"వాటిని ఒక చాపమీద పోసి పైన తెల్లటి గుడ్డ ఒకటి తడిపి పరిచి, దానిమీద ప్రతి రెండు గంటలకు ఒకమాటు మంచినీళ్లు చల్లుతూ వుండాలి"

"ఆ మాదిరిగా ఎన్ని గంటలు వుంచాలి?"

"24 గంటలనుంచి 42 గంటలలోగా చాపమీద పోసిన జొన్నలు మొలకలెత్తడం మొదలుపెట్టి పెరగడం కూడా ప్రారంభిస్తాయి"

"ఆ మొక్కలు పెద్దవై పోయేవరకూ వుంచాలా?"

"అక్కరలేదు. మొక్క ముప్పాతిక అంగుళం పొడుగు ఎదిగేవరకూ వుంచాలి."

"ఊఁ. తరువాత?"

"తరువాత గింజలమీద పరిచిన గుడ్డ తీసివేసి మొక్కలతో వున్న ఆ జొన్నలను చాపమీద ఆరబోసి, నీడలో ఒక రోజు వుంచాలి రెండవ రోజున ఆ చాప ఎండలో పెట్టి, గింజ బాగా గట్టిపడే లాగున ఎండబెట్టాలి"

"ఆ గింజలలో మొలిచిన మొక్కలు ఇంకా పెరుగుతూనే వుంటాయా?"

"ఎండలో పెట్టగానే, మొక్కలు చచ్చిపోయి, గింజలతోపాటు ఎండిపోతాయి."

"తరువాత ఏం చెయ్యాలి?"

గింజలు బాగా ఎండి గట్టిపడిన తరువాత, రోటిలోపోసి, దంపి, చెరిగితే గింజలలో వున్న మొక్కలు, పొట్టు మొదలైనవి అన్నీ పోయి, పరిశుభ్రంగా వుంటాయి. ఒక్క విషయం. చెరిగిన తర్వాత, గింజలో ఒక మొక్క గాని, దాని తాలూకు ఏ పదార్థం గాని వుండకూడదు."

"వుంటే ఏమౌతుందంటావు?"

"మాల్టు చేదుగా వుంటుంది"

"తరువాత ఆ గింజల్ని ఏం చెయ్యాలి?"

"ఒక ఇనపభాండీ పొయ్యిమీదవుంచి, అందులో చెరిగి సిద్ధంగా వున్న జొన్నలు కొద్ది కొద్దిగాపోసి కమ్మని వాసన వచ్చేవరకు వేయించాలి కమ్మని వాసన రాగానే, పొయ్యిమీదనుంచి దింపాలిసుమా. దింపక అట్లా వుంచితే గింజలు మాడిపోయి, మాల్టు చేదుగా వుంటుంది. గింజలు అన్నీ వేయించిన తరువాత వాటిని రోటిలో పోసి, మెత్తగా పొడుం అయ్యేవరకు దంపి, తరు

## సీత కాదలచినా, శూర్పణఖ కాదలచినా

### అంతా మన చేతిలోనే వుంది!

# సంతోషమే సగం అందం



అందం అనేటటువంటిది అందరి అధీనం లోను అందుబాటులోనూ వున్నటువంటిది. కేవలం శరీరసౌష్ఠవం ఉన్నవాళ్లు, మొహం బాగా ఉన్నవాళ్లు, పచ్చని ఛాయ కలిగినవాళ్లు—వీళ్లే అందమైనవారనుకోవటం పొరపాటు. అందం, అంటే కన్ను ముక్కు తీరు మాడచక్కగా ఉండటం ఒక్కటే కాదు.

వికాసం అనేది అందాన్ని మించినది. ఒకసారి పేరుగాంచిన ఒకాయనకి ఒక పార్టీలో ఒక యువతితో పరిచయం అయింది. ఆమెతో ఆమాటా ఈమాటా మాటాడుతూ ఉండగా రెండుగంటలు తెలియకుండా గడచిపోయాయి. తరువాత ఆమెను గురించి తన స్నేహితునితో చెబుతూ, "చార్మింగ్ లేడీ" (చాలా ఆకర్షణీయమైన యువతి) అన్నారట. ఇంటికి వచ్చాక ఆమెను గురించి ఆలోచిస్తే, ఆయనకు ఒక విషయం చాలా ఆశ్చర్యం కలిగించిందట. ఆమె అమోఘమైన సౌందర్యవతి కాదట. ఆమెలో అందానికి కావలసిన పడికట్టురాళ్లు తూకపు సరకులు ఏమీ కనుపించలేదు. మాటవరసకి ఛాయ ఏమీ ఎక్కువ కాదు. ముక్కు నవ్వుపువ్వులా లేనేలేదు. గటిగా చూస్తే కొంచం పెద్దది కూడా. కళ్లకి కమలాలకి ఎక్కడా పోలికే లేదు. పైగా పలువరస చూస్తే ముత్యాల సరం గుర్తుకిరాలేదు. కొంచెం ఎగుడు దిగుడుగా కూడా ఉన్నాయట. అయితే ఇవన్నీ, ఆమె వినయం, వందనం వల్ల, ఆమె ముఖవికాసం ముందు, సూర్యుని ముందు నక్షత్రములలాగు ఎక్కడా కంటికి కనుపించకుండా పోయాయట. ఆమెలో వున్న నమ్రత, ఎదుటమనిషి చెప్పే విషయంమీద కనుపరచే ఉత్సాహము సానుభూతి, మానవస్వభావములో మంచి అనేది ఎక్కువగా వుంటుందనే ఒకనమ్మకం, యివి ఆమెముఖానికి కళా కాంతి ఇచ్చాయి; వికాసవంతం చేశాయి.

కొందరు కొందరు యెవరితోటి అయినా మాట్లాడేటప్పుడు, ఎదుటమనిషి ఏమైనా చెప్పడానికి అసలు వీలు ఇవ్వరు. ఎంతసేపు తమ సొంతవిషయాలే చెప్తారు. తమ గొప్ప, తమ అభిప్రాయాలు ఇలాంటివి అన్నమాట. ఇలాకాకుండా ఎదటిమనిషిని గౌరవించాలి. వారు చెప్పేమాటలు సాంతం వినాలి. ఇవి మంచిగుణాలు ఇటువంటివే అందానికి, అంటే అసలైన అందానికి లక్షణాలు.

ఆత్మవికాసం, సూర్యరశ్మిలాంటిది ఇది వెలుగుతున్నంతసేపు, ఇతర శారీరక లోపాలన్నీ కప్పడిపోతాయి. ఎప్పుడైతే ఈవికాసం అంతరిస్తుందో, అప్పుడు చీకటిలో నక్షత్రాలలాగ ఒక్కొక్కలోపము కొట్టవచ్చినట్లు కనుపిస్తుంది.

మనిషికి అందాన్ని ఇచ్చే గుణాలు చాలా ఉన్నాయి చిరునవ్వు వుందే, దీనికున్న విలువ, శక్తి అపరిమితమైనవి. అందమైన ముఖముకలిగి, ప్రతినిముషము గుసగుసలాడుతూ, కనుబొమ్మలు ముడిచి కళ్లు చిట్లించుకునే వాలకముకల మనిషి ఎవ్వరినీ ఆకర్షించదు సరికదా, ఆమె కను ముక్కు తీరు అందంకూడా కనుపించదు. మొత్తముమీద అందవికారికి ఉండే లక్షణాలు ఆమెకి సంప్రాప్తిస్తాయి.

ఒక శ్రీమంతుడికి ఇద్దరు ఆడపిల్లలు ఉండేవారట. పెద్దమ్మాయి చాలా అందమైనది. చిన్న అమ్మాయికి అందం లేదు. తల్లిదండ్రులు, చిన్న అమ్మాయి విషయంలో చాలా కించపడుతూ వుండేవారు.

పెద్దమ్మాయికి తను అందమైనదని తెలుసు. తన అందంవల్ల తను యితరులను అడుగకుండానే తనకు కావలసిన పనులు జరుగుతాయి అన్న ఒక ధీమా వుండేది. దాంతో మనుష్యులను లెక్క చేసేదికాదు. తనకంటే అందమైనవారు లేరన్న ఒక

**టంగుటూరి సూర్యకుమారి**

[సుప్రసిద్ధ సినిమా నటి]

## వదినా, మరదళ్లగోష్ఠి

వాటి దానిని సన్నని జల్లెడతో జల్లించాలి. అప్పటికి మాల్టు తయారైందన్నమాట."

"ఈ మాల్టుని ఏవిధంగా వాడుకుంటారు?"

"ఇది చాల బలవర్ధకంగా వుండి, తేలికగా జీర్ణమౌతుంది. దీనిని కాగబెట్టిన పాలలో వేసి కొద్దిగా పంచదారకూడా చేర్చి కాఫీ, టీలకు బదులుగా వాడుకోవచ్చు"

"నీ సలహా చాలా బాగుందివదినా - తీరిక సమయంలో మనం అదిచేసుకుందామమ్మా"



# ★ సంతోషమే సగం అందం ★

గర్వముండేది. అందం వుండుటవల్ల మనుష్యులు ఆ అమ్మాయి చుట్టూ చేరేవారు.

చిన్న అమ్మాయి మనసు చాలామంచిది. అందంలేదని తెలుసు. అందువల్ల తనగురించి ఎక్కువ ఆలోచన మానివేసింది. ఇతరుల యందు ఎక్కువ సానుభూతి చూపుతుండేది. ఎప్పుడూ చిరునవ్వుగల ముఖముతో ఎవరికి ఏచిన్న సహాయము చేయకలుగుతానా అని ఎప్పుడూ చూసోవుండేది. దయ, సానుభూతి, సహాయం చేసేగుణం ఇవివుండుట వల్ల, చుట్టపక్కాలు, ఇరుగు పొరుగులు ఈ అమ్మాయి చుట్టూ చేరేవారు. అభిమానము చూపేవారు అది మొహమాటానికి చూపే అభిమానం కాదు. నిజమయినది; నిలకడ అయినది

పెద్దమ్మాయికి తనకంటె అందమైనవారని చూసినప్పుడల్లా అసూయ బయలుదేరేది. మాటవరుసకి ప్రపంచంలో అందం వున్నవాళ్లు ఒకళ్లకంటే ఎక్కువ వుండకుండా పోరుచూడండి. ఆఖరికి తన చెల్లెలిని ఎవరు మంచిదని పొగడినా కూడా చాలా అసూయపడేది. ఈ తలంపులతో తన మీద నుంచి దృష్టి యితరులమీదికిగాని, తనచుట్టూ వున్న అందమైన దృశ్యాల మీద గాని పోనిచ్చేది కాదు. దాంతో ముఖముమీద చిరునవ్వు పూర్తిగా పోయింది. కళ్లచుట్టూ నల్లటి మచ్చలు ఏర్పడ్డాయి

పెద్దమ్మాయి పెళ్లి చూపులకు, పెళ్ళికొడుకు తలితండ్రులు అంతా తరలివచ్చారు. అమ్మాయి చాలా అందమైనదని అప్పటికప్పుడే తెలియుటవల్ల, వారి రాక కూడా పూరికే నామ్‌కే వాస్తే అనే కబురు తెలిసింది. అన్ని విషయాలు ముందే మాట్లాడుకోవడమై పోయింది, అంతా నిశ్చయమైపోయినట్లే లెఖ్ఖ.

పెళ్లివారికి, కాఫీ ఫలహారములు చిన్నమ్మాయి అందించింది. అక్కకి పెళ్ళివారు వచ్చారన్న ఉత్సాహంతో, ఆ అత్తగారికి, మావగారికి, కాబోయే బావగారికి, అందరికీ ఒక చిరునవ్వు పారేసింది. మావగారు కళ్ళజోడుకోసం వెతుకుతూ వుంటే, చెయ్యికడుగుకోవడానికి స్నానాలగదిలోకి వెళ్ళినప్పుడు అక్కడ పెట్టారేమోనని అక్కడకు వెళ్ళి వెతికి కళ్లజోడు పట్టుకవచ్చి యిచ్చింది. ఎంతో ఒదిక వందనం అయినపిల్ల అన్నారు అబ్బాయి తలిదండ్రులు. అంతా తరలి వెళ్ళిపోయారు, ముహూర్తము గురించి వ్రాస్తామని. సరే రెండురోజులు పోయాక ఉత్తరము వచ్చింది

"అబ్బాయికి చిన్నమ్మాయి నచ్చింది కాబట్టి పెద్దమ్మాయికి సంబంధం కుదిరేదాకా ఆగుతాము, తరువాతే చేయవచ్చు" అని వ్రాశారు!

ప్రతి వ్యక్తికి భగవంతుడు ఇచ్చిన కానుకలు వున్నాయో, చెప్పలేము కాని ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్కటైనా ఆకర్షణీయమైన గుణం వుండి తీరుతుంది.

ఎప్పుడూ, మనలో ఉన్న లోపాలను లెక్కించుకుంటూ ఉండడం, మన గొప్పని గురించి తలపోసుకుంటూ ఉండడం కంటే, నలుగురి మధ్యకు వెళ్ళేటప్పుడు మన స్వంత విషయాలు కొంతసేపు అయినా మర్చిపోవాలి. భగవంతుడు ప్రసాదించిన "మంచి" అనే గుణం మనలో ఎంతో ఉంది. దానిని ఎంత వరకు మనము ఇతరులకు ఇవ్వకలుగుతాము? అని ఆలోచిస్తే అది మనిషికి గొప్ప వ్యక్తిత్వాన్ని, కాంతిని ఇస్తుంది. ఆత్మవికాసానికి ఇదొక విధానం.



తణుకు తాలూకా సత్యవాడ పంచాయతీ అధ్యక్షులుగా ఎన్నిక అయిన శ్రీమతి పెన్మెత్స సూర్యకాంతమ్మ. ఈమె స్వర్గీయ ఇందుకూరి సుబ్బరాజుగారి పుత్రిక

మంచి తలంపులు, ఇతరుల చెడుగు కోరకపోవడం, ఇతరులు బాగుపడినపుడు వారికి శుభాలు జరిగినపుడు సంతోషం పొందడం, ఇవి అందానికి ఆయువుపట్టులు చూడండి ఒక మంచి తలంపు వచ్చినప్పుడు మనకు తెలియకుండానే మన ముఖము వికసిస్తుంది. అప్పుడు గనుక అద్దంలో చూసుకుంటే, "మనముకూడా పరవాలేదు. చూడదగ్గవాళ్ళలోకి చేరుతాము" అనిపిస్తుంది! అలాగే, ఒకరిని నమిలి మింగేయాలని తోచినప్పుడు గనుక అద్దంలో ముఖము చూసుకుంటే, ఎంత అందమైన వాళ్లైనాసరే ముడతలుబడిన ముఖముతో చాలా అసహ్యంగా కనిపిస్తారు. వేరే శూర్పణఖలను రావణాసురుళ్ళను చూడనక్కరలేదు.

సీతల మవుదామన్నా శూర్పణఖల మవుదామన్నా, రాములవారి మవుదామన్నా రావణాసురుల మవుదామన్నా అంతా మనచేతిలోనే ఉందంటే నమ్మండి భగవంతుడు మనకి ఆ శక్తిని యిచ్చాడు. కాని మనము అది గుర్తించలేము. సునాయాసంగా ఏది లభిస్తే దానినే కోరుతాము. గాని కష్టతరంగా కొంత ప్రయాసపడి పొందవలసినటువంటి వాటిని అంతగా ఆశించము. రెడీమేడ్ గా అందాన్ని భగవంతుడు ప్రసాదిస్తే దానిని చూసి మురిసిపోతామే గాని, మనలోనున్న స్వభావాన్ని మార్చుకుని దానివలన కలిగే ఆనందాన్ని, అందాన్ని పొందాలంటే, నిజమైన దృఢమైన నమ్మకం, నిశ్చయము కావాలి గని ఫలితాలు శాశ్వతమైనవి

మనోవికాసాన్ని, అందాన్ని చంపే గొప్ప దుర్గుణ మొకటివుంది-అసూయ. మానవులం. కాబట్టి ఇది ఎప్పటికప్పుడు యితర దుర్గుణాలలాగే తలఎత్తుతూ ఉంటుంది, ఎప్పటి కప్పుడు చంపివేసినా సరే. ప్రతిదినము స్నానము చేసినట్లుగా మొక్కలమధ్య గోజా మొలిచే కలుపును ఎప్పటికప్పుడు పీకి వేసినట్టుగా, మనస్సుని ఎప్పటికప్పుడు శుభ్రపరుస్తూ వుండాలి ఇది కష్టమైన పనికాదు. అభ్యాసము కూసువిద్య అంటారు. అలవాటుమానవునికి పుట్టుకతో వచ్చిన లక్షణము. ఒకసారి గనుక ప్రారంభం చేస్తే, దాని అంతటఅదే తరువాత యంత్రములాగ నడచిపోతుంది. అప్పుడు మనిషి సుగుణాల పుట్ట అయిపోకపోయినా సుగుణాలు ఎక్కువ అబ్బుతాయి దుర్గుణాలకన్న వాటిదే ఎక్కువ బలం అవుతుంది.

అసలు అసూయ పడటానికి మానవునికి అగత్యం లేదు. అందమైన వాళ్లు ప్రపంచంలో చాలామంది వున్నారు.

ఒక అమ్మాయి అందంగా ఉంటుంది. ఇంకో అమ్మాయి చాలా అందంగా ఉంటుంది. మరో అమ్మాయి అంతకన్న అందంగా ఉంటుంది. ఇలా ప్రపంచం అంతటా శారీరకమైన అందంలో అంతసులు ఉండవచ్చు ఉంటాయి; అయితే, ఒకరికి ఉండే వ్యక్తిత్వం, ఆకర్షణ, ప్రత్యేకత ఇంకొకరికి ఉండవు. ఎవరిమంచి లక్షణాలు వారివే కాబట్టి ఎవరిస్థానంలో వాళ్ళే గొప్పవాళ్ళు. వాళ్లనిమించినవాళ్ళు ఉండరు. అందుచేత అసూయకి చోటు ఎక్కడ?

ఉద్యోగాలలో, డబ్బు, కుటుంబప్రతిష్ఠ, మొదలైనవాటిలో ఈఅసూయ బాగా కనబడుతుంది. లేని చోటకి చొచ్చుకువెళ్తుంది. దీన్ని, ఈ జాతి దుర్గుణాలనూ ఎంతదూరంగా ఉంచితే అంత అందంగా ఉంటాము. ఈ అందం నిజమైనది. స్థిరమైనది. ★

# మహాత్ముని దివ్యవాణి

# ★ భారతనారి ఆదర్శం ★

## ఇల్లిందల సరస్వతీదేవి

"నేను స్త్రీగా జన్మించినట్లయితే, స్త్రీ పురుషుని చేతిలో ఆటబొమ్మ అనే భావాన్ని ప్రతిఘటించటానికి గాను ఒక ఉద్యమాన్ని లేవదీసేవాడిని. స్త్రీ హృదయాన్ని తెలుసుకోటానికి నేను మానసికంగా స్త్రీగా మారిపోయాను. నా పూర్వపు ప్రవర్తనను మార్చుకొని, పెనిమిటిగా ఆమె పైన నాకున్న అధికారాల నన్నింటిని వదలుకొన్న తరవాత గాని, నేను నా భార్య హృదయాన్ని తెలుసుకోలేక పోయాను. ఆమె ఆభరణాలతో గాని, అలంకార ద్రవ్యాలతో గాని సౌందర్య పోషణ చేసుకోదు. నిరాడంబరంగా ఉంటుంది. స్త్రీజాతి అంతా ఈవిధంగానే ఉండాలని నా కోరిక. పురుషులకు బానిసలవటానికి స్త్రీలు సమ్మతించవద్దు; స్త్రీలు తమ చలచిత్తాలకు కూడా బానిసలు కారాదు. స్త్రీలు కృత్రిమ పదార్థాలతో అలంకరించుకోవటం అవ్యక్తం. అత్తరు, లెవెండరులను ఉపయోగించి, సువాసనలను వ్యాపింపచేయాలని ఆశించవద్దు. నా స్వతమైన పరిమళ ద్రవ్యం హృదయాంతర్గతమయినది—స్త్రీలు దానిని ఆశించవలెనని, నా అభీష్టం. దానితో ఒక పురుషుడినే కాదు; మానవజాతినంతనూ వశపరచుకొనవచ్చు. ఈవిధమైన వశీకరణం స్త్రీల జన్మహక్కు. ఈ స్వత్వాన్ని పొందటానికి స్త్రీలు కృషి చేసి కృతకృత్యురాండ్రు కావాలి.

"మోహకారకురాలినన్న భావం స్త్రీలో పూర్తిగా నశించాలి. ఇది స్త్రీ చేతిలో ఉన్నపనే. పురుషుడితో సమానాధికారాలు కోరినటయితే, స్త్రీ ఇతరుల కోసం పెనిమిటి కోసమైనా సరే—అలంకరించుకోవటం మానివేస్తుంది. సీత తన భౌతిక సౌందర్యంచేత రాముడిని ఆకర్షించాలన్న ఉద్దేశ్యంతో ఒక క్షణమైనా గడిపి ఉండదనుకొంటాను.

"పురుషుడు చేసినవాటన్నిటిలోకి భార్యను హింసించడమే ఘోరపాపంగా నాకు తోస్తుంది. ఒక భార్యనే కాదు; మానవజాతి నంతనూ హింసించినట్లుగా నా మనసు ఖేదపడుతుంది. స్త్రీ పురుషులలో స్త్రీజాతే ఉత్తమమైనది. ఈ నాడు స్త్రీజాతి క్షీణదశలో ఉన్నప్పటికీ స్త్రీ త్యాగమయి, సహనశీల!

"టాల్‌స్టాయ్ చెప్పినట్లు పురుషుడికి వశీభూతురాలయి స్త్రీ జీవిస్తున్నది. ఆమె తన సహజశక్తులను తెలిసికొనగలిగితే, స్త్రీజాతికే కాదు, మానవజాతికంతటికీ దాస్య విమోచనం కలిగించగల శక్తివంతురాలు.

స్త్రీలను బలహీనలనటం మహాఘోరం. ఈ విశాలవిశ్వంలో భుజబలమే బలంగా విశ్వసింపబడినటయితే, ఆమె పశుబలంలేని అబల. ఆ బలాన్ని నైతికదృష్టితో పరిగణించినట్లయితే, పురుషునికంటే స్త్రీయే బలవంతురాలు. అహింసా సిద్ధాంతమే మానవజాతినుద్ధరించగలదయితే, జాతి భవిష్యం స్త్రీ చేతిలోనే ఉన్నది. ఆమెకుగల ఆత్మప్రేరణ ప్రవృత్తి, త్యాగశక్తి, ధైర్యం, పాపభీతి గొప్పప్రభావం కలవి. ఈ లోకంలో ఎవటె వారి మనసును కరగించగల శక్తి ఆమె పలుకులలో తప్ప—వేనిలో ఉన్నది!

జీవితంలో మతసంబంధమయిన ఆచారాలను, సంప్రదాయాలను స్త్రీలు వదలుకోలేరు. వారు సనాతనాచార పరాయణలు. స్త్రీలు పూర్వాచారాలను వదలుకోవటంలో వెనుకబడినట్టే, జీవితంలో ఉదాత్తతను పావిత్ర్యాన్ని వదలుకోవటంలో కూడా వెనుకబడినవారే!

స్త్రీల స్వత్వాలను గురించి నేను ఎవరితోనూ ఏకీభవించలేను. నా దృష్టిలో ఆమె తన నైతికబలంతో మానవకోటికే స్వత్వాలను పోరాడి సమకూర్చగల శక్తివంతురాలు. తన జాతిని తాను రక్షించుకోగలదు.

నేను స్త్రీకి తగినవిద్య గరపవలెనన్న మతంలోనివాడిని. కాని పురుషుడిని అనుకరించి, అతడితో పందెపు పరుగులను తీయవలెనని పోటీపడి, స్త్రీలోకాన్ని ఉద్ధరించగలదన్న విశ్వాసం నాకులేదు. ఆమె పోటీచేసి పరుగుతీయగల సమర్థురాలు. కాని, పురుషుననుసరించి స్త్రీ ఔన్నత్యాన్ని, ఉత్తమాదర్శాలను అందుకోలేదు. స్త్రీ పురుషులు ఒకరినొకరు అనుకరించ తగనివారు; విభిన్నశక్తులు. విభిన్న బాధ్యతలు గల వ్యక్తులు ఉభయాకారాలు ఒకదానినొకటి అనుకరిస్తే రుచిగలేమిటి?

"రాజకీయ రంగంలో స్త్రీలను ప్రవేశపెట్టే సాంసారిక విధులనుండీ వారి కర్తవ్యా



బాపూజీ
జయంతి అక్టోబరు 2.

# చోళీ, దాని పరిణామాలు

కంటికి నదరుగా ఉండే మంచి మంచి డిజైనన్నీ ఇప్పుడు చేనేత, ఖద్దరు గుడ్డల మీద చాలా వస్తున్నాయి. చేనేత చోళీ పీసెస్ మరీ బాగుంటున్నాయి. ముఖ్యంగా చేనేత వస్త్రాలంటే అమెరికాలో చాలా మంది ముచ్చట పడుతున్నారట. మద్రాస్ హాండ్‌కర్చిఫ్ అనేరకాన్ని అక్కడ చాలా మంది స్కార్ఫ్‌లు కుట్టించుకుంటున్నారు.

ఇలా ఇంకో దేశంలో వాళ్లకి యిది ఫాషన్ అయిపోగానే, పనిలో పని కొంచెం దేశభక్తి కలిసివస్తుందన్న కారణం వల్లా, ముఖ్యంగా సూక్ష్మంలో మోక్షం అన్నట్టు చౌకలో ఫాషన్ కుదరటంవల్లా మనదేశములో కూడా చాలామంది కొనడం మొదలుపెట్టారు. అన్నిటికన్న ముఖ్యకారణం అవి బాగా ఉండడం. నామట్టుకు నేను ముఖ్యంగా ఈ చివర కారణంవల్ల కొంటున్నానని నా అభిప్రాయం. మా అన్నయ్య 'కొయ్ కొయ్' అని హేళన చేస్తాడు. నిజంగా బాగుంటే, ఒక్కటో రెండో కొని ఊరుకోవడమేం? ఒక డజను కొనకపోయావా అంటాడు, బలే ఇంటెలిజెంట్ గా.

## నా ఊహలు

కాని అది తప్పు అని నా అభిప్రాయం. ఈ ప్రపంచంలో ఏదేనాసరే, ఎంత బాగున్నాసరే వేలం వెర్రిగా కొనెయ్య కూడదు. అలా కొనడం ఆబ అన్నమాట. యావ అన్నమాట కూడా. ముఖ్యంగా దబ్బు దబ్బున మారిపోయే ఫాషన్ల విషయంలో ఎవరికీ తీసిపోకుండా ఉండాలంటే ఈ విషయంలో జాగ్రత్త అవసరం. ఒకరకం చోళీ గుడ్డగాని, ఒకరకం చీర పమిటంచుగాని బాగుందని అదేరకంలో రంగు రంగులవి చాలా ఏరి కొని అట్టేపెట్టుకోడం మంచిది కాదు. నిన్న ఆర్గండీ జాకెట్ ఫాషన్ అయితే, ఇవాళ జాస్మిన్ సిల్కు, చేనేత చోళీ కొత్తగా కనబడతాయి. చేనేతలోనే రేపు కొత్త డిజైన్లు, కొత్త రకాలూ బోలెడు వస్తాయి. ఫాషన్లు మారినప్పుడల్లా మనం ఉన్న బట్టలన్నీ వీధిలో పారేస్తున్నామని కాదు. అలా చెయ్యమని ఎవరూ అనరు. నామటుకు నేను అలా పారెయ్యను కూడా.

## నాన్నగారి భావాలు

ముఖ్యంగా మా నాన్నగారు ఒప్పుకోరు. ఒకవేళ నాకలాటి ఐడియా వచ్చినా, జీతం కొంచెం పెరగనీ తల్లి అలాగే చేద్దుగాని అంటారు నాన్నగారు. ఆమధ్య యుద్ధం పూర్తి అయిన తరువాతి రోజుల్లో 'పారాషూట్' గుడ్డలు బజార్లోకి వచ్చాయి. రంగు రంగులవి. అపళంగా ఆడపిల్లలూ, మొగపిల్లలూ, కొందరు పెద్దవాళ్లు కూడా గజం రెండో మూడో పెట్టి, వాటిని విరగబడి కొనేశారు. డజన్లకొద్దీ, చొక్కాలూ, చోళీలూ కుట్టించేసుకున్నారు. అవి పల్చగా లేకపోయినా, ఉల్లిపొర కాగితంలా ట్రాన్స్‌పెరెంట్‌వి కాబట్టి దానికోసం, అప్పటికి పాత ఫాషన్ అయిన వలబనీన్లను కొందరు పునరుద్ధరించారు. రెండు మూడు నెలలు తిరిగేసరికి, ఊరందరికీ మొహం మొత్తిపోయింది. ఎవళ్ల ఒంటిన చూచినా ఇవే అంతలోనే ఓ పుకారు బయల్దేరింది. ఆ పారాషూట్ చొక్కాలు మంచివి కావనీ వాటిలోంచి సూర్యకిరణాలు మన శరీరాలమీద పడితే మంచిది కాదనీని. ఇదంతా సైన్సు ప్రకారం ఎంతనిజమో నాకు తెలీదుగాని, ఇంకో రెణ్ణెలు తిరిగేసరికి అవి ఔట్ ఆఫ్ డేట్ అయిపోయాయి. మా అన్నయ్య ఆరు లాల్చీలు కుట్టించుకున్నాడు. అవన్నీ పనికి రాకుండా పోయాయి. అంగువల్ల కొంచెం దూరదృష్టి కావాలని నా అభిప్రాయం.

## నా చిన్నప్పుడు

అసలీ దూరదృష్టి చాలా ముఖ్యం కూడా. ఒక సంగతి చెప్తాను. నా చిన్నప్పుడు మాలపిల్ల చీరలు, తరవాత తరవాత వరవిక్రయం చీరలూ అంటూ అమ్మొచ్చేవి. చీరలవాళ్లు ఆ సినిమాల్లో భానుమతీ వాళ్లు కట్టుకున్న చీరెల మోస్తరు కాపీ చేశారన్నమాట. అప్పుడు, ఆ తరవాత కొన్నాళ్లు అవి పాపులర్. ఇంకోటేమిటంటే, ఆ చీరలు ఎనిమిది గజాలవి. ఒక్కొక్క చీర కొంటే, ఏడుగజాలు చీరకి కేటాయించి మిగతా గజంతోను జాకెట్లు కుట్టించేవారు. ఏ చీరకి ఆరకం జాకెట్టు. అలా ఒక సారిగా డజను కుట్టించుకున్నా ఇబ్బంది ఉండేది కాదు.

ఏ హెల్త్ ఇన్‌స్పెక్టరు గారి భార్యో కూతురో ఒక రకం చీరకి ఇంకో రకం జాకెట్ వేసుకోవడం మొదలు పెట్టిందనుకోండి అప్పుడు అనుసరించ దలచినవాళ్లంతా ఉన్న జతలనే కాస్త మార్చి కొత్త ఫాషనకి రెడీ అయేవాళ్లు. ఇది సిల్లీ అయిడియా అనే

సి. వి. విజయలక్ష్మి

---

## భారతనారి ఆదర్శం

స్నండీ తొలగించి పెడమార్గాన పెట్టుతున్నానని నా మీద అభాండం పడుతున్నది. ప్రతిస్త్రీ తన గృహధర్మనిర్వహణ కొరకే దినమంతా గడుపుతున్నదా? అట్లే గడపవలెనా? ఈ విధమయిన గృహ దాస్య భావం గత మూఢదళ శిథిల శేషాంశమని నా భావం. ఒక గృహనిర్వహణతోనే స్త్రీలు కాలక్షేపం చేయతగరని నాతలంపు.

ప్రతి భారతకన్య వివాహమాడడానికే జన్మించటం లేదు. ఒక పురుషుడికి సేవచేయటానికి మారుగా, ప్రజాసేవకై ఆత్మార్పణం చేయబూనుకోవటం శ్రేష్ఠంకాదా! భారత కన్యలకు పార్వతి పరమలక్ష్యం. ఆమె తన ఆత్మేశ్వరుని ధనరాసులతో సంపాదించలేదు; అమ్ముడుపోలేదు. కళాశాలలో సంపాదించిన బిరుదుపత్రాలతో కాదు; ఎవరూ ఊహింపజాలని అపూర్వ తపశ్చర్య చేత విశ్వేశ్వరుని చేపట్టకలిగినది ఆమె భారత జాత్యంతరిక్షు పథమునందు సత్ సప్తకమున ప్రకాశించు జగదీశ్వరి." ★

"మెండ్ ఆఫ్ ది మహాత్మా" నుంచి.

 కట్రా - బొట్రా 

వాళ్ళు తెలీనివాళ్లు. ముఖ్యంగా మొగాళ్లు అంటారేమో. ఎందుకంటే ఇప్పుడు కూడా ఫేషన్‌లో అప్‌టుడేట్ గా ఉండడానికి ఏదేశం లోనయినా సరే డబ్బుకన్న ముఖ్యమైనకిటుకు నేర్పు అని నా అభిప్రాయం. జరీ అంచు చీర ఒకటి చిరిగిపోతే జరీ అమ్మేసేవాళ్లని చాలామందిని చూశాను. కాని జాగ్రత్తగా చించి ఇంకో చీరకో చోళీకో వాడడం నేర్చుకోవాలి. జరీ అంచుని అలా చోళీ మీద వాడినపుడు మెడనుమీద కుట్టకూడదు. చేత్తో టాకా వేసుకపోతే బాగుంటుంది అంచుల ఫాషన్ పోయి సింపుల్ చోళీ కావాలనుకుంటే టాకా జాగ్రత్తగా ఊడ తియ్యొచ్చు ఇలా ఇటుకో త్రిఫాషనూ వస్తోంది. అటు సరుకు సద్వినియోగమూ అవుతోంది. ఉపాయం బాగా నప్పితే మీరు పటివనోము అందరూ పడతారు.

మొన్న నేను చేనేత చోళీగుడ్డ ఒకటి కొని తెచ్చుకుని సరదాకి, దానిమీదడిజైను కాపీ వేసి, ఆర్గండీ చోళీమీద ఎంబ్రాయిడరీ వేస్తున్నాను. అవతల హాలులో మా అన్నయ్య మరికొందరు పురుషపుంగవులూ ఫాషన్‌ల మీద ముఖ్యంగా ఆడపిల్లల ఫాషన్ మీద హోరాహోరిగా చర్చలు జరిపేస్తున్నారు.

"ఇవల్యూషన్ ఆఫ్ ది చోళీ" అనే విషయం (చోళీఫాషన్లలో పరిణామాలు) మీద వాదం జరుగుతోంది. మాఅన్నయ్య అడపా దడపా లోపలికి పరుగెట్టుకు వచ్చి బుట్ట జాకెట్‌ల తరవాత లైనుజాకెట్లు వచ్చాయా, వీటికి ముందు అవా అని సందేహాలడిగి తెల్సుకుని వెళ్ళి అవతల తన అభిప్రాయాలు చెప్పేస్తున్నాడు.

## ఒక్క ముక్కలో…

అంతలో ఒక కొత్త కంఠం వినబడింది. ఆ అబ్బాయి నాకు తెలుసు. అతని పేరు రావు చిన్నప్పుడు క్లాస్ మేట్. ఏమిటి చోళీల గురించి తీరికగా మాట్లాడుతున్నారు మొత్తం పేరంటాలూ అన్నాడు హేళనగా.

అబ్బే బటాణీల గురించి, నీ తలకాయ గురించిని అంటున్నాడు అన్నయ్య హేళనగా. రావు అంతకన్న హేళనగా నవ్వాడు. తరవాత ఏడిశారు అన్నాడు. ఇంకోక్షణం మాటలు వినబడలేదు. చోళీల గురించి ఇంత డిస్కషన్ ఎందుకోయ్ ఒక్క ముక్కలో చెప్పవా అన్నాడు రావు. చెప్పమని ఎవరి కంఠమూ వినిపించలేదు. ఒద్దని కూడా ఎవరూ అన్నట్లు లేదు. అందుకని రావు చెప్పేశాడు.

అతన్ని అడిగితే, బుట్ట జాకెట్లయినా, గొట్టపు చేతుల రవికలయినా, కాలర్ చోళీలయినా ఏమయినా ఎన్ని ఫాషన్‌లు మారినా మువ్వాతిక గజం గుడ్డతోనే గదా ఇదివరకు చేతుల పొడుగు క్రమంగా తగ్గి జంపర్ జాకెట్ల పైమెట్ల (శ్రీమతి విజయలక్ష్మి ఈనాటికీ ధరించేలాంటివి - విజయలక్ష్మి అంటే ఈ సి. వి. విజయలక్ష్మి కాదు. పాకమిషనర్ అని నా అభిప్రాయం) వరకూ వెళ్ళాయి. అప్పుడు జాకెట్ శాల్తీ పొడుగ్గా వదులుగా ఉండేది మొగపిల్లలు చొక్కా టక్ చేసుకున్నట్టే, ఈ జాకెట్లను చీరెకట్టులో టక్ చేసేవారు. మళ్లా కొన్నాళ్ళకి జాకెట్ చేతులు క్రమంగా క్రిందగి దిగడం మొదలు పెట్టాయి. సైనుటేనియస్ గా, అంటే, ఇవిఇలా దిగుతూ పొడుగు అవుతూఉంటే, జాకెట్ శాల్తీ పొట్టి అవుతూ వచ్చింది అంటే ఇదివరకు ఫాషన్ బుల్ గైళ్ళ అప్పలమ్మలు అంటూ హేళన చేసిన రవిక మళ్లా వోగ్‌లోకివచ్చిందన్నమాట. ఎటొచ్చీ రవిక అన్న పాత పేరు పోయి చోళీ అనే కొత్తపేరు వచ్చింది. ఇప్పుడు పొడుగు చేతులు సయిలు. అసలు శాల్తీ ఇది దీనికి కావలసింది మువ్వావు గజం. ఇందులో ఇంక కిటకీలు, తలుపులూ ఎన్నయినా ఏర్పాటు చేసుకోవచ్చు. జరీలు చెమ్కీలు వెయ్యొచ్చు. తాళ్లు తక్కులు తగిలించవచ్చు.

ఈ గంభీరోపన్యాసంలో, ఆ పిల్లాడి తెలివితేటలు, చమత్కారాలు, హేళనా మినహాయించినా, కొంతవరకూ పాయింటు ఉందని ఒప్పుకోక తప్పదు. అయినప్పటికీ మా అన్నయ్య నా అభిప్రాయం కోసం లోపలికి రాగానే, శుద్ధ దండుగ మారి సిద్ధాంతం ఎందుకొచ్చిన గోల మీకు అని చివాట్లేశాను. ఇలా అనవసరంగా అతి తెలివిగా మాట్లాడేవాళ్ళని చూస్తే నాకు ఒళ్లు మంట. మనం ఎప్పుడూ మితి తెలిసి మాట్లాడాలని నా అభిప్రాయం. ఒకసారి నేను ఇలాగే ఫూల్ అయ్యాను. నేను స్కూలు ఫైనల్ చదువుకుంటున్నపుడు వార్షికోత్సవానికి నాటకాలూ అవీ వేశారు. అప్పుడు మా క్లాస్ మేట్లలో ఓపిల్లాడు, ఆఏర్పాటన్నీ తను చేస్తానని సిద్ధపడ్డాడు. అలా అన్న వాడు మర్నాడే మా యింటికొచ్చేశాడు. ఆ పళంగా వచ్చేసి, ఏమండీ స్టేజికి కర్టెన్లూ అవీ అన్నీ వున్నాయి కాని, సైడ్ కర్టెన్ లకి ఏమీ దొరక లేదండీ అన్నాడు తలవంచుకుని. అతను మంచివాడే అనుకోండి. నాకు ఎందుకనో ఏడిపించ బుద్ధేసింది. ఆడపిల్లలతో మాట్లాడడం అంటే తేలిక కాదని చెప్పాలనిపించింది.

"ఏమిటండీ?" అన్నాను కొంటెగా.

సిటీ బస్సులోకి ఒక లావాటి ఆవిడ ఎక్కింది. ఇద్దరు కూర్చునే సీటులో ఆమె ఇరుక్కుని కూర్చోడంచూసి, ఎదుటి సీటులో కూర్చున్న చిన్న పిల్లడు ఆశ్చర్యంగా నోరు తెరుచుకుని ఆమెకేసే చూస్తున్నాడు. ఆమెకు కోపంవచ్చి "ఏమిటలా, నావేపే చూస్తావబ్బాయ్?" అని అడిగింది.

పిల్లడు భయపడి "లె… లేదండి. ఇంకెక్కడ చూడటానికీ చోటు లేదండి." అన్నాడు.

"సైడ్ కర్టెనండి. సైడ్‌కర్టెన్‌లు వెయ్యటానికి ఏమీ దొరక లేదండి స్టేజికి" అన్నాడు ఓపికగా.

"అయితే నన్నేం చెయ్యమంటారు! వచ్చి నిల్చోమంటారా?" అన్నాను.

ఆ అబ్బాయి తెల్లబోయాడు కాని, కొంచెం, తెలివైనవాడే అవడంవల్ల, మీరే వచ్చి సైడ్‌కర్టెన్‌లానిల్చుంటే, ఇంక నాటకం ఎవరూ చూడరండి అన్నాడు వినయంగా నవ్వుతూ. ఇలా చితుగా ఓడిపోవడం నేను ఎప్పుడూ ఎరగను. భలే సిగ్గేసింది. కోపం కూడా వచ్చింది. కాని, నాదే తప్పు అనుకుని, మళ్లా ఏంకావాలని అడిగాను. అతను అడిగిన ప్రకారం, మా నాన్నగారికి తెలీకుండా, అమ్మకి చెప్పకుండా, పెట్లో చీరెలు ఆరు అతనికిచ్చి పంపించాను. వీటినే ఆరోజున అతడు స్టేజికి సైడ్‌కర్టెన్‌లాగా వాడాడన్నమాట.

తరవాత మా యింట్లో తెలిసింది, నన్ను చివాట్లు పెట్టారు కూడా. అయితే, తప్పు నాదే కనక ఆ ఒక్కసారి జవాబు ఇవ్వకుండా అన్నీ పుచ్చుకున్నా నన్నమాట.



## దాంపత్య రహస్యములు

# సినిమా

## అన్నపూర్ణావారి హిందీ చిత్రం అక్టోబర్‌లో ప్రారంభం

అన్నపూర్ణా పిక్చర్స్‌వారు, ఎ. వి. ఎం. తో కలసి నిర్మించనున్న హిందీ చిత్రానికి ఈ నెలలోనే ప్రారంభోత్సవం జరుగుతుందని తెలుస్తోంది. "దొంగరాముడు" చిత్రం దీనికి ఆధారమన్న విషయం విదితమే. హిందీ చిత్రంలో శ్రీ నాగేశ్వరరావే ప్రధాన భూమిక నిర్వహిస్తారు.

శ్రీ రాజేంద్రకృష్ణ ఈ చిత్రానికి స్క్రిప్ట్ వ్రాస్తున్నారు. నటీనటుల విషయంలో త్వరలోనే తుది నిర్ణయాలు జరుగుతాయి.

హిందీ మార్కెట్‌లో ఈనాటి చిత్రాల నిడివినిబట్టి ఈ చిత్రాన్ని పదమూడు పద్నాలుగు వేల అడుగులకు మించకుండా రూపొందిస్తారు.

అన్నపూర్ణావారు ఇపుడు తెలుగు తమిళ భాషలలో నిర్మిస్తున్న "తోడికోడళ్లు" చిత్రం రెండు వర్షన్‌లు వాహినీస్టుడియోలో చురుకుగా తయారవుతున్నాయి. నూరింట డెబ్భై పాళ్ళవరకూ పూర్తి కావచ్చినట్లు నిర్మాత శ్రీ మధుసూదనరావు చెప్పారు. సంక్రాంతిలోగా రెండు చిత్రాలనూ విడుదల చేయాలనుకుంటున్నట్లు ఆయన తెలియచేశారు.

శరత్ నవల "నిష్కృతి" ఈ చిత్రానికి మాతృక. దీనికి ఆత్రేయ మాటలూ, శ్రీ కొసరాజు పాటలూ వ్రాశారు. సావిత్రి, కన్నాంబ, సూర్యకాంతం, నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, జగ్గయ్య ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు.

* * *

ధనసాయి ఫిలింస్ వారి "భలే బావ" చిత్రాన్ని త్వరలోనే విడుదల చేయడానికి నిర్మాత శ్రీ టి. రంగయ్య చురుకుగా సన్నాహాలు చేస్తున్నారు. వీనస్ స్టుడియోలో నిర్మాణం సాగుతోంది. శ్రీ పబ్నవీస్ రజనీకాంత్ దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో జగ్గయ్య, జానకి, రేలంగి, గిరిజ, గుమ్మడి, సి. ఎస్. ఆర్., చదలవాడ, బాబ్జీ, నల్లరామమూర్తి, సీతారాం, కోటేశ్వరరావు, బాలకృష్ణ, పద్మనాభం, మొదలగువారు పాల్గొంటున్నారు. శ్రీ కొండముది గోపాలరాయశర్మ మాటలూ, శ్రీ అనిసెట్టి సుబ్బారావు పాటలూ వ్రాస్తున్నారు. సంగీతం శ్రీ దక్షిణామూర్తి. ఛాయాగ్రహణం శ్రీ సి. నాగేశ్వరరావు. కళా దర్శకుడు శ్రీ సూరన్న.

* * *

విక్రం ప్రొడక్షన్స్ వారి "భక్తమార్కండేయ" విక్రంస్టుడియోలో తయారవుతోంది. నాగయ్య, పుష్పవల్లి, మాస్టర్ బాబ్జీ పాల్గొంటున్నారు. రచన శ్రీ సముద్రాల రాఘవాచార్య. దర్శకుడు శ్రీ బి. ఎస్. రంగా. ★



మినర్వావారి "సారంగధర" లో శాంతికుమారి, రామారావు.



మినర్వా వారి "సారంగధర" లో భానుమతి.

# త్వరలోనే ఫిలింబోర్డు ఏర్పాటు

1955 వ సంవత్సరానికి ఉత్తమ చలన చిత్రాలుగా ఎన్నిక అయిన వాటికి భారతప్రభుత్వం సెప్టెంబరు 20 వ తేదీన బహుమతులిచ్చి గౌరవించారు. నేషనల్ ఫిజికల్ లేబరేటరీ భవనంలో జరిగిన సభలో, భారతప్రధాని శ్రీ నెహ్రూ ఆయా చిత్ర నిర్మాతలకు బహుమతులు పంచి పెట్టారు.

శ్రీ సత్యజిత్ రాయ్ దర్శకత్వాన, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం నిర్మించిన "పథేర్ పాంచాలీ" అనే బెంగాలీ చిత్రానికి, భారత ఫిలిమ్స్ డివిజన్ వారి "మాజిక్ ఆఫ్ ది మౌంటెన్స్" అనే డాక్యుమెంటరీ చిత్రానికి రాష్ట్రపతి పేరిట సువర్ణ పతకాలిచ్చి సత్కరించారు.

ప్రాంతీయసంఘాల సిఫార్సుల ప్రకారం: తెలుగుచిత్రాలలో వాహినీవారి "బంగారు పాప"కు రజతపతకం, రాగిణీవారి "అర్థాంగి" చిత్రానికి ప్రశంసాపత్రం లభించాయి. ఈ చిత్రాల దర్శకులు శ్రీ బి. ఎన్. రెడ్డి, పి. పుల్లయ్యగారలకు, నిర్మాతలకు, వీటిలో పాల్గొన్న కళాకారులకూ, టెక్నీషియన్లకూ మా అభినందనలు.

పిల్లల చిత్రాలలో ఈ ఏడాది కూడా ప్రధాని సువర్ణపతకం అందుకోతగిన అర్హత గల చిత్రం లేకపోయింది. ఇది బాధాకరమే తప్ప, ఆశ్చర్యకరమైన విషయం మాత్రం కాదు. ఈ ఏడాది అటు బాల చలనచిత్ర సంస్థ, ఇటు కొందరు స్వతంత్ర నిర్మాతలూ తలపెట్టిన ప్రయత్నాల దృష్ట్యా, చతుర్థ బహుమతి ప్రదానోత్సవం నాటికి పిల్లల చిత్రాలు ఉత్తమమైనవి రూపొందగలవని ఆశిస్తున్నాము.

కేంద్ర సమాచార ప్రసార మంత్రి డా॥ బి. వి. కేస్కర్ ఈ సభలో ప్రసంగిస్తూ క్రమంగా మన చలన చిత్రాలలో మంచి చిత్రాల సంఖ్య, స్థాయి కూడా పెరుగుతూ ఉండడం, మన చిత్రాలు విదేశాలలో కూడా గౌరవ పాత్రమవుతూ ఉండడం సంతోషకరమన్నారు. ఇప్పుడు సువర్ణ పతకం అందుకున్న "పథేర్ పాంచాలీ" కాన్సులో ప్రత్యేక బహుమతి పొందుకొన్నదన్నారు.

భారత చలనచిత్ర పరిశ్రమ పురోభివృద్ధికి దోహదంచేసే సంకల్పంతో ప్రభుత్వం "జాతీయ ఫిలింబోర్డు" ఒకటి నెలకొల్పనున్నట్లు మంత్రి డా॥ కేస్కర్ ఈసభలో అధికారికంగా ప్రకటించారు. పార్లమెంటు వచ్చే సమావేశంలో ఇందుకై బిల్లును ప్రవేశపెట్ట దలచినట్లు ఆయన వెల్లడించారు. ఈ బోర్డులో మూడు ప్రధానాంగాలుంటాయి.

1. ఇప్పుడు పని చేస్తున్న సెన్సారు సంఘం.

2. ప్రొడక్షన్ బ్యూరో. ఈ సంఘం, తయారు కానున్న చలన చిత్రాల స్వరూపాలను స్క్రిప్టు దశలోనే పరిశీలించి, నిర్మాతలకు తగువిధంగా సలహాలు ఇస్తుంది

3 ఫిలిం ఇన్‌స్టిట్యూట్. చలనచిత్ర పరిశ్రమలోని వివిధ శాఖల కార్యకలాపాలలో శిక్షణ ఇవ్వడానికి నెలకొల్పే సంస్థ. ఇందులో ఫిలిం లైబ్రరీ, పరిశోధనా కేంద్రం కూడా ఉంటాయి.

ఇవికాక, నిర్మాతలకు ఆర్థిక సహాయం లభ్యం చేయడంకోసం "ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్" పేరిట ఒక పెట్టుబడి సంస్థను నెలకొల్పనున్నట్లు కూడా మంత్రి ప్రకటించారు.

ఇది ప్రస్తుతానికి పాతిక లక్షల పెట్టుబడితో ఏర్పడుతుంది.

(ఈ అంశాలకు సంబంధించిన వివరాలను ఆంధ్ర వార పత్రిక ఇదివరకు పూర్వం ప్రచురించింది.) ★



భాస్కర్ ప్రొడక్షన్స్ వారి "రేపు నీదే"లో రేలంగి.

## బహుమతులు పొందిన చిత్రాలు

1955 లో విడుదల అయిన చిత్రాలలో ఈ క్రిందివాటికి బహుమతులు లభించాయి.

రాష్ట్రపతి సువర్ణపతకం. కథా ప్రధాన చిత్రాలలో బెంగాలీచిత్రం "పథేర్ పాంచాలీ"

డాక్యుమెంటరీలలో ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ వారి "మాజిక్ ఆఫ్ ది మౌంటెన్స్"

ప్రశంస పత్రాలతో అఖిలభారత స్థాయిలో గౌరవం పొందిన చిత్రాలు: "షిర్డిచే శ్రీ సాయిబాబా" (మహారాష్ట్రం) "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" (హిందీ) డాక్యుమెంటరీలు: "వండర్ ఆఫ్ వర్క్" (ఫిలింస్ డివిజన్), "ఎడ్యుకేషన్ ఫర్ లైఫ్" (ఎ. ఎం. ఎ. లిమిటెడ్. బొంబాయి.)

### ప్రాంతీయ భాషాచిత్రాలు

హిందీ: రజితపతకం, "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" (శ్రీ వి. శాంతారాం)

ప్రశంసాపత్రాలు-'దేవదాసు' (శ్రీ బిమల్ రాయ్), 'శ్రీ 420' (రాజ్ కపూర్)

తెలుగు: రజతపతకం-వాహినీ వారి "బంగారుపాప." దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి, రచన శ్రీ పాలగుమ్మి పద్మరాజు. పాల్గొన్నవారు రంగారావు, కృష్ణకుమారి, జగ్గయ్య, జమున.

ప్రశంసాపత్రం-రాగిణీవారి "అర్థాంగి". దర్శకుడు శ్రీ పి. పుల్లయ్య. రచన: ఆచార్య ఆత్రేయ. పాల్గొన్నవారు నాగేశ్వరరావు, సావిత్రి, శాంతకుమారి, గుమ్మడి, జగ్గయ్య.

తమిళంలో రజితపతకం దేనికీ లభించలేదు. "మంగయార్ తిలకం"కు ప్రశంసాపత్రం ఇచ్చి గౌరవించారు. ★

## ఎవరికెవరూ తీసిపోరు

తమిళనటి, నర్తకి అయిన పద్మిని, వి. ఎం. వ్యాస్ నిర్మిస్తున్న "అప్సర" చిత్రంలో నటిస్తోంది. ఒకరోజున షూటింగ్ కు యూనిట్ లో అందరూ సర్వం సిద్ధం చేశారు. పద్మినికూడా సకాలంలో వచ్చింది. అందులో పాల్గొంటున్న నటుడు ప్రదీప్ కుమార్ మాత్రం రాలేదు. అందరూ కాచుకు కూర్చున్నారు. ఐదు గంటలు ఆలస్యంగా వచ్చాడు ప్రదీప్.

రెడీ, లెట్స్ ఆన్ అంటున్నాడు దర్శకుడు.

అప్పటితో పద్మినికి చిరాకు కలిగింది. "ఐదు గంటలసేపు ఆలస్యం చెయ్యతగిన గొప్పతనం ఆయనకుంటే, అమాంతం లేచి వెళ్ళిపోయే గొప్పతనం నాకూ ఉంది" అంటూ పద్మిని లేచి బసకు వెళ్ళిపోయింది.



సెల్వకోటి పిక్చర్స్ వారి "స్వయంప్రభ" లో ఆర్. నాగేశ్వరరావు, సీత, రేలంగి జూనియర్. రేలంగి కుమారుడు పాల్గొంటున్న తొలి చిత్రం ఇదే.

# బొంబాయి సినిమా లేఖ

ప్రసిద్ధ హాలీవుడ్ ఫిలిం డైరెక్టర్ ఫ్రిట్జ్ లాంగ్, 'తాజ్ మహల్' కథను చలన చిత్రంగా నిర్మించ నిశ్చయించారు. ఆయన ఈ పనిపైనే మొన్న బొంబాయి వచ్చారు. సినిమాస్కోప్‌లో, రంగులలో తయారు కానున్న ఈ చిత్రంలో ముంతాజ్ భూమిక ఒక ఆస్ట్రేలియన్ యువతికి ఇస్తారట. ఇతర ప్రముఖ భూమికలన్నీ కూడా విదేశీయ నటీనటులే నిర్వహిస్తారు. కొన్ని చిన్న వేషాలకు భారతీయులను తీసుకోవాలని ఆలోచిస్తున్నారు.

* * * *

ఎం. జి. ఎం. వారి 'భవానీ జంక్షన్' చిత్రానికి భారతదేశంలో ప్రదర్శించడానికి కేంద్ర సెన్సారు సంఘం అనుమతి నిరాకరించింది. లోగడ ఈ చిత్రం నిర్మించడానికి మన దేశంలో వసతులు కల్పించవలసిందని మెట్రో గోల్డ్విన్ మేయర్ వారు కోరడం, ప్రభుత్వం అందుకు నిరాకరించడం విదితమే. అప్పట్లో పాకిస్తాన్ అందుకు సమ్మతించింది. ఈ చిత్రానికి ఆధారం జాన్ మాస్టర్స్ వ్రాసిన నవల. ఇందులో భారతీయ వ్యతిరేకమైన అంశాలు చాలా ఉన్నాయి. స్వాతంత్ర్యసిద్ధికి పూర్వం మన దేశంలో ఆంగ్లో ఇండియన్ల జీవిత విధానాలను రచయిత ఇందులో చిత్రించాడు. ఏవా గార్డ్నర్, స్టివర్ట్ గ్రేంజర్ ఇందులో ప్రధాన భూమికలు నిర్వహించారు. దర్శకుడు జార్జికూకర్.

* * *

కీర్తిశేషుడు బాబూరావు పెయింటర్ భార్యా బిడ్డలు ఆర్థికంగా చాలా ఇబ్బందులు పడుతున్నట్లు తెలియవచ్చింది. భారత చలన చిత్ర పరిశ్రమ మార్గదర్శకులలో బాబురావు అగ్రగణ్యుడు. పెద్ద పెద్ద సెట్‌లు నిర్మించడం మొదలు పెట్టినవాడు ఆయనే. చారిత్రక, సాంఘిక ఇతివృత్తాల చలన చిత్ర పరిశ్రమలోకి తెచ్చిన ఘనుడు బాబురావే. మహారాష్ట్ర చలన చిత్రకారులు చాల మంది ఆయన దగ్గర పనిచేసి, పేర్మి, పెద్దలైనవారే. దర్శక నిర్మాత శ్రీ వి. శాంతారాం మొట్టమొదట ఆయన దగ్గర కొలువుకు కుదిరారు. తరువాత బాబురావు శాంతారాం పట్ల శ్రద్ధవహించి, మంచి శిక్షణ ఇచ్చారు. ఇంతింత వాళ్ళయిన వాళ్ళెంతో మంది ఉండగా ఆ గురుతుల్యుడి కుటుంబం ఈ స్థితిలో ఉండవలసి రావడం బాధాకరం. శోచనీయం. మొత్తంమీద యావద్భారత చలన చిత్ర పరిశ్రమకు కూడా ఇది అమోఘంగా బోలెడు ప్రతిష్ఠ తెచ్చిపెట్టేది కాదు.

ఇప్పుడు బొంబాయి నటీనటులు బాబురావ్ పెయింటర్ కుటుంబానికి సహాయం చేయడానికై ఓసారి క్రికెట్ ఆట ఆడాలని

# చలన చిత్ర కథ





"నయా అందాజ్" లో
మీనాకుమారి.

# అనకు; కనకు; వినకు
## [హిచ్ కాక్ కొత్త చిత్రం]

చెడ్డపని చెయ్యడం చాలా చెడ్డ పని. గహాచార్యంతో ప్రమేయానికి ఆస్కారం ఇవ్వడమే తప్పు. తప్పొప్పుల మాట ఎలా ఉన్నా, ముందు అమాంతం మీదకు విరుచుకుపడేది ముప్పు.

## బొంబాయి సినిమా లేఖ

సంకల్పించారు. ఇది కొల్హాపూర్ లో ఏర్పాటు చేస్తారట.

బొంబాయి నగరంలో ఎందుకు ఆడకూడదని సందేహం కలుగుతోంది. ఇక్కడ అయితే, కొల్హాపూర్ లో కన్న ఎక్కువ డబ్బు ఖర్చవుతుందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

అయినా కొల్హాపూర్ నే ఎన్నుకోవడానికి కారణం కనబడుతుంది.

కొల్హాపూరు చాలా బావుంటుంది. 'పిక్నిక్'లకీ మరీ బావుంటుంది. ఖులాసాగా కాలక్షేపం చెయ్యొచ్చు.

* * *

ఫిలింషాన్ వారి సినిమాస్కోప్ చిత్రం "త్రీహెడెడ్ కోబ్రా" (బాంబే ఫయిట్ 417)కు, లండన టెక్నికలర్ లేబరేటరీలో రంగుల ప్రతులు తయారవుతున్నాయి. కాని, ఈ చిత్రం ఇతివృత్తానికి భారత ప్రభుత్వం అభ్యంతరం చెప్పినందువల్ల ఇది మన దేశంలో ప్రదర్శించడం సాధ్యపడక పోవచ్చు. మన దేశంలో తయారైంది కాబట్టి విదేశాలలో ప్రదర్శనకు కూడా మన కేంద్ర సెన్సారు సంఘం ఆమోదం అవసరం...

అందువల్ల చెడును కనకు, అనకు, వినకు.

అనగనగా ఒక 'ఇన్స్తోకుహాడి' రాజు పేరు మాక్ కెన్నా. వైద్యుడు. భార్య జోసఫైన్. ఒకప్పుడు గాయనిగా ప్రసిద్ధిచెందింది. ఇంక, వాడి, ఏడేళ్ళ కుర్రవాడు. పేరు హ్యాంక్. ఒకసారి పారిస్ లో వైద్యుల సభకు వెళ్ళిన డా॥ మెకెన్నా, కుటుంబంతో నాలుగు దేశాలూ చూసి, ఇలు చేరబోయాడు. ఫ్రెంచి మొరాకోలోని మరాకేష్ నగరం చేరేసరికి, అక్కడ ఫ్రెంచి వర్తకుడినని చెప్పుకున్న బెర్నార్డ్ అనే ఆసామీ పరిచితుడయ్యాడు. అతనే వాళ్ళకి అక్కడ మంచిహోటలు చూపించి వెళ్ళాడు. ఆ హోటల్లో బ్రిటిష్ దంపతు లిద్దరితో స్నేహం కలిసింది. ఆయన పేరు డ్రేటన్. ఆవిడ పేరు జెస్సీ. మర్నాడు వారూ వీరూ కలసి ఊరు చూడబోయారు. అంతలోనే సంతలో సంచలనం రేగింది. వీపుమీద కత్తి గుచ్చుకున్న ఒక మనిషి తూలుతూ అతిప్రయాసమీద డాక్టర్ మెకెన్నా దగ్గరికి వచ్చి కూలిపోయాడు. అతను క్రితంరోజే పరిచితుడైన బెర్నార్డ్.

"లండన్ లో త్వరలోనే ఒక గొప్ప రాజకీయ నాయకుడి హత్య జరగబోతోంది. వివరాలకి అంబ్రోజ్ చాపెల్..." అంటూ రహస్యం చెప్పి బెర్నార్డ్ చనిపోయాడు. ఇదంతా ఏమిటో అంతుపట్టక డా॥ మెకెనా ఆశ్చర్యపడ్డాడు.

పోలీసులు అనుమానపడ్డారు. ఠాణాకి రమ్మన్నారు.

"మీ అబ్బాయిని నా భార్య హోటలుకి తీసుకువెళ్ళి ఆడిస్తుంది. మీకు నేను సాయం వస్తా పదండి" అన్నాడు కూడా ఉన్న బ్రిటిష్ మిత్రుడు డ్రేటన్.

ఠాణాలో నానా గొడవా జరిగింది.

అంతలో డా॥ మెకెనాను ఎవరో టెలిఫోన్ లో పిలిచారు. "బెర్నార్డ్ చెప్పిన రహస్యంలో ఒక్క మాట అయినా సరే పోలీసులకి చెప్పావో నీ కొడుకు నీకు దక్కడు. వాడిప్పుడు మా బందీగా ఉన్నాడు జాగ్రత్త" అని హెచ్చరించింది టెలిఫోను కంఠం.

మెకెనా కొయ్యబారిపోయాడు. ఇదేదో పెద్దకుట్ర కాబోలు. ఇందులో తన కొడుకు తుగప్పుయుక్క!... ఏమైనా సరే బెర్నార్డ్ చెప్పిన రహస్యం ఎవరికీ చెప్పరాదనుకున్నాడు. భార్యకు కూడా చెప్పలేదు ఈ బెదిరింపు విషయం మాత్రం డ్రేటన్ కి చెప్పాడు. "నేను ముందు వెళ్ళి హోటల్లో చూస్తా. మీరు మెల్లిగా రండి" అంటూ డ్రేటన్ హడావుడిగా బయల్దేరాడు.

మెకెనా దంపతులు హోటలుకి వెళ్ళేసరికి, డ్రేటన్ దంపతులు 40 నిమిషాల క్రితమే హోటలు ఖాళీచేసి వెళ్ళినట్లు తెలిసింది.

పిల్లవిషయం తెలియగానే గొల్లుమంది జోసఫైన్.

"ఇక్కడ ఏడ్చి లాభంలేదు. పోలీసులకి చెబితే మరీ ప్రమాదం. లండన్ వెళ్లి చూద్దాం పద" అన్నాడు మెకెనా. రాత్రికి రాత్రి విమానంలో వెళ్లారు. లండన్ లో వారు పోలీసుల స్వాగతాన్ని అందుకోవలసి వచ్చింది. స్కాట్లండ్ యార్డ్ సి ఐ డి శాఖ అధికారి, మెకెనా దంపతులకు సంగతి వివరించాడు. మరాకేష్ లో హత్యచేయబడ్డ వ్యక్తి పోలీసు ఉద్యోగి. ఒక కుట్రవిషయమై

చూపే తియ్యడానికి అక్కడికి వెళ్లాడు. చనిపోయేముందు రహస్యం చెప్పినది డా॥ మెకెనాకే కాబట్టి, ఆ రహస్యం కుట్ర గురించినదే అయిఉండాలి. అదేదో చెప్పమన్నాడు పోలీసుఅధికారి. ఈసారికూడా, డా॥ మెకెనాను టెలిఫోనులో ఎవరో పిలిచారు "చెప్పావంటే నీ బిడ్డడు దక్కడు" అని మళ్ళీ బెదిరించారు.

అందుకని మెకెనా ఏంచెప్పలేదు. వెళ్ళిపోయాడు. తన బిడ్డడిని తనే వెతకదలచాడు. చనిపోయిన బెర్నార్డ్, "వివరాలకి అంబ్రోజ్ చాపెల్" అన్నాడు. అక్కడ కనుక్కుంటే సరి. కొంత అవస్థ పడ్డ మీదట, అంబ్రోజ్ చాపెల్ కనబడింది.

ప్రశాంతంగాఉన్న వీధిలో ప్రశాంతంగాఉన్న ఆ చర్చిలో, ప్రశాంతతను అభినయిస్తూన్న డ్రేటన్ (మరాకేష్‌లో మెకెనా కొడుకుని అపహరించినవాడే) మతాచార్యుడి వేషంతో ప్రశాంతతను గురించి ఉపన్యసిస్తున్నాడు. ఆ చాపెల్ మేడ గదిలో, దారుణ హత్యాకాండకు ప్రశాంతంగా కుట్ర జరుగుతోంది. మరో గదిలో మెకెనా కొడుకు హాంక్ బందీగా ఉన్నాడు.

మెకెనా దంపతులు చర్చిలోకి వెళ్లగానే, ఉపన్యసిస్తున్న డ్రేటన్, అతని భార్య బెట్సీ కనబడ్డారు. వెంటనే పోలీసులకి టెలిఫోన్ చేసి పిలిపించమని డా॥ మెకెనా, భార్యని బయటకు పంపాడు. డ్రేటన్ ఇది గమనించి ప్రసంగం ముగించి శ్రోతలను పంపించివేశాడు. తలుపులు మూయించాడు. లోపలఉన్న మెకెన్నాకు స్పృహతప్పేలా కొట్టించాడు.

ఆ సాయంత్రమే, కుట్ర అమలు జరుగవలసి ఉంది. ఆ సాయంత్రం లండన్‌లో ఒక చోట పెద్ద గానసభ జరుగబోతోంది. దానికి, ఒక దేశపు ప్రధానమంత్రి అధ్యక్షత వహిస్తారు. ఒక నిర్ణీతమైన పాట ఉంది. ఆ పాటలో ఒక చరణం తరవాత, వాద్యబృందంలో, "సింబాల్స్" (పెద్ద సైజుకంచుతాళాలు) ఒకసారి మోగుతాయి. సరిగ్గా అదే క్షణంలో, ఆ చప్పుడులో కలిసిపోతూ ఒక రివాల్వర్ పేలుతుంది. ప్రధానమంత్రి చనిపోవాలి. ఆ ప్రధానమంత్రి ఏ దేశీయుడో ఆ దేశపు రాయబారే ఈ కుట్ర ఏర్పాటు చేయించాడు. ప్రధానిన్ని చంపవలసిఉన్న కిరాయి హంతకుడికి గానసభామందిరంలో వాటమైనచోట బాక్స్ రిజర్వ్ చేయించాడు. సింబాల్స్ మోగేది ఏక్షణంలోనో ఆ హంతకుడికి చెప్పడానికి, ఆ పాట స్వరాలు రాసి ఉన్న కాగితం ఒక అమ్మాయి చేతికిచ్చి హంతకుడి వెంట పంపించారు.

భర్త పనుపున పోలీసులను పిలువబోయిన జోసఫైన్ ప్రయత్నాలు కలిసి రాలేదు. ఆమె సరాసరి అల్బర్ట్ మ్యూజిక్ హాలుకి వెళ్ళింది. భర్త కనబడలేదు కాని, మెరాకెష్ హోటలులో ఒకసారి కనబడ్డ వికృతమైన మొహం ఒకటి కనబడింది. వాడే హంతకుడన్నమాట. గానసభ ప్రారంభమైంది జో నిలచిఉన్నచోటనుండి ప్రధానమంత్రి, ఆయనను చంపబోతున్న హంతకుడు కూడా కనబడుతున్నారు. పోలీసులకి చెప్పేస్తే తన కొడుకుకి ముప్పు. అంతలో భర్త ఎలాగో తప్పించుకుని వచ్చాడు రాగానే భర్తకి తన అనుమానం తెలియ చెప్పింది జో. మెకెనా మేడమీదికి పరుగెత్తాడు. ఈలోగా హంతకుడు రివాల్వరు గురిచూడడం గమనించింది జో. ఏం తోచక కెవ్వున కేక పెట్టింది. హంతకుడికి గురితప్పింది. గుండు, ప్రధాని జెబ్బను దూసుకపోయింది. ప్రధాని జోసఫైన్‌ను అభినందించారు. అన్నీ బాగున్నాయి. కాని, తన కొడుకు ఎక్కడున్నాడో ఏమయ్యాడో...

కొడుకు హాంక్ రాయబారి కార్యాలయంలో బందీగా ఉన్నాడు. కుట్ర విఫలమైంది కాబట్టి, ఆ కుర్రాణ్ని చంపడం అవసరమని ఆజ్ఞాపించాడు రాయబారి...

* * *

తన కొడుకు రాయబారి కార్యాలయంలోనే ఉంటాడని డా॥ మెకెనాకి అనుమానం. కారణంలేకుండా పోలీసులు విదేశీ రాయబారుల ఇళ్లు సోదా చెయ్యకూడదు. అందుకని తామే వెళ్ళి వెతక నిశ్చయించుకున్నారు మెకెనా దంపతులు.

ప్రధానమంత్రి రాయబారి కార్యాలయం విందులో పాల్గొంటున్నారు. జో వెళ్ళగానే, సాదరంగా మాట్లాడారు. రెండు పాటలు పాడుతానంది జో. ఈలోగా, భర్త ఆ భవనం అంతా వెతకడానికి వీలవుతుందని పథకం. జోసఫైన్ గొంతెత్తి పాడింది. "ఘటన ఎలాఉంటే అలా జరుగుతుంది" అని ఆ పాట అర్థం. ఘటన అనుకూలంగానే ఉంది. అందుకని, మేడమీద గదిలో బందీగాఉన్న ఆమె కుమారుడు 'హాంక్'కు ఆ పాట వినబడింది. ఉత్సాహంతో ఆ పిల్లవాడు ఆ పాటను ఈలమీద ఆలపించాడు. క్షణాల తేడాలో డా॥ మెకెనా కొడుకుఉన్న గదిని కనుక్కొని తీసుకు రాబోయాడు. కుట్ర ముఠా కిరాయి బొమ్మ, డ్రేటన్ కథని విషాదాంతం చెయ్యడానికి రివాల్వరు సహాయంతో చివరి ప్రయత్నం చేశాడు.

అయితేనేం.

"కె శారా, శారా."—ఘటన ఎలా ఉంటే అలా జరుగుతుంది. అందుకని దుర్మార్గుడు ఓడిపోయాడు. అమాయకుడు తన కొడుకుని కాపాడుకున్నాడు.

# 'మాలపిల్ల' నుంచి 'ముద్దుబిడ్డ' దాకా

మాలపిల్ల నుంచి ముద్దు బిడ్డదాకా అనేక చలనచిత్రాల రచయితగా, కవిగా, విమర్శకుడుగా, పత్రికా సంపాదకుడుగా, డబ్బయేళ్ళ యువకుడుగా ఆంధ్రులకు సుపరిచితులైన శ్రీ తాపీధర్మారావు గారికి సెప్టెంబరు 19 తేదీ సాయంత్రం మైలాపూర్ వుడ్ లాండ్స్‌లో సన్మానం జరిగింది. ఆయన 70వ జన్మదినోత్సవం జరపడానికి ఏర్పాటైన ఆసభలో మదరాసులోని పలువురు రచయితలు, ఫిలిం ప్రముఖులుపాల్గొన్నారు. శ్రీ వార్ల వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

కవిత్వం, విమర్శ, పత్రికారచన, సినిమా రచన, గ్రంథప్రచురణ మొదలైన అనేక శాఖలలో ముందంజవేసి నిలబడి ఆంధ్ర సాహితీరంగానికి ఎనలేని సేవచేసిన శ్రీధర్మారావుగారి బహుముఖ ప్రజ్ఞను కొనియాడుతూ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, గిడుగు సీతాపతి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వార్ల వెంకటేశ్వరరావు, సముద్రాల రాఘవాచార్యులు, న్యాయపతి రాఘవరావు, నిడదవోలు వెంకటరావు, డా॥ జి.వి. సుబ్బారావు, రేలంగి, విశ్వం, తిమ్మావజ్ఝల కోదండరామయ్య, తాతినేని ప్రకాశరావు, అనిసెట్టి సుబ్బారావు, ఇంకా పలువురు ప్రసంగించారు. శ్రీ ధర్మారావు తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ, ఉద్దండులయిన యిందరు సాహితీపరులు తమనీ విధంగా కొనియాడడం తమకు సంతోష కారణమనీ, ఈ ప్రశంసలలో ఏకాస్తయినా పాతికేళ్ళ క్రిందట లభించివుంటే ఎంత ప్రోత్సాహంతో ఆంధ్ర సాహితికి ఇతోధిక సేవ చేసి ఉండేవాడినో అని అన్నారు. సినిమా తారలు జి. వరలక్ష్మి, లక్ష్మీరాజ్యం మరి కొందరు శ్రీ నాయుడుగారికి బహుమతులు సమర్పించారు.

సన్మాన సభకు వచ్చిన వారికి శ్రీ తాపీ మోహనరావు, చాణక్య స్వాగతమిచ్చారు.



ఈ కథను పారమౌంట్ పిక్చర్స్ వారు "ది మాన్ హూ న్యూ టూమచ్" అనే పేరుతో విస్టావిజన్‌లో వర్ణచిత్రంగా నిర్మించారు. దర్శకుడు ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్. డా॥ మెకెనాగా జేమ్స్ స్టీవర్ట్, అతని భార్యగా డోరిస్ డే నటించారు.



(35 వ పేజీ తరువాయి)

కంగారుగా ఇటూ, అటూ చూస్తూ "అవును" అంది కనకమ్మ లక్ష్మిమాటలు అర్థం కాక.

అది గ్రహించి "ఫరవాలేదు లెండి. మీరు వ్రాసిన వుత్తరం ఆయన ముందు చదివేనాకు చూపించారు నిన్న," అంది మళ్ళీ నవ్వుతూ. అదేమిటన్నట్టు నివ్వెరపోయి చూసింది కనకమ్మ. లక్ష్మి జరిగిన కథంతా ఏకరవు పెట్టింది.

గోపాలం లక్ష్మిని పుట్టింటికి పంపుతానని, రిక్షా ఎక్కించి, తిన్నగా శంకరంగారి ఇంటికి తీసుకువెళ్ళేడు. బెజవాడ బస్తీ కాబట్టీ, పేటలు వేరు కాబట్టీ, కనకమ్మకి లక్ష్మి శంకరంగారి ఇంట్లో వున్నట్టు తెలియలేదు. ఈ సుమారు రెండు మాసాలూ గోపాలం, లక్ష్మి, శంకరం ఇంట్లోనే వున్నారు. శంకరం పట్టుదల్ల భోజనం కూడా వాళ్ళింట్లోనే. కనకమ్మకి అనుమానం రాకుండా, ఒకవారం రోజులు మాత్రం ఇంటి దగ్గర వున్నాడు. అక్కడికి వెళ్ళిన వెంటనే గోపాలం మామగారికి, తను ఇల్లుమారినట్లు తెలియచేశాడు. ఇక ముందు మామగారిని శంకరం ఇంటి చిరునామాకి జాబులు వ్రాయమని కోరాడు కనకమ్మ, లక్ష్మికి వ్రాసిన వుత్తరం, తాడేపల్లిగూడెం లక్ష్మి పుట్టింటికి వెళ్ళి, అక్కడ లక్ష్మి నాన్నగారు యీ కొత్తచిరునామాకి తిరిగి పంపగా, లక్ష్మికి నిన్న సాయంత్రం చేరింది. అందుచేత నాలుగురోజులు కాలయాపన అయింది.

గోపాలం ప్రవర్తనలో మార్పుకీ, సెలవు పెట్టడానికి శంకరం సలహా కారణం. కనకమ్మకి కొడుకు పాడవుతున్నాడు అనే అనుమానం కలగడానికి, అందుచేత లక్ష్మిని తీసుకురావాలనే సంకల్పం కలిగించడానికి, "ఎంతైనా తల్లి కాబట్టి కొడుకు పాడవడం చూడలేదు," అని వేసినపన్నుగడ. అన్నీ, శంకరం, గోపాలం తలచిన ప్రకారంగానే జరిగాయి ఇంచుమించు కనకమ్మ లక్ష్మిని రమ్మని వుత్తరం వ్రాసింది. దానిని బట్టి ఇకముందు, అత్తా కోడళ్లకు గొడవలు వుండకూడదు న్యాయంగా.

లక్ష్మి అంతా చెప్పి "అత్తయ్యగారూ మీరు మీ అబ్బాయిని పాడయ్యారని సందేహించక్కరలేదు. ఆయన అక్కడ మన ఇంటిదగ్గర లేనప్పుడు ఇక్కడ వుంటూవుండే వారు." అంది సగర్వంగా.

"అయితే ఇది అంతా అబ్బాయి ఆడిన నాటకం అంటావా?" అంది కనకమ్మ వికటంగా నవ్వుతూ. కనకమ్మ ధోరణికి "మళ్ళీ వేరె చెప్పాలా?" అని నవ్వేరు లక్ష్మి, శంకరం భార్య, అమ్మగారూను

కొంత సేపటికి గోపాలం వచ్చి "అమ్మా, ఆరుగంటలు అవుతోంది. రిక్షా సిద్ధంగా వుంది; రా, మళ్ళీ ఇంటికి వెళ్ళేక ఆలస్యం అయిందంటావు." అన్నాడు అతి విధేయుడులా.

"అదేమిటి? మరి లక్ష్మో!"

"ఎందుకు?" అన్నాడు వ్యంగ్యంగా.

"అంత నాటకమూ ఆడి ఏమీ తెలియదు పాపం! నా చేత అనిపించాలని కాబోసు; లక్ష్మి రాందే నేనూ రాను."

"అయితే శంకరం కర్మకాలిందే! ఇంతకీ లక్ష్మిని తీసుకురాక తప్పదంటావు; అంతేనా?" అన్నాడు గోపాలం ఎప్పుడూ తల్లి మాట జవదాటని వాడికిమల్లే.

కనకమ్మ లక్ష్మి ఒకే రిక్షాలో ఎక్కడం చూసి "నాఫీజు మాట" అని జ్ఞాపకం చేశాడు శంకరం, గోపాలానికి.

"ఏంత?... బిల్లు పంపు. ముఖమాట్లేం ఏమో."

"వృత్తికి ముఖమాటం ఏమిటి? నీ ఒక నెల జీతం."

"ఓస్సి అంతేనా!" అన్నాడు గోపాలం ఇంకో రిక్షా ఎక్కుతూ.





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street. Madras-1. Editor S. Sambhu Prasad.



తెలుగునాట సుప్రసిద్ధమైన పాలకొల్లు గాలిగోపురం

—ఫొటో : డి. ఎస్. రామమూర్తి.


అక్టోబరు 5 నుండి ఆంధ్ర దేశమంతటను
విడుదల...
నేషనల్ పిక్చర్సు వారి
రక్తకన్నీరు
(తెలుగు)
ఎం.ఆర్.రాధా • శ్రీరంజని
నటించినది
డైరెక్షన్.......కృష్ణన్ పంజు
సంభాషణలు.. పాలగుమ్మి పద్మరాజు
పాటలు............కృష్ణశాస్త్రి
GH RAO
...విజయ రిలీజ్...